# ఆంధ్రహితోపదేశము

మదరాసు, 1914

Record no. 537

## Bibliographic Record Target

ఆంధ్రహితోపదేశము.- 2. కూర్పు.- మదరాసు : జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల, 1914.

116 p. ; 22 cm.

Record no. 537

Āṃdhrahitōpadēśamu.- 2. kūrpu.- Madarāsu : Jyōtiṣmatī Mudrākṣaraśāla,1914.

116 p. ; 22 cm.

Record no. 537

శ్రీ

# ఆంధ్రహితోపదేశము.



వేదము - వేంకటరాయశాస్త్రిచేత

మదరాసులో

స్వకీయ

జ్యోతిష్మతీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

రెండవ కూర్పు.





1914

వెల 8 అ.] [Price 8 annas]

# ఆంధ్రహితోపదేశము.

## అవతారిక.

ప్రకటితపూర్వ మయిన సంస్కృత హితోపదేశమునకు అర్థబోధ నార్థమై లఘుటిప్పణముకన్న సమగ్రగ్రంథానువాదము ఉపయుక్తతర మని అట్టి యీ యనువాదమును ప్రకటించినాఁడ.

నీతి ఆబాలవృద్ధము ఎల్లవారికిని వలసినది గాన, ఈ యాంధ్ర ప్రబంధమును మూలనిరపేక్షముగా చదువ నర్హ మగునట్లు కడు సుబోధముగా రచియించినాఁడ.

ఆగస్టు, 1911. — వే. వేంకటరాయశాస్త్రి.





శ్రీ

# హితోపదేశము.

## ప్రస్తావిక.

**1.** గంగయొక్క నురువురేఖ యనునట్లుగా ఎవని శిరమున చంద్రకళ గలదో ఆశివుని యనుగ్రహమువలన సజ్జనులకు సాధింపవలసిన కార్యము సిద్ధించునుగాక.

**2.** ఈ హితోపదేశమును వినినయెడల సంస్కృత సంభాషణములందు నేర్పును, అన్ని విషయములందును మాటచతురతయు, నీతివిద్యయు, అలవడును.

**3.** బుద్ధిమంతుఁడు ముదిమియు చావును లేనివాఁడువోలె విద్యను ధనమును సాధింపవలయును, మృత్యువుచే జుట్టున పట్టుకోఁబడినవాఁడువోలె ధర్మము చేయవలయును.

**4.** ఎల్ల ధనములలోను విద్యయే సర్వశ్రేష్ఠమయిన ధన మని పెద్దలు చెప్పుదురు. ఏల యనఁగా, అది ఎప్పుడును హరింప నలవి గానిది, వెల లేనిది, తఱుఁగనిది.

**5.** ఏవిధముగా ఏఱు పల్లమునకు పాఱున దైవము నరుని (ఓడచేత) చేరరాని సముద్రమును చేర్చి అనంతరము (వర్తకముచే) ఐశ్వర్యము పొందించునో ఆవిధముగానే విద్య యొక్కటియే నీచునిపా లయినను ఆ నరుని (కొనిపోయి) చెనకరానివాఁ డయిన రాజునొద్ద చేర్చి అనంతరము ఐశ్వర్యము పొందించును.

**6.** విద్య వినయము నొసంగును, వినయమువలన (నరుఁడు) యోగ్యతను పొందును, యోగ్యతచేత ధనమును పడయును, ధనమువలన ధర్మము చేయును, దానిచేత సుఖము నొందును.

**7.** ఆయుధవిద్యయు శాస్త్రవిద్యయు, నని రెండు విద్యలు నేర్పనకై యేర్పడి యున్నవి; అందులో మొదటిది ముదిమిలో నగుఁబాటునకు పాత్ర మగును, రెండవది సర్వదా గౌరవింపఁబడును.

**8.** పండితునియందు గుణము లన్నియు (నుండును), మూర్ఖునియందు దోషములు మాత్రమే (ఉండును), కావున వేలకొలఁది మూర్ఖులకన్న ఒకపండితుఁడే అధికుఁడు.

**9.** క్రొత్త పాత్రమునందు అంటిన సంస్కారము చెడదు గావున, (అట్లే) బాలురకు కథలమూలముగా ఈగ్రంథములో నీతి నేర్పఁబడును.

**10.** మిత్రలాభము, మిత్రభేదము, విగ్రహము, సంధి, అను నాలుగు ప్రకరణములను పంచతంత్రము లోనగు గ్రంథములనుండి ఎత్తి వ్రాయుచున్నాను.

గంగయొడ్డున పాటలీపుత్త్రి మను పేరి పట్టణము గలదు. అందు ప్రభుగుణము లన్నియు గలిగి సుదర్శనుఁ డను పేరి రాజు ఉండెను. ఆరాజు ఒకనాఁడు ఈక్రింది రెండుశ్లోకములను ఎవరో పఠించుచుండఁగా వినెను:—

**11.** 'పెక్కుసంశయములను తెగఁగొట్టును, కనఁబడనిదానిని కనఁబఱుచును, కావున శాస్త్రము ఎల్లవారికిని కన్ను, అది ఎవనికి లేదో వాఁడు గ్రుడ్డివాఁడు.'

**12.** 'యౌవనము, ధనసమృద్ధి, దొరతనము, తెలివి లేమి,—ఇందు ఒకటొక టియు చెఱుపు చేయును; నాలుగును ఒక్కచోటనే చేరిన మఱి చెప్పవలయునా!'

ఇట్లు విన్నవాఁడయి ఆరాజు తనకుమారులు శాస్త్రము చదువక నిత్యము తప్పు దారిని నడచుచు శాస్త్రముప్రకారము నడచుకొనక యున్నందులకు మనస్సులో వగచి యీతీరున తలపోసెను.—

**13.** విద్వాంసుఁడును ధర్మమెఱింగినవాఁడును గాని పుత్త్రుఁడు పుట్టినమాత్రాన నేమి ప్రయోజనము? గ్రుడ్డికంటివలన కంటినొప్పి మాత్రమే గలుగును గాని, ప్రయోజన మే మున్నది?

**14.** పుట్టనివాఁడు, చచ్చినవాఁడు, చదువనివాఁడు-అను నీముగ్గురలో మొదటి యిరువురును కొంచెము మేలు, కడపటివాఁడు కొంచె మయినను మేలు గాఁడు; తొలి యిద్దఱు ఒక్కమాఱే దుఃఖపెట్టువారు, తుదివాఁడు మాటిమాటికి దుఃఖపెట్టుచుండును.

**15.** ఎవఁడు పుట్టి వంశమునకు కీర్తి తెచ్చునో వాఁడు పుట్టినవాఁడు; సుడియు చుండునట్టి జననమరణ ప్రవాహమందు చచ్చినవాఁ డెల్ల మరల పుట్టువాఁడే.

**16.** గుణవంతులసమూహమును లెక్కవ్రాయ నారంభించినప్పుడు ఎవనికిఁ గాను బలపము తటాలున గీఱ యిడదో, వానిచేతనే తల్లి పుత్త్రవంతురాలేని. మఱి గొడ్రాలు అనఁగా నెట్టిదో చెప్పుము. మఱియు;—

**17.** ఎవనిమనస్సు ఈవియందును తపస్సునందును శౌర్యమందును విద్యయందును ధనార్జనమందును ప్రవేశింపదో వాఁడు తల్లియొక్క నిష్ఠయే. మఱియు?—

**18.** గుణవంతుఁ డగు కొమరుఁడు ఒక్కఁడు మేలు; మూర్ఖులు నూర్లకొలఁదియు మేలు గారు. చంద్రుఁ డొక్కఁడు చీఁకటిని పోఁగొట్టును. నక్షత్రముల గుం పయినను పోఁగొట్టఁజాలరు.

**19.** ఎవఁడు మిక్కిలి కఠినతపస్సును ఏదేనొకపుణ్య తీర్థమున చేసెనో, వానికి కుమారుఁడు విధేయుఁడును సంపన్నుఁడును ధార్మికుఁడును బుద్ధిమంతుఁడును అగును.

ఇట్లును చెప్పుదురు.—**20.** ఓరాజా, సదా ధనప్రాప్తియు, రోగములేకుండు టయు, మిత్త్రుఁడును, ప్రియము పలుకు భార్యయు, విధేయుఁ డగు కుమారుఁడును, ధనమును కలుగఁజేయువిద్యయు,—ఈయాఱును ప్రాణిసమూహములకు సుఖములు. మఱియు;—



**21.** గాదెను నిండించెడి తూము లగునట్టి పెక్కండ్రు పుత్త్రులు ఉండుట యొకభాగ్యమా? తండ్రికి కీర్తి తెచ్చువాఁడు వంశమును నిలుపువాఁడు ఒకఁడు చాలును.

**22.** అప్పు చేయుతండ్రి శత్రుఁడు, ఱంకుటా లగుతల్లి శత్రువు, అందగత్తె యగు భార్యశత్రువు, చదువులేని పుత్త్రుఁడు శత్రువు.

**23.** అలవాటు పడనిచదువు విషము, జీర్ణముగాని యన్నము విషము, దరిద్రునికి సభ విషము, ముసలివానికి పడుచుభార్య విషము.

**24.** ఎట్టివానికి పుట్టినప్పటికిని గుణవంతుఁ డగు మనుష్యుఁడు గౌరవింపఁబడును; విల్లు పరిశుద్ధమయిన వంశముది (కులముది - వెదురుది) అయినను గుణము (యోగ్యత- అల్లెత్రాడు) లేనిదేని ఏమి చేయఁగలదు?

**25.** అయ్యయో! కొడుకా, చక్కఁగా (కాలము) గడపుకొన్నవాఁడా, ఈరాత్రులయందు చదువుకొనవైతివే? అందువలన నీవు బురదలోఎద్దువలె కూలిపోదువు.

కావున నాకుమారులను ఇప్పుడు గుణవంతులను జేయుటకు ఏమి ఉపాయము?

**26.** తిండి, నిద్ర, భయము, మైథునము—ఇవి పశువులకు ఎట్లో అట్లే నరులకును కలవు. కాని, (పశువులకన్న) నరులకు ధర్మమనునది ఒకటి విశేష మున్నది; ధర్మము లేనివారు పశువులతో సమానులు. ఏలనఁగా;—

**27.** ధర్మార్థకామమోక్షములలో ఒకటియేని ఎవనికి లేదో వానిపుట్టుక మేఁక మెడ చంటి పుట్టుకవలె నిష్ప్రయోజనము. ఇట్లు చెప్పుదురు.—

**28.** ఆయుస్సు, పనియు. ధనమును, చదువును, చావును—ఈ యయిదును ప్రాణికి (తల్లి)కడుపులో నున్నప్పుడే (బ్రహ్మచే) నియమింపఁబడును.

**29.** తప్పకుండ కలుగవలసిన దశావిశేషములు గొప్పవారికి సయితము తప్పవు. శివునికి దిసమొలతనమును, నారాయణునికి పెనుఁబాముమీఁద పరుండుటయు-ఇందులకు నిదర్శనములు.

30. మఱియు కానిది కానేరదు, కాఁగలది కాకమానదు.—ఈయెఱుక చింత యనెడు విషమును విఱిచెడుమందు, దీనిని ఏల త్రాగరు.

కాని యిది (అనఁగా పైమూఁడు శ్లోకములలోను చెప్పఁబడినవిషయము) ఎవరో పని చేయ నేరని సోమరులు పలుకుమాట:—

31. దైవమునే నమ్ముకొని ఎవఁడును తనప్రయత్నమును మానుకొనఁగూడదు; యత్నములేకుండ నువ్వులనుండి నూనెను ఎవఁడును పొందఁజాలఁడు. ఇంకొకటి.—

32. యత్నము సేయునట్టి యుత్తమపురుషునికి సిరిపట్టును, దైవ మిచ్చు ననుట దుర్జనులమాట. కావున, దైవమును త్రోసి నీశక్తికొలఁది యత్నముచేయుము; యత్నము చేసినను కార్యము నెఱవేఱదేని, అందువలన దోష మేమి?

33. ఒంటిచక్రముతో తేరు ఎట్లు పోనేరదో, అట్లే పురుషప్రయత్నము లేక దైవము ఫల మొసంగదు. అట్లే;—

34. పూర్వజన్మములో చేసినపని దైవ మని పెద్దలు చెప్పుదురు. కావున అలసత మాని పురుషప్రయత్నమును చేయవలయును.

35. ఏవిధముగా మట్టి ముద్దతో కర్త (కుమ్మరవాఁడు) తన కిచ్చ వచ్చినదాని నెల్ల చేయునో, అట్లే మనుష్యుఁడు తాను జేసినకర్మను పొందును.

36. ఎదుట కాకతాళీయముగా దొరకిన నిధిని సయితము దైవము ఎత్తి చేత పెట్టదు, పురుషప్రయత్నము వలసియున్నది.

37. పనులు ప్రయత్నముచేత నెఱవేఱును గాని కోరికలచేత నెఱవేఱవు; నిద్రించుచున్న సింగమునోట లేళ్లు (తమంతట తామే వచ్చి) చొరవు.

38. తల్లిదండ్రులు మాటిమాటికి నేర్పుచుండుటచేత బాలుఁడు గుణవంతుఁడగును. కడుపులోనుండి జాఱిపడిన మాత్రాన పుత్త్రుఁడు పండితుఁడు కానేరఁడు.

39. బాలునికి చదువు చెప్పింపరేని, తల్లి శత్రువు, తండ్రి పగవాఁడు, ఆబాలుఁడు హంసలనడుమ కొంగ యెట్లు ప్రకాశింపదో అట్లే సభలో ప్రకాశింపఁడు.

40. సౌందర్యము యౌవనము కలవారైనను గొప్పవంశమునందు పుట్టినవారైనను చదువులేనివారు, తావి లేని మోదుగుపూవులవలె శోభింపరు.

41. ఎవఁడు పుస్తకములనుండి చదువుకొనలేదో గురువులయొద్ద చదువుకొనలేదో వాఁడు జారునిచేత కడుపుచేయించుకొన్న స్త్రీలవలె సభలో శోభింపఁడు.

42. మూర్ఖుఁడు సయితము వస్త్రములు దాల్చి సభలో ప్రకాశించును; ఎంతసేపు ప్రకాశించు ననఁగా, నోరు తెఱచి రవంత పలుకునంతదాఁక ప్రకాశించును.

ఇట్లు తలపోసి యారాజు పండితసభను కూర్పించి పండితులతో నిట్లు పలికెను.— 'ఓపండితులారా వినుఁడు; నాకుమారులు శాస్త్రములు చదువక సదా తప్పునడవడిలో నున్నారు, వారికి, ఇపుడు నీతిశాస్త్రమును నేర్పి (విద్యవలని రెండవపుట్టుక నొసంగఁగలయట్టి పండితుఁ డెవఁడేనియుం గలఁడా? ఏల యనఁగా;—

43. గాజు పెంకు బంగారముతో కూడినయెడల పచ్చయొక్క కాంతిని పొందును; అట్లే పెద్దల సాంగత్యముచేత మూర్ఖుఁడు సయితము తెలివిని పొందును. చెప్పిరిగదా;—

44. నాయనా, నీచులతోడి సహవాసముచేత బుద్ధి తఱిఁగిపోవును. సమానులతో చేరిన సమముగానే యుండును, గొప్పవారితో చేరిన గొప్పతనమును పొందును.'

అంతలో విష్ణుశర్మ యను మహాపండితుఁడు బృహస్పతివలె సకల నీతిశాస్త్రమర్మము లెఱిఁగినవాఁడు ఇట్లు పలికెను.—



'రాజా, ఈరాకొమరులు గొప్పవంశమునఁ బుట్టినవారు, కావున వారికి నీతి నేర్పుటకు నాకు శక్య మగును. ఎట్లన.—

45. పనికిమాలిన వస్తువుమీఁద వినియోగించిన పాటు ఫలింపనేరదు; వేయి పాట్లు పడినను చిలుకనుంబోలె కొంగను మాటలాడింపలేము.— మఱియొకటి.—

46. ఈ మీగోత్రములో గుణము లేని బిడ్డ పుట్టదు, కెంపులగనిలో గాజుతాయి ఉద్భవించునా?

కావున నేను ఆఱు నెలలలో నీకుమారులను నీతిశాస్త్రపండితులనుగా చేసెదను.'

ఈమాటవిని రాజు వినయపూర్వకముగా మరల పలికెను.—

47. పురుగు సయితము పూవులతోఁ గూడి గొప్పవారి తలకెక్కును; పెద్దలచేత చక్కఁగా ప్రతిష్ఠింపఁబడిన ఱాయి సయితము దేవత యగును. మఱియు,

48. పొడుపుఁగొండలోని వస్తువు సూర్యుని చేరువుచేత ఎట్లు ప్రకాశించునో, అట్లే, పెద్దలతోడి సాంగత్యముచేత తక్కువ కులమువాఁడు సయితము ప్రకాశించును.

49. గుణములు గుణమెఱుఁగువారిని చేరినా గుణము లగును, అవే గుణహీనులం జేరినా దోషము లగును; నీళ్లు ఏళ్లలో చేరిన త్రాగఁదగిన వగును, సముద్రములో చేరిన త్రాగఁదగని వగును.

కావున ఈనాకుమారులకు నీతిశాస్త్రము నేర్పునట్టి భారము మీఁది. ఇట్లు వచించి విష్ణుశర్మకు సత్కారపూర్వకముగా కుమారుల నప్పగించెను.

---

*

# హితోపదేశము.

## మిత్త్రలాభము.

అనంతరము మేడమీఁద ఆరాజపుత్త్రులను హాయిగా కూర్చుండఁబెట్టుకొని వానితో ప్రస్తావవశముగా ఆపండితుఁడు వచించెను.—

1. ‘విద్య యనునది నరునికి గొప్ప సౌందర్యము, విద్య మిక్కిలి దాఁపఁబడిన ధనము, విద్య దేశాంతరము పోవుటలో మిత్త్రము, విద్య తెలుఁగని జీతము, విద్యవలన కీర్తి కలుగును, సభ వశపడును, విద్య శ్రేష్ఠమయినకన్ను. ఈలోకములో విద్య బ్రదుకుఁ దెరువు, విద్యలేనివాఁడు పసరము.

గంగ లేని దేశము చెడినది, విద్యలేని కులము చెడినది, కానుపులేని స్త్రీ చెడినది, దక్షిణ లేని యజ్ఞము చెడినది.

2. బుద్ధిమంతులకు కావ్యశాస్త్రములందలి వినోదానుభవముచే కాలముగడచును, మూర్ఖుల కన్ననో త్రాగుడు జూదము మొదలయిన చెడుపనులచేతఁగాని నిద్ర చేతఁగాని జగడములచేతఁగాని కాలము గడచును.

కావున మీకు వినోదముకొఱకు కాకి తాఁబేలు మొదలగువాని కథ చెప్పెదను.’

రాజపుత్త్రులు ‘అయ్యా, చెప్పుఁడు.’ అని పలికిరి.

విష్ణుశర్మ చెప్పెను.—వినుఁడు. ఇదే మిత్త్రలు లభించుటను చెప్పెదను, అందులో ఇది తొలి శ్లోకము:—

3. బుద్ధిమంతులగు మంచి చెలికాండ్రు సాధనములును ధనమును లేనివారయినను కాకి, తాఁబేలు, లేడి, ఎలుకయుంబోలె తమపనులను త్వరగా నెఱవేర్చుకొందురు.

రాజపుత్త్రులడిగిరి—‘అదియెట్లు?’ విష్ణుశర్మ చెప్పుచున్నాఁడు.—

గోదావరియొడ్డున గొప్ప బూరుగుచెట్టు కలదు. అందు నానాదిగ్దేశములనుండి వచ్చి రాత్రి పక్షులు వసించును. అట్లుండ నొకానొకప్పుడు రాత్రి ముగియఁగానే, కలువలదొరయగు చంద్రదేవుఁడు క్రుంకుమెట్ట శిఖరమును పట్టియుండఁగా లఘుపతనకుఁడను పేరి కాకి మేల్కొన్నదై అపరయమదేవతనుంబోలె వచ్చుచున్న వేటకాని నొకనిం గాంచెను. కాంచి యిట్లు చింతించెను. — ‘నేఁడు తెల్లవాఱఁగానే చెడుదర్శనమయినది, ఏమి కీడును సూచించుటకో ఎఱుఁగను?’ ఇట్లనుకొని వానివెంబడి చింతిల్లుచు ఎగిరిపోయెను. ఏలన.—

4. వేలకొలఁది శోకకారణములును నూఱులకొలది భయకారణములును ప్రతిదినమును మూర్ఖునికి కలుగును, వివేకవంతునికి కలుగవు.



మఱియు విషయాసక్తులు అవశ్యముగా ఇట్లు చేయవలయును;

5. ప్రతిదినము నిద్ర మేల్కొనఁగానే—‘ఈదినము గొప్ప యాపద ఏమిసంభవించును? చావా, రోగమా, దుఃఖమా?— అని ఆలోచించుకొనవలయును.

తర్వాత ఆవేటకాఁడు బియ్యపునూకలను చల్లి వలయొగ్గి తాను దాఁగియుండెను. ఆవేళకు చిత్రగ్రీవుఁ డను పావురములరాజు పరివారముతోఁ గూడ ఆకాశమునం బోవుచు ఆబియ్యపునూకలను గాంచెను. అంతట పావురములు ఆనూకలకై ఆసపడఁగా పావురములదొర వానితో నిట్లనెను.— ‘ఇట నిర్మానుష్య మయిన యీయడవిలో బియ్యపు నూకలు ఎట్లు వచ్చినవి? కనుక చక్కఁగా పరికింపుఁడు. ఇది మేలు గాదని నాకు తోఁచుచున్నది. ప్రాయికముగా మనమును ఈనూకలయాశచేత,—

6. మురుగునకు ఆసపడి లేచిరా శక్యముగాని బురదలో దిగఁబడిన యాబాటసారి ముసలిపులి పాలిటంబడి యెట్లు చచ్చెనో,—

అట్లు అగుదుము గావలయు. ‘అది యెట్లు?’ అని పావురములు అడిగినవి. చిత్రగ్రీవుఁడు చెప్పందొడంగెను.

### కథ. ౧.

నే నొకప్పుడు దక్షిణపుటడవిలో తిరుగుచు చూచితిని. ఒకముసలిపులి స్నానము చేసి దర్భలు చేతఁబట్టుకొని చెఱువుగట్టున నుండి ‘ఓహో తెరువరీ ఇదిగో ఈ బంగారపు మురుగును పుచ్చుకొమ్ము.’ అని చెప్పినది అంతట ఒక తెరువరి ఆశాపీడితుఁడై యిట్లు తలపోసెను.—‘భాగ్యముచేత ఇది దొరకుచున్నది. కాని, ప్రాణమును సందేహము పాలు చేసెడి యీపనిలో ప్రవేశించుట సరిగాదు. ఏల యనఁగా.—

7. చెడుదానివలన ఇష్టార్థము దొరకినను దానిచే మేలు గలుగదు; విషము కలసియున్నయెడల అమృతము నయితము చావునే తెచ్చును.

కాని, ఎక్కడను ధనసంపాదనకైన యత్నములో సందేహమే. అట్లే పెద్దలు చెప్పియున్నారు.—

8. నరుఁడు సంశయములో పడక మేలు పొందఁడు. సంశయములో పడియు బ్రదికెనేని మేలు నొందును.

కావున దీనిని పరికించెదను.’ (ఇట్లాలోచించుకొని) బిగ్గరగా అడిగెను ‘ఏదీ నీమురుగు?’ అని. పులిచేయి చాఁపి చూపించినది. ‘క్రూరహృదయము కలయట్టి నిన్ను నే నెట్లు నమ్మెదను ?’ అని బాటసారి యడిగెను. పులి చెప్పుచున్నది:— ‘వినరా ఓ బాటసారీ, పూర్వము నేను యౌవనమం దున్నప్పుడు మిక్కిలి చెడునడువడి కలిగియుంటిని. నేను గోవులను మనుష్యులను విస్తారముగా చంపిన పాపముచేత నాకొమారులును భార్యయు మృతిఁజెందిరి. నాకు వంశము పోయినది. అంతట, నాకు ఒకమహాత్ముఁడు

దానధర్మాదికము సేయుమని ఉపదేశించినాఁడు. అతని యుపదేశంబున నే నిప్పుడు నిత్యము స్నానము సేయుచు దానము లిచ్చుచు ముసలినై గోళ్లును పండ్లును ఊడి యున్నాను. నన్ను నమ్మకుండుట యెట్లు? ఏల యనఁగా,—

9. యజ్ఞములు సేయుట, వేదము చదువుట, దానము లిచ్చుట, తపస్సు చేయుట, సత్యమాడుట, సంతోషము, ఓర్పు, లోభము లేమి, అని ధర్మము ఎనిమిదిప్రకారములుగా చెప్పఁబడియున్నది.

10. అందులో తొలి నాలుగింటిని డంబముకొఱకయినను ఆచరింతురు. కడమ నాలుగును మహాత్మునియందుమాత్రమే ఉండును.

నాకు లోభము బొత్తిగా పోయినది. దానంజేసి నాచేతికి పెట్టుకొన్నదైనను ఈబంగారు మురుగును ఎవనికేని ఈఁదలఁచుచున్నాను. అయినను పులి మనుష్యులను తిను ననెడు లోకవాదమును నివారింప నెవరితరము! ఏల యనఁగా,—

11. లోకులు ఒకఁడు పోయినదారినే పోవువారు; కుంటెనగత్తె ధర్మమే చెప్పినను దానిని నమ్మరు; ఆవును చంపినవాఁడయినను బ్రాహ్మణుఁడు చెప్పిన నమ్ముదురు.

నేనును ధర్మశాస్త్రమును పఠించితిని, వినుము.

12. ఓయీ ధర్మరాజా, నిర్జలప్రదేశములో కురిసిన వానవలెను, ఆఁకలిగొన్న వానికిఁ బెట్టిన యన్నమువలెను, పేదకు ఇచ్చిన దానము సఫలమగును.

13. తమప్రాణములు తమ కెట్లు ప్రియములో, ఇతరజంతువులప్రాణములును వానికి అట్లే ప్రియములు; పెద్దలు తమసాటిచేత ఇతరజంతువులయందును దయ సేయుదురు.

మఱియు;—14. నిరాకరించుటయందును, ఇచ్చుటయందును, సుఖమందును, దుఃఖమందును, ప్రియమందును, అప్రియమందును, మనుష్యుఁడు తనసాటిచేత నమ్మకము చెందును.

ఇంకను;—15. పరభార్యను తనతల్లివలెను, పరధనములను మట్టిబెడ్డవలెను, ఎల్ల జంతువులను తనవలెను, ఎవఁడు చూచునో వాఁడు తెలివిగలవాఁడు.

నీవా నిజము పేదవు; కావున నీకిచ్చుటకు నేను కడంగినాఁడను. అట్లే పెద్దలు చెప్పినారు;—

16. ఓయి ధర్మరాజా, పేదలను బ్రోవుము; ధనవంతులకు ధనమును ఈకుము; రోగికి మందు హితముగాని, నీరోగునికి మందులవలన నేమిప్రయోజనము? ఇంకొకటి;—

17. కేవలము దానము చేయుకోరికచేత, తనకు పూర్వము ఉపకారము చేసిన కారణమునఁ గాక, తనకు ఉపకార మేమియు చేసియుండనివానికి, మంచిచోట, మంచి కాలములో, పాత్రునికి ఏదానము చేయఁబడునో, ఆదానము సాత్త్వికదానముగా చెప్పఁబడినది.



కావున ఇట చెఱువులో స్నానముచేసి యీబంగారపు మురుగును పుచ్చుకొమ్ము. అంతట దానిమాటలచే నమ్మకము కలిగి ఆబ్రాహ్మణుఁడు ఆశచేత, చెఱువులోనికి స్నానార్థము ప్రవేశించి పెనుబురదలో దిగఁబడి, పాఱిపోవుటకు అశక్తుఁడాయెను. అడుసులో దిగఁబడిన యాతనిం జూచి పులి యిట్లనియె.— 'అయ్యయ్యో! ఎంతటి యూబిలో పడితివి! నిన్ను లేవఁదివిచెదనులే.' ఇట్లుపలుకుచు మెల్లఁగా దగ్గఱి పులి బాటసారిని పట్టుకొనెను. అంతట నాతఁ డిట్లు తలపోసికొనెను.—

18 'దుష్టస్వభావుఁడు ధర్మశాస్త్రము చదివినను వేదాధ్యయనము చేసినను వానిని నమ్మరాదు. ఏలన, స్వభావముచేతనే ఆవుపాలు ఎట్లు మధురములో అట్లే స్వభావమే బలిష్ఠముగా నుండును. మఱియు;—

19. ఇంద్రియములను మనస్సును నిగ్రహించుకోలేనివారి నడువడి, ఏనుఁగు స్నానము వంటిది. నడువడిలేని జ్ఞానము కురూపికి ఆభరణమువలె బరువుమాత్రమే.

కావున నేను చేసినది సరిగాదు. ఏ దనఁగా, క్రూరస్వభావము గలదైన యీపులిని నమ్ముట. పెద్దలు చెప్పినారు గదా;—

20. ఏళ్లను, ఆయుధహస్తులను, గోళ్లు గల జంతువులను, కొమ్ములు గల జంతువులను, స్త్రీలను, అట్లే రాజులను, నమ్మఁగూడదు. మఱియు;—

21. ఎల్లవారికిని స్వభావమును పరీక్షింతురేగాని ఇతర గుణములను పరీక్షింపరు. ఏల యన, ఇతరగుణముల నెల్ల అతిక్రమించి స్వభావము వానినెత్తిమీఁద నుండును.

మఱియు.—22. ఈసూర్యుఁడు ఆకాశమున చరించువాఁడు, పాపముల నడంచువాఁడు, వేయికిరణములను దాల్చువాఁడు, జ్యోతిర్మండలమునడుమ సంచరించువాఁడు. అట్టియీతఁడు సయితము రాహువుచే మ్రింగఁబడుచున్నాఁడు. నొసట వ్రాసిన వ్రాఁతను తుడిచివైవ నెవనితరము?'

ఇట్లు తలపోసికొనుచునే బ్రాహ్మణుఁడు పులిచేత చంపఁబడి తినంబడెను. కావున విచారించుకోక ఏపనిని గాని చేయనే కూడదు. ఏల యనఁగా;—

23. చక్కఁగా జీర్ణమయినయన్నము, మంచితెలివి గలకుమారుఁడు, చక్కఁగా ఏలఁబడిన భార్య, చక్కఁగా కొలువంబడినరాజు, చక్కఁగా ఆలోచించుకొని చెప్పిన మాట, చక్కఁగా విచారించుకొని చేసినపని - ఇవి చిరకాలమునకయినను చెడిపోవు.

ఈమాటను విని ఒకపావురము గర్వముకొలఁది యి ట్లనియె.—'ఇసీ! ఏమి యిట్లు పలికెదవు?

24. ఆపత్కాలము వచ్చినప్పుడు ముసలివానిమాటబడి [illegible] భోజనమందుమాత్రము తప్ప అన్నిటను సంశయము మాని అట్లే చేయవలయును. ఏలన;—

25. లోకములో అన్నమేమి పానమేమి సర్వమును శంకాస్పదముగా నున్నది; ఇట్లుండఁగా ఎందు ప్రవేశింపను? ఎట్లు జీవనము సేయను? చెప్పినారు గదా;—

26. ఈసు గలవాఁడు, రోఁతపడువాఁడు, తుష్టి లేనివాఁడు, కోపస్వభావుఁడు, సదా సంశయించుచుండువాఁడు, ఒకరిభాగ్యము నాశ్రయించి బ్రదుకువాఁడు,— ఈ యాఱుగురును దుఃఖమును పొందుదురు.'

ఈమాట విని పావురము లన్నియు అట వ్రాలినవి. ఏల యన;—

27. మిక్కిలి గొప్పశాస్త్రములను చదివినవారు మిక్కిలి వినికి గలవారు ఒరుల సంశయములను ఛేదించువారు సయితము లోభముచేత అజ్ఞానమునం గూలి బాధపడుదురు. మఱియు;—

28. లోభమువలన కోపము కలుగును, లోభమువలన కామము కలుగును, లోభమువలననే అజ్ఞానమును నాశమును కలుగును, లోభము పాపమునకు కారణము. మఱియు;—

29. బంగారపులేడిపుట్టుక సంభవించునట్టిది గాదు. అట్లయినను శ్రీరాముఁడు అట్టిలేడికి ఆసించెను. తఱచుగా వినాశకాలము సంప్రాప్తించెనేని మంచి తెలివిగలవారికి సయితము బుద్ధి చెడును.—

తరువాత అన్నియు వలలో తగులుకొన్నవి. అంతట ఏపావురము మాటవలన అందులో ప్రవేశించినవో దానిని అన్నియు తిట్టసాగినవి. ఏల యనఁగా;—

30. గుంపునకు మొనగాఁడుగా పోఁగూడదు; కార్యము నెఱవేఱినచో ఫలము తనకును అందఱితో సమానమే. కార్యము చెడెనేని అందఱిలోను మొనగానిని చంపివైతురు. పెద్దలు చెప్పుదురు,—

31. ఇంద్రియములను కట్టకుండుట ఆపదలదారి యని చెప్పఁబడినది; ఇంద్రియజయము సంపదలకు మార్గముగా నున్నది. ఏదారిని పోవ నిష్టమో ఆదారిని పొమ్ము.—

దానిని కడమపావురములు నిందించుట గాంచి చిత్రగ్రీవుఁడు పలికెను. 'ఇది యీతని తప్పు గాదు. ఏ లన,—

32. ఆపదలు వచ్చునప్పుడు ఆప్తుఁడు సయితము అందులకు కారణ మగును; దూడను కట్టుటకు తల్లి పిక్కయే కంబ మగుచున్నది. మఱియు;—

33. ఆపదనుండి ఎవఁడు రక్షించునో వాఁడు బంధువుగాని భయపడినవారిని రక్షించుట యను పనిని నిందించుటయందు నేర్పుమాపువాఁడు బంధువు గాఁడు.

ఆపత్కాలమందు దిగులుపడుచునే యుండుటకా పురుషలక్షణము. కావున ఈవిషయములో ధైర్య మవలంబించి ఇడుములకు ప్రతిక్రియను ఆలోచింపవలయును.

ఏ లన;—34. ఆపద వచ్చినప్పుడు ధైర్యము, మేలు కలిగినప్పుడు ఓరిమి, సభలో మాటనేర్పు, యుద్ధములో పరాక్రమము, కీర్తియందు ఇచ్ఛ, వినికియందు ఆసక్తి,— ఇది మహాత్ములకు స్వభావసిద్ధము.



35. ఎవనికి - సంపదలో గర్వమును, ఇడుమలో దిగులును, పోరిలో పిఱికితనమును, లేవో - మూఁడు లోకములకును లలాటాలంకార మయిన యా పుత్త్రుని తల్లి అరుదుగా కనును. మఱియు;—

36. ఐశ్వర్యమును కోరిన పురుషుఁడు ఈయాఱు దోషములను మానవలయును.— ఏ వనఁగా—నిద్ర, కునికిపాటు, భయము, కోపము, సోమరితనము, పనిని చాలసేపటికి చేయుట.

ఇప్పు డయినను ఇట్లు చేయుదము; అందఱము ఒక్కటియే ఆలోచన గలవారమై వలను తన్నుకొని ఎగిరి పోవుదము. ఏల యనఁగా.—

37. అల్పవస్తువులు సయితము ఒకటిగా కలసినయెడల కార్యమును సాధించును. వెంటిగా పేనఁబడిన గడ్డిపోఁచలతో మదపుటేనుఁగులను కట్టివైతురు.

38. తమ కులమువారితో అల్పులతో నయినను కూడిక పురుషునికి మేలు సేయును. ఊఁక వదలిన బియ్యపుగింజలు మొలవవు.'—

ఇట్లాలోచించుకొని పక్షు లన్నియు వలను తన్నుకొని యెగిరిపోయినవి.

తర్వాత ఆవేఁటకాఁడు కడుదూరమునకు వలఁ గొనిపోవుచున్న యాపక్షులను చూచి వెంటం బడు విడుచు తలపోసెను;—

39. 'ఈపక్షులు నావలను మొత్తముగా కూడి కొనిపోవుచున్నవి. ఇవి ఎప్పుడు నేల వ్రాలునో అప్పుడు నాకు వశపడును.'

అనంతరము ఆపక్షులు చూపుమేర దాఁటి పోఁగా వేఁటకాఁడు వెనుకకు మరలెను. వాఁడు వెనుకకు మరలుటం గాంచి పావురములు 'ఇప్పు డేమి చేయఁదగును?' అని యడిగినవి. చిత్రగ్రీవుఁడు చెప్పెను.—

40. 'తల్లి, చెలికాఁడు, తండ్రి - అని ఈముగ్గురును స్వభావముచేతనే హితులు. కార్యమునుబట్టి యితరులు హితబుద్ధి గలవా రగుదురు.

కనుక, మా చెలికాఁడు హిరణ్యకుఁ డనెడి యెలుకదొర గండకీనదిదరిని చిత్రవనములో కాపురమున్నాఁడు, పండ్లబలముచేత అతఁడు మనవలను తెగఁగొఱుకఁ గలఁడు.' ఇట్లాలోచించి అన్నియు హిరణ్యకునిలాఁగకడకుం బోయినవి.

హిరణ్యకుఁడు సర్వదా అపాయభయముచేత నూఱుద్వారముల బొక్క చేసికొని అందులో నివసించుచుండెను.

41. రాఁగల భయమును తలపోసికొని నీతిశాస్త్రపండితుఁ డయిన యాముసలి యెలుక నూఱుదారుల లాఁగలో నచ్చట వసించుచుండెను.

అంతట హిరణ్యకుఁడు పావురములు వ్రాలినందులకు భయపడి బెదరి యూరకుండెను. 'చెలికాఁడా. హిరణ్యకుఁడా, ఏమి మాతో పలుకకున్నావు?' అని చిత్రగ్రీవుఁడు

అడిగెను. అంతట హిరణ్యకుఁడు అతని యెలుఁగును ఆనవాలుపట్టి, తొట్రుపాటుతో వెలువడి యి ట్లనియె; 'ఆహా! పుణ్యాత్ముఁడ నయితిని! నా నెచ్చెలి చిత్రగ్రీవుఁడు వచ్చినాఁడు.—

42. ఎవనికి చెలికానితో మాట లాడుటయు, చెలికానితో కూడ నుండుటయు, చెలికానితో గోష్ఠియు, కలుగునో వానికన్న పుణ్యాత్ముఁడు ఈలోకములో లేఁడు.'

వలలో తగులుకొన్న యీపక్షులను చూచి నివ్వెఱపడి క్షణ మూరకుండి 'చెలికాఁడా! ఏమి యిది!' అని యడిగెను. చిత్రగ్రీవుఁడు ఇట్లనియె:—'మిత్త్రమా, ఇది పూర్వజన్మమందు మేము చేసికొన్న చేఁతలకు ఫలము.

43. 44. ఎందువలన, ఎందుచేత, ఏప్రకారము, ఎప్పుడు, ఏది, ఎంత, ఎక్కడ, తాను చేసిన మంచిపనిగాని చెడ్డపనిగాని కలదో, అందువలన, అందుచేత, ఆప్రకారము, అప్పుడు, అది, అంత, అక్కడ, బ్రహ్మదేవుని యాజ్ఞచేత ప్రాప్తించును.

45. రోగము, శోకము, సంతాపము, ఖయిదు, జూదము లోనగువ్యసనములును, మనుష్యులు పూర్వజన్మమందు తాము చేసికొన్న పాపవృక్షము పండిన పండ్లు.'

ఈమాట విని హిరణ్యకుఁడు వడివడిగా చిత్రగ్రీవుని కట్టును తెగఁగొఱుకుటకు వచ్చినాఁడు. చిత్రగ్రీవుఁడు 'మిత్త్రుఁడా, అట్లు చేయకుము; మఱి నా యాశ్రితు లగు వీరి యురులను ముందుగా త్రెంపుము. నాయురులను తర్వాత కొఱుకుదువు గాని.' అని యాఁపెను! 'నాకు శక్తి కొంచెము, నాదంతములు దుర్బలములు; వీరి యురులను కొఱుకుటకు నావలన నెట్లగును? నాపండ్లు విఱుగకుండునంతవఱకు నీయురులను తెగఁ గొఱికెదను. తర్వాత శక్య మయినంతవఱకు వీరియురులను కూడ కొఱికెదను.' అని హిరణ్యకుఁడు బదులు చెప్పెను. 'అది సరియే గాని, అయినను వీరియురులనే శక్తియున్నంతవఱకు కొఱికివైవుము.' అని చిత్రగ్రీవుఁడు వెండియుం బలికెను. అందులకు హిరణ్యకుఁడు ఇట్లనియె.—ఈవిధముగా తన్ను వదలుకొని ఆశ్రితులను రక్షించుట నీతికోవిదులకు సమ్మతము గాదు. ఏల యనఁగా,—

46. ఆపదను నివారించుకొనుటకై ధనమును కాపాడుకొనవలయును; ధనమును నయితము వ్యయించి భార్యను రక్షించుకొనవలయును; భార్యను నయితము ధనమును నయితము ఇచ్చివైచి తన్నుఁ గాపాడుకొనవలయును. మఱియు;—

47. ధర్మము, అర్థము, కామము, మోక్షమును, ప్రాణము లున్నయెడల నుండునట్టివి. ఆప్రాణములను పోఁగొట్టుట సర్వమును పోఁగొట్టుటయే, వానిని కాపాడుట సమస్తమును కాపాడుటయే.'

అందులకు చిత్రగ్రీవుఁ డిట్లనియె:—'చెలికాఁడా, నీతి యేమో నీవు చెప్పినట్లే; [illegible] నేను నాయాశ్రితుల దుఃఖమును బొత్తిగా చూడఁజాలను. కావున నిట్లు



చెప్పితిని; ఏల యనఁగా.—

48. బుద్ధిమంతుఁడు ధనమును ప్రాణమును ఇతరులకై వదల వలయును; చావు తప్పకుండ సంభవించి యున్నప్పుడు మంచినిమిత్తమున ప్రాణము వదలుట మేలు.

49. వీరు జాతిలోను ద్రవ్యములోను బలములోను నాతో సమానులే. నేను దొర నయిన ఫలము వీరికి ఎప్పుడో ఏమో చెప్పుము. మఱియు;—

50. ఓచెలికాఁడా, మాంసము, మూత్రము, మలము, ఎముక, అను వీనితో చేయఁబడిన యీ యస్థిరదేహమందు అభిమానమును మాని నాకీర్తిని రక్షింపుము.

51. మఱియు;—జీతము లేకయే వీరు నాచెంతఁ బాయకయున్నారు; కావున నాప్రాణము నయినను వెచ్చించి వీరిని నాయాశ్రితులను బ్రతికింపుము. మఱి యొకటి కనుము;—

52. నిత్యమును నిర్మలమును అయినకీర్తి అనిత్యమును మలమును మోచునదియు నయిన దేహముచేత లభించు నేని ఇఁక దానిచేత సర్వమును లభించినదే. ఏ లన;—

53. శరీరమునకు గుణములకు భేదము మిక్కిలి గొప్పది; శరీరము క్షణములో నశించునట్టిది, గుణములు కల్పాంతమువఱకు నుండునట్టివి.'

ఈమాటలు విని హిరణ్యకుఁడు సంతుష్టాంతరంగుండై ఒడలెల్ల గగుర్పొడిచి యిట్లనియె.—'బళీ! చెలికాఁడా, బళీ! ఈయాశ్రితవాత్సల్యముచేత నీవు మూఁడు లోకములకును దొరవు కాఁదగుదువు.' ఇట్లు వచించి హిరణ్యకుఁడు ఆపావురములకు అన్నిటికిని కట్లను తెగఁగొఱికినాఁడు. అటు తర్వాత హిరణ్యకుఁడు ఆదరముతో వానినన్నిటిని సత్కరించి యిట్లనియె:—'సఖుఁడా, చిత్రగ్రీవుఁడా, ఇట్లు ఉరులలో తగులుకొనుటను నీదోషముగా నెంచుకొని ఎంతమాత్రమును నిన్ను నీవుతిరస్కరించుకొనవలదు, ఎందు చేతననఁగా,—

54. ఏపక్షి ఎక్కుడయిన నూఱామడల దూరమునుండి మాంసమును కనిపట్టునట్టిదో అదే కాలము వచ్చినప్పుడు దారపుటురులను కననేరదు. మఱియు;—

55. చంద్ర సూర్యులకు రాహుకేతు బాధయు, ఏనుఁగులును పాములును పక్షులును కట్టుఁబడుటయు, తెలివిగలవారి పేదఱికమును, చూచి నేను దైవమే బలీయ మని నిశ్చయించుకొన్నాను. మఱియు;—

56, 57. ఆకాశమందు ఒంటిగా సంచరించుచుండు పక్షులు నయితము ఆపదం బొందుచున్నవి; సముద్రపులోఁతునీట చేపలు నిపుణులచే చంపఁబడుచున్నవి; వాని యందు తప్పిద మేమి యున్నది? మంచినడువడివలనం బ్రయోజనమేమి? ఏలయన, యముఁడు ఆపదయందు చేయి చాఁచి దూరమునుండియే పట్టుకొనును.'

ఇట్లని హెచ్చరించి ఆతిథ్యము ఒసంగి కవుంగిలించుకొని పంపెను. అంతట

చిత్రగ్రీవుఁడును పరివారసమేతుఁడై తన కిచ్చ వచ్చిన తావులకుం బోయెను.

58. వీరిని వారిని అనక ఎట్టివారినిగాని నూర్లకొలఁది చెలిమి చేసికోవలసినది. చూడు చెలికాఁ డయిన యెలుక పావురముల కట్టులను విడిపించినది.

హిరణ్యకమును తనలోఁగిలో ప్రవేశించినది.

అంతట లఘుపతనకుఁ డను కాకి ఈవృత్తాంతము నెల్లం గాంచి ఆశ్చర్యపడి యిట్లు సంబోధించెను: 'ఓహో హిరణ్యకుఁడా, పొగడ్తకుఁ దగినవాఁడ వయ్యా! కావున నేనును నీతోఁగూడ చెలిమిని కోరుచున్నాను, కనుక నాకును నీచెలిమిని అనుగ్రహింపుము.' ఈ మాట విని ఎలుకయు బొక్కలోపలనే యుండి 'నీ వెవర వయ్యా?' అని యడిగెను. 'నేను కాకిని, నా పేరు లఘుపతనకుఁడు.' అని అది చెప్పెను. హిరణ్యకుఁడు నవ్వి యిట్లనియె:—'నీతో చెలిమి యన నేటిది? ఎందుచేత ననఁగా,—

59. దేనికి ఏది తగునో బుద్ధిమంతుఁడు దానితో దానిని కూర్పవలయును. నేను ఆహారమను, నీవు తినువాఁడవు; మనకు చెలిమి యెట్లు పొసఁగును? మఱియు,—

60. తిండికిని తినుదానికిని చెలిమి ఆపదకే హేతువు. ఉరులలో నక్క తగిలించిన జింకను కాకి రక్షించినది.'

అది యెట్లో చెప్పు మని కాకి యడిగినది. హిరణ్యకుఁడు చెప్పుచున్నాఁడు.

కథ. ౧.

మగధదేశమందు చంపకవతి యని గొప్ప యడవి కలదు. అందు చిరకాలమునుండి అధికస్నేహముతో జింకయు కాకియు నివసించి యుండినవి. ఆజింక స్వేచ్ఛగా సంచరించుచు సంతోషము గలదై కండపట్టిన దేహముతో నుండఁగా ఒక నక్క చూచినది. చూచి 'అకటా! మిక్కిలి మనోహరమయిన దీనిమాంసము నాకెట్లు తినుటకు లభించును? కానీ, నమ్మకము పుట్టించెదను.' అని యాలోచించుకొని సమీపించి 'మిత్త్రమా, కుశలమా?' అని యడిగెను. 'ఎవరవు నీవు?' అని జింక యడిగెను. 'నేను నక్కను, నా పేరు క్షుద్రబుద్ధి; ఈయడవిలో బంధువులు లేక చచ్చినశవమువలె నున్నాను. ఇప్పుడు నిన్ను మిత్త్రుని పడసి బంధువు గలవాఁడనై ప్రాణిలోకమును ప్రవేశించినవాఁడ నయితిని. ఇఁక నేను తప్పక నీతోడను అయ్యెదను.' 'అట్లే కానీ' అని జింక పలికినది. అటుతర్వాత కిరణమాలికలు దాల్చిన దేవుఁడు సూర్యుఁడు క్రుంకఁగానే ఆరెండును జింకయొక్క ఉనికిపట్టునకుం బోయినవి. అచట సంపెంగచెట్టుకొమ్మమీఁద వసించి యున్నట్టిది సుబుద్ధి యనుకాకి జింకకు చిరమిత్త్రము రెంటినిం జూచి 'మిత్త్రమా, ఈరెండవవాఁ డెవఁడు?' అని యడిగినది. 'ఇది నక్క, నాచెలిమి కోరి వచ్చినది;' అని జింకయుత్తరము చెప్పినది. అంతట కాకి ఇట్లనియె;—'మిత్త్రుఁడా, ఆకస్మికముగా వచ్చినవానిని నమ్ముట సరిగాదు. కనుక నీవు చేసినపని మేలుగాదు. పెద్దలు చెప్పుదురు;—



61. కులము నడత తెలియనివానికి ఎవనికిని చోటు ఈఁగూడదు. పిల్లియొక్క తప్పిదమునకు జరద్గవ మను గద్ద చంపఁబడినది.'

'ఆకథయెట్లు' అని రెండు నడిగినవి. కాకి యిట్లు చెప్పుచున్నది.—

అవాంతరకథ. ౧

గంగయొడ్డున గృధ్రకూటమను పర్వతములో పెద్ద జువ్విచెట్టు కలదు. దైవముయొక్క పాడుఫలముగా గోళ్లు ఊడి కన్నులు పోయినట్టిది జరద్గవ మను నొక గద్ద ఆచెట్టుతొఱ్ఱలో నివసించుచుండెను. మఱి, ఆచెట్టున నివసించెడి పక్షు లన్నియు జాలిగొని దానికి జీవనార్థమయి తమయాహారమునుండి కొంచెముకొంచెము పెట్టుచుండినవి. అందువలన అది జీవించుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు దీర్ఘకర్ణుఁడు అను పిల్లి పక్షిపిల్లలను భక్షించుటకు అచ్చటికి వచ్చినది. దానిరాకం గని పక్షిపిల్లలు భయపడి రొద పెట్టినవి. దానిని విని జరద్గము 'ఎవ రావచ్చెడివారు?' అని అదలించెను. దీర్ఘకర్ణము గద్దం గాంచి భయపడి యిట్లు తలపోసెను.—'అయ్యో! చెడితిని! ఏల యన,—

62. భయకారణము ఎందాఁక రాలేదో అందాక దానికి భయపడవలయును. వచ్చినట్టి భయకారణమును చూచి మనుష్యుఁడు అప్పటికి తగినట్లు చేయవలయును.

మఱి యిపుడు ఇంతసమీపమునుండి పాఱిపోఁ నలవిగాదు. కావున ఎట్లు కానున్నదో అట్లగుఁగాక. నచ్చికపుట్టించి దీని చెంతఁ జేరెదను.' ఇట్లాలోచించుకొని సమీపించి 'ఆర్యా, నమస్కారము' అని పల్కెను. 'ఎవరవు నీవు?' అని గద్ద యడిగెను. 'నేను పిల్లిని' అని యది చెప్పెను. 'పో, దూరముగా పో, పోకున్న నాచేత చచ్చెదవు.' అని గద్ద పలికెను. అంతట పిల్లి 'ముందు నామాటను వినుము. నేను చంపఁదగినవాఁడనుగా నీకు తోఁచెనేని అప్పుడు చంపుము. ఎందుల కనఁగా,—

63. ఎందైనను జాతిని మాత్రము పట్టి ఎవని నేని చంపుదురా, పూజింతురా? వాని వర్తనను విచారించిన యెడల చంపఁదగినవాఁడో సత్కరింపఁదగినవాఁడో ఏర్పడును.' అని చెప్పినది.

'నీవు ఏలవచ్చితివో చెప్పుము' అని గద్ద యడిగినది. పిల్లి యిట్లనియె!—'నే నిట గంగదరిని నిత్యము స్నానము చేయుచు మాంసము తినక బ్రహ్మచర్యముతో చాంద్రాయణవ్రతము సేయుచు ఉన్నాను. మీరు ధర్మజ్ఞానమందు ఆసక్తులును నమ్మఁదగినవారును అని పక్షు లన్నియు ఎల్లప్పుడు నామ్రోల పొగడుచుండును. అందువలన విద్యచేతను వయస్సుచేతను పెద్దలయిన మీవలన ధర్మము వినుటకు ఇటకు వచ్చినాఁడను. తమరు ఇట్టి ధర్మజ్ఞులుగా నున్నారు, అతిథిని జంపుటకు పూనినవారు. గృహస్థ ధర్మ మేమనఁగా.—

64. ఇంటికి వచ్చిన శత్రునికైనను తగినట్లు ఆతిథ్యము సేయవలయును. చెట్టు తన్ను నఱుకవచ్చినవానికి సయితము తన ప్రక్కనున్న నీడను లాగికొనదు.

ఒకవేళ ధనము లేకపోయెనా అప్పుడు మంచిమాటచేతనైనను అతిథిని పూజింపవలయును. ఏల యనఁగా,—

65. గడ్డిపోఁచలు, నేల, నీళ్లు, మంచిమాటయు — ఈ నాలుగును సజ్జనుల యింట నెప్పుడును దొరకకపోవు. మఱియు,—

66. ఇంటికి వచ్చినవాఁడు, బాలుఁడుగానీ, ముసలిగానీ, వయసువాఁడుగానీ, వానికి పూజసేయవలయును. ఎల్లవారికిని అభ్యాగతుఁడు గురువు. మఱియు;—

67. గుణములేని జంతువులకు కూడ సత్పురుషులు దయవహింతురు, చంద్రుఁడు మాలవానియింటినుండి వెన్నెలను వెనుకకు మరల్చుకొనఁడు.

68. బ్రాహ్మణులకు అగ్ని గురువు, వర్ణములకు బ్రాహ్మణుఁడు గురువు, స్త్రీలకు పతియొక్కఁడే గురువు; ఎల్లవారికిని అభ్యాగతుఁడు గురువు. మఱియు;—

69. ఎవనియింటినుండి అతిథి ఆశాభంగము నొంది మరలి పోవునో, అతఁడు తనపాపమును ఆగృహస్థునికి ఇచ్చి వానిపుణ్యమును తాను కొనిపోవును. మఱియు.—

70. పైజాతివానియింటికి క్రిందిజాతివాఁడు వచ్చినను, వానిని సత్కరింపవలసినది. అతిథి సర్వదేవస్వరూపుఁడు.'

ఇట్లు పిల్లి చెప్పఁగా గద్ద 'పిల్లులకు మాంసము మిక్కిలి ప్రియము గదా, ఇట పక్షిపిల్లలు వసించుచున్నవి; అందుచేత నే నట్లుచెప్పితిని.' అనెను. ఆమాట విని పిల్లి నేల తాఁకి 'కృష్ణ కృష్ణ' యనుచు చెవులు మూసికొని మరల నిట్లు పల్కుచున్నది.— 'నేను ధర్మశాస్త్రమును విని వైరాగ్యము పొంది కఠిన మయిన యీచాంద్రాయణ వ్రతమును పూనుకొంటిని. ఏల యనఁగా ధర్మశాస్త్రములందు వేఱు విషయములలో మతభేదము లున్నను, హింసింపకుండుట ఉత్తమ ధర్మ మనువిషయములో ఐకమత్యమే కనఁబడుచున్నది. ఎందుల కనఁగా.—

71. ఏ నరులు హింసను బొత్తిగా మానినారో, సర్వమును ఓర్చువా రెవరో, ఎల్లవారికిని ప్రాపగువా రెవరో, ఆ నరులు స్వర్గమునకుఁ బోవుదురు. మఱియు;—

72. ధర్మ మొక్కటియే మిత్రము, అది చచ్చినవానితో సయితము కూడనే వచ్చును. కడమ సమస్తమును దేహముతోఁ గూడ నశించును, మఱియు;—

73. ఒకటి మఱియొకదాని మాంసమును తినునప్పుడు ఆరెంటికిని గలభేదమును కనుఁడు, ఒకదానికి క్షణము సంతుష్టి కలుగును, రెండవదానికి ప్రాణము పోవును.

మఱియు;—74. చావవలసివచ్చినదే అని తనకు ఏదుఃఖము కలుగునో దానిని ఊహించుకొని పరునిఁగూడ రక్షించుట సాధ్యపడును. ఇంకను వినుము,—

75. తనంతట అడవిలో మొలచిన కూరచేత నయినను నిండునట్టి యీపాడు పొట్టకొఱకు ఎవఁడు మహాపాతకము చేయును?'



ఇట్లు నమ్మిక బలికి ఆపిల్లి చెట్టుతోఁటలోనే ఉండినది. తర్వాత కొన్ని దినములు గడవఁగా పక్షిపిల్లలను పట్టుకొని తోఁటకుఁ దెచ్చి ప్రతిదినమును తినుచుండినది. వేనిపిల్లలను తిన్నదో అవి దుఃఖపీడితములై ఏడ్చుచు ఇచ్చటను అచ్చటను వెదకం దొడంగినవి. దాని నెఱిఁగి పిల్లి తోఁటనుండి బయలువెడలి పాఱిపోయినది. తర్వాత పక్షులు ఇటనట శోధించి చెట్టుతొఱ్ఱలో పిల్లలయెముకలను కనిపట్టినవి. అంతట నాపక్షు లన్నియు 'ఈజరద్గవమే మనపిల్లలను భక్షించినది' అని కూడఁబలికికొని గద్దను చంపివైచినవి. కావున నేను 'కులము నడత తెలియని వానికి' ఇత్యాది వాక్యమును పలికితిని.

---

ఈకథను విని నక్క కోపమున నిట్లనియె:— 'లేడిని మొదట చూచిననాఁడు నీవును కులశీలములు తెలియనివాఁడవే. అట్లయినను నీతో దీనికి స్నేహము ఉత్తరోత్తరాభివృద్ధిగా నేల నెగడుచున్నది?

76. ఎక్కడ పండితులు లేరో అక్కడ కొంచెపుఁదెలివివాఁడు కూడ పొగడఁబడును. చెట్లులేనిదేశములో ఆముదపుఁజెట్టే మహావృక్షము. మఱియు;—

77. ఇతఁడు నావాఁడా పరుఁడా అనువిచారము అల్పబుద్ధులకు; మహాత్ములకైననో లోక మెల్లను వారికుటుంబమే.

ఈజింక నాకు ఎట్లు మిత్రమో, అట్లే నీవును.' అంతట జింక యిట్లనియె:— 'ఏల ఇట్లు మాటకు మాట? అందఱము ఒక్కచోట విశ్వాసముతో మాట లాడుకొనుచు సుఖముగా నుందము. ఏల యన;—

78. ఎవ్వఁడును ఎవనికిని మిత్రుఁడు గాఁడు, ఎవ్వఁడును ఎవనికిని శత్రుఁడు గాఁడు; వ్యవహార సంబంధముచేత మిత్రులును అట్లే శత్రువులును కలుగుదురు.'

అందులకు కాకి 'అట్లే కానిమ్ము' అనినది. అనంతరము తెల్లవాఱఁగానే అన్నియు దానిదానికి ఇష్టమయిన దేశమునకుం బోయినవి. ఒకనాఁడు రహస్యముగా నక్క జింకతో 'చెలికాఁడా, ఈయడవిలో ఒకచో నొకపొలము పైరుతో నిండియున్నది, నిన్ను తోడ్కొనిపోయి చూపెదను రా.' అని హెచ్చరించెను. అట్లే జరుగఁగా, జింక ప్రతిదినమును అటకేఁగి పైరు మేయుచుండెను. దానిం గని పొలము సామి వలయొగ్గెను. తర్వాత వలలో తగులుకొని 'యమపాశమువంటి యీవేటకానివలనుండి నన్ను విడిపించు నేర్పరి నా చెలికాఁడు తప్ప మఱి యెవఁడు?' అని తలపోసెను. తర్వాత నక్క అచ్చటికి వచ్చి సమీపించి యిట్లు తలపోసెను;— 'నాపన్నినమాయచేత నాకోరిక నెఱవేఱినది; దీనిని కోయునప్పుడు రక్తమాంసములు కమ్ముకొనియుండెడి యెముకలు నాకు తప్పకుండదొరకును. అవి విస్తారముగా నాకు ఆహారము కాఁగలవు.' జింక దానిని చూచి ఉల్లాసముతో 'చెలికాఁడా, వాకట్టును త్రెంపివైవుము; త్వరగా నన్నుఁ గావుము; ఏల యన;—

79. మిత్త్రుని ఆపదలయందు, శూరుని యుద్ధములోను, న్యాయస్థుని అప్పులోను, భార్యను సిరి తొలఁగినప్పుడును, బంధువులను వ్యసనములయందును, ఎఱుఁగవలయును.

మఱియు;—80. పండుగులోను, దుఃఖములోను, కఱవులోను, దేశోపద్రవమందును, రాజద్వారమందును, వల్లకాటియందును, ఎవఁడు వదలక కూడ నుండునో వాఁడు మిత్రుఁడు.' అని వేఁడెను.

నక్క వలను మాటిమాటికి పరికించి 'ఈవల గట్టిగానే యున్నది,' అని తలంచి 'మిత్త్రమా, ఈవలలు నరములతో చేయఁబడినవి, నేఁడు ఆదివారము, ఎట్లు వీనిని పండ్లతో తాఁకుదును? చెలికాఁడా మనస్సులో వేఱు విధముగా తలంపవేని, తెల్లవాఱఁగానే నీ వేమి చేయు మన్నను చేసెదను.' అని పలికి దానికి సమీపముననే కనఁబడకుండ దాఁగియుండెను.

తర్వాత కాకి సాయంకాలమందు జింక రాకుండుటం గని అక్కడక్కడ వెదకుచు వచ్చి ఆస్థితిలో నున్న జింకను జూచి 'చెలికాఁడా ఏమి యిది?' అని యడిగెను. 'ఇది మిత్త్రునిమాటను తిరస్కరించినందులకు ఫలము. పెద్దలు ఏమిచెప్పి రన;—

81. మేలు కోరెడు మిత్త్రులమాటను ఎవఁడు వినఁడో, వానికి ఆపద దగ్గఱనే యుండును; ఆమనుష్యుఁడు శత్రువులను సంతోషపెట్టువాఁడు.' అని జింక పలికెను.

'ఆ నక్క యెక్కడనున్నది?' అని కాకి యడిగెను. 'నామాంసమును అపేక్షించి యిటనే ఉన్నది.' అని జింక చెప్పెను. కాకి చెప్పుచున్నది:— 'నేను మొదటనే చెప్పలేదా?

82. తనయందు తప్పులేని మాత్రాన నిర్భయముగా నుండుట సరిగాదు; గుణవంతులకు సయితము క్రూరులవలన భయము కలదు సుమా.

83. ఆయుస్సు తీఱినవారు దీపమాఱినవాసనను, మిత్త్రవాక్యమును, అరుంధతీ నక్షత్రమును,- మూర్కొనరు, వినరు, కనరు.

84. చాటున పని చెఱుచుచు ఎదుట ఇచ్చకము లాడుచు పైని పాలును లోపల విషమును గల కుండను బోలినట్టి మిత్త్రుని వదలవలయును.'

తర్వాత కాకి నిట్టూర్పు పుచ్చి యిట్లు పలికెను;—'ఓరి మోసగాఁడా! పాపకర్ముఁడవు నీవుఎంతపని చేసితివిరా! ఏల యన;—

85. లోకములో తియ్యనిమాటలచే కలుపుగోలుచేసికొని, మాయమరియాదచే వశపఱుచుకొని ఆసలు గొలిపి నమ్మించి ధన మంతయును మోసగించుట ఏమిపని?

86. ఉపకారియు నమ్మినవాఁడును అయినవానికి ఎవఁడు కీడు చేయునో సత్యప్రతిజ్ఞ లేనట్టి యావనుని ఓ భూదేవీ, నీ వెట్లు మోచుచున్నావమ్మా!



87. దుర్మార్గునితో చెలిమి చేయరాదు; వానిపై అనురాగమును వహింపరాదు. నిప్పు వేఁడిగా నున్నప్పుడు కాల్చును, చల్లఁబడినప్పుడు చేతిని నలుపు సేయును.

అట్లన నేల, దుర్జనుల నడువడి యెట్టిదో వినుఁడు.—

88. ముందుగా పాదములలో పడును, తర్వాత వెన్నుమాంసమును కఱచును, మెల్లఁగా విచిత్రముగా చెవిలో ఏమో ఇంపుగా గొణుగును, బొక్కను (తప్పును) కని పట్టి తటాలున నిర్భయముగా చొచ్చును;— ఈతీరున ఖలునిచర్య యెల్లను దోమ చేయును. అట్లే గదా;—

89.—మన కిష్టముగా మాట లాడుచున్నాఁడు గదా అని దుర్జనుని నమ్ముట సరిగాదు; వానికి నాలుకకొనను తేనెయు, హృదయములో మహావిషమును, ఉండును.'

తర్వాత తెల్లవాఱఁగానే పొలముసామి దుడ్డుగుదియ చేతఁ బూని ఆచోటికి వచ్చుచుండఁగా కాకి చూచి జింకతో 'సఖుఁడా, నీవు చచ్చినవానివలె నగపడుచు గాలితో కడుపు బూరటించుకొని, కాళ్లు నిగుడఁదన్నుకొని, ఉండుము. నేను నీకన్నులను ముక్కుతో గీఱుచుండెదను; నే నెప్పుడు కూయుదునో అప్పుడు నీవు లేచి తటాలున పాఱిపొమ్ము.' అనిచెప్పినది. జింక అట్లే కాకిమాటప్రకారమే చేసినది. అంతట సంతోషముచే కన్నులు వికసిల్లుచుండ పొలముసామి ఆతీరుననున్న జింకం గాంచి 'ఆహా! స్వయముగానే చచ్చితివా!' అని పలికి, వలనుండి తప్పించి ఉరిత్రాళ్లను చైకొనుటకై జతనపడెను. అంతట కాకికూఁత విని జింక వడిగా లేచి పాఱిపోయెను. దానికేసి పొలముసామి విసరివైచిన గుదియ గుఱి తప్పి నక్కను చంపినది. చెప్పుదురు గదా;—

90. జనుఁడు మిక్కిలి తీవ్రము లయిన పుణ్యపాపములకు మూఁడు ఏండ్లలో, మూఁడు నెలలలో, మూఁడు పక్షములలో, మూఁడు దినములలో ఈలోకములోనే ఫలమును పొందును.

కావున నేను, 'తిండికిని తినుదానికిని చెలిమి' లోనగువాక్యమును చెప్పితిని.

లఘుపతనకుఁడు వెండియు నిట్లనియె:—

91. 'ఓయి పుణ్యాత్ముఁడా, నిన్ను భుజించినను నాకడుపు నిండదు; నీవు బ్రదికియున్న నేనును చిత్రగ్రీవునివలె ప్రాణమును దక్కించుకొనియెదను. మఱియు;—

92. పుణ్యము నే సేయుచుండు తిర్యగ్జంతువులయందు సయితము నమ్మకముంగాంచి యున్నారము; మంచినడవడినుండి సజ్జనుల స్వభావము ఎప్పటికిని మాఱదు.

93. సత్పురుషునికి కోపము కలిగించినను మనస్సు వికారమును పొందదు. గడ్డికొఱవితో సముద్రజలమును కాచుట శక్యము గాదు.'

హిరణ్యకుఁడు చెప్పుచున్నాఁడు.—

'నీవు చపలుఁడవు, చపలునితో చెలిమి చేయనే కూడదు. పెద్దలు ఇట్లు చెప్పుదురు, వినుము;—

94. పిల్లి, దున్నపోతు, మేఁక, కాకి, దుర్జనుఁడును—నమ్మినయెడల పయికొందురు, వారిని నమ్మఁదగదు.

మఱియును నీవు మాకు శత్రుపక్షమువాఁడవు. ఇదిగాక పెద్దలు ఇట్లు చెప్పియున్నారు;—

95. చక్కఁగా కుదిరిన యొడంబడికచేత నయినను శత్రువుతోఁ జేరరాదు. చక్కఁగా కాఁగిన దయినను నీరు నిప్పును ఆర్పనే ఆర్పును.

96. విద్యచే అలంకరింపఁబడినవాఁ డయినను దుర్జనుఁడు వదలవలసినవాఁడే. మణిచే అలంకరింపఁబడిన దైనను పాము భయంకరము గాదా.

97. శక్యము గానిది శక్యము గాదు; శక్య మయినది శక్యమే; నీట బండి పోదు, ఓడ నేలఁ బోదు. మఱియు;—

98. శత్రువులు విస్తారముగా ధన మిచ్చినను వారిని, తనమీఁద అనురక్తి తప్పిన భార్యలను, ఎవఁడు నమ్మునో వాని బ్రదుకు అంతటితో సరి.'

అందులకు లఘుపతనకము మరల చెప్పుచున్నది.—'నీవు చెప్పిన దెల్ల వింటిని. అయినను ఈపాటిది నాపూనిక-తప్పకుండ నీతో చెలిమి చేయవలసినది అని. అది నెఱవేఱనియెడల తిండి మాని చచ్చెదను. అట్లే గదా,—

99. దుర్జనుఁడు మట్టికుండవలె సులువుగా విడఁగొట్టఁ దగినవాఁడును మరల కూర్ప సాధ్యపడనివాఁడును; సజ్జనుఁ డయిననో బంగారుకుండవలె విడఁదీయ నశక్యుఁడును, త్వరగా కూర్ప శక్యుఁడును.

100. ఎల్లలోహములును కరఁగుటచేత కలయును, పశువులును పక్షులును నిమిత్తముచేత, కలయును, మూర్ఖులు భయముచేతను ఆశచేతను కలయుదురు, సత్పురుషులు ఒకరి నొకరు చూచినమాత్రాననే స్నేహింతురు.

.01. సజ్జనులు టెంకాయవంటి స్వరూపముగలవారు; ఇతరులు రేఁగుఁబండు వంటి స్వరూపముకలవారు, పైకిమాత్రమే మనోహరముగా నుందురు.

102. సజ్జనులకు స్నేహము చెడినను గుణములు మాఱవు; తామరతూండ్లను విఱిచినను దారములు అంటుకొనియే యుండును. మఱియు;—

103. చిత్తశుద్ధియు, ఈవియు, పరాక్రమమును, మిత్త్రునిసుఖమును తనసుఖముగాను మిత్త్రునిదుఃఖమును తనదుఃఖముగాను అనుభవించుటయు, దయయు, ప్రేమయు, సత్యమును, మిత్త్రుని గుణములు.

ఈగుణములు గలవానిని నిన్నుఁ దక్క నే నెవనిని సంపాదింపఁగలను?,



ఇట్లును, ఇంకను, కాకి చెప్పఁగా హిరణ్యకుఁడు లొఁగనుండి వెలువడి యిట్లనియె.—

104 మంచియుక్తితో సత్పురుషులు ప్రీతిపూర్వకముగా పలికెడుమాట పుణ్యాత్ముల మనస్సును మంత్రమువలె వశీకరించుటకు ఎట్లు సమర్థమగునో, అట్లు ఎండదాఁకినవానిని కడుంజల్లనినీళ్లతోడి స్నానము సుఖపెట్టదు, ముత్తెపుఁబేరుసుఖపెట్టదు, ఒక్కొక్క యవయవమునకు బూసిన మంచిగంధపుఁబూతయు సుఖపెట్టదు.

మఱియు,— 105. రహస్యమును బయటఁ బెట్టుట, యాచించుట, పరుషత, మనస్సునిలుకడలేమి, పగ, కల్లలాడుట, జూదము - ఇవి మైత్త్రిని చెఱుపునవి.

ఈవాక్యముప్రకారము నీయందు ఒకదోష మేనియు కనఁబడదు ఏల యన;—

106. సామర్థ్యమును, నిజమాడుటయు, వ్యవహారమునం దెలియును; లోభము లేమియు చపలత లేమియు దర్శనముచేతనే తెలియును. మఱియు;—

107. శుద్ధమనస్సుగలవానిచెలిమి వేఱు విధముగా నుండును, మోసపుబుద్ధి గలవాని వాక్కు వేఱువిధముగా ప్రవర్తిల్లును.

108. దురాత్ములకు మనస్సులో నొకటి, మాటలో మఱియొకటి, పనిలో నింకొకటి; మహాత్ములకు మనస్సులోను అదే, మాటలోను అదే, పనిలోను అదే.

కావున నీకోరినయట్లే కానిమ్ము.' ఇట్లు పలికి హిరణ్యకుఁడు చెలిమి కావించి కాకిని మేలయినయోగిరములతో తనియించి లొఁగలోఁ దూఱెను. కాకియు తనతావున కేఁగినది. అప్పటినుండి రెండును ఒకటికొకటి ఆహారము లిడుచు, కుశలము లడుగుచు నమ్మకముగా మాటలాడుకొనుచు; కాలము గడపు చుండినవి.

ఒకానొకప్పుడు కాకి హిరణ్యకునితో 'చెలికాఁడా, ఈచోట నిపుడు కాకికి ఆహారము దొరకుట మిక్కిలి కష్టముగా నున్నది. కావున ఈచోటు వదలి మఱియొక చోటికి పోఁ గోరుచున్నాను.' అని చెప్పెను. అందులకు హిరణ్యకుఁడు పలికెను.—

109. 'తమతావును బాసినయెడల, దంతములకు, వెండ్రుకలకు, గోళ్లకు, మనుష్యులకును, శోభ తొలఁగును. ఇట్లనియెఱిఁగి తెలివిగలవాఁడు తనతావును వదలఁగూడదు.'

కాకి చెప్పుచున్నది.—'మిత్త్రుఁడా, అది దుర్జనుల మాట. ఏల యన,—

110. సింహములును, సజ్జనులును, ఏనుఁగులును, తమతావు వదలి పోవుట ప్రసిద్ధమే గదా; కాకులు, దుర్జనులు, జింకలును, తమచోటనే చచ్చుచున్నవి.'

హిరణ్యకుఁడు చెప్పుచున్నాఁడు— 'మిత్త్రుఁడా, ఎటకు పోనగును? పెద్దలు ఇట్లు చెప్పియున్నారు;—

111. బుద్ధిమంతుఁడు ఒకకాలితో కదలును, ఒకకాలితో నిలుచును; రెండవతావును చక్కఁగా చూచుకొనక తొంటితావును వదలఁడు.'

చక్కఁగా చూచిన తావు ఒకటి కలదని కాకి చెప్పెను. అది యేది అని హిరణ్యకుఁ డడిగెను. 'దండకారణ్యములో కర్పూరగౌర మను పేరి సరస్సు కలదు; అందు నాకు చిరకాలమునుండి సంపాదింపఁబడిన మిత్త్రుఁడు మంథరుఁ డను తాఁబేలు స్వభావము చేతనే ధార్మికుఁడు కలఁడు. ఏల యన;—

112. ఇతరులకు చెప్పుట మనుష్యుల కెల్ల సులువు. తాను ధర్మము నాచరించెడు మహాత్ముఁడు అరుదు.

అతఁడు మంచి మంచి చేఁపయోగిరములను పెట్టి నన్ను పోషింపఁగలఁడు.' అని కాకి చెప్పెను. హిరణ్యకుఁ డిట్లనియె.—'అట్లేని, నేను మాత్ర మిక్కడ నుండి యేమి చేయను? ఏల యన,—

113. ఏదేశమందు సత్కారముగాని, విద్యాప్రాప్తిగాని, బంధుజనముగాని, ఏదేని జీవికగాని, లేదో, ఆదేశమును వదలవలసినది. మఱియు;—

114. ధనికుఁడు వేదము చదివినవాఁడు, రాజు, ఏఱు, వైద్యుఁడు, ఈ యైదును ఎచట లేవో అచట వసింపఁ గూడదు. మఱియు;—

115. ఎచ్చట జీవనము, (పాప) భయము, లజ్జ, కరుణ, దాతృత్వమును,—ఈ యైదును లేవో, అచట నివసింపఁగూడదు.

116. మిత్త్రుఁడా, ఎచ్చట, అప్పిచ్చువాఁడు, వైద్యుఁడు, వేదము చదివినవాఁడు, మంచినీళ్లు గలయేఱు, ఈనాలుగు లేవో, అచట నివసింపఁ గూడదు.

కావున నన్నుఁ గూడ నచటికే తోడ్కొని పొమ్ము.'

తర్వాత కాకి ఆచెలికానితోఁగూడ విచిత్రమయిన కథలు చెప్పుకొనుచు సుఖముగా ఆ సరస్సుకడకు పోయెను. అంతట మంథరుఁడు దూరమునుండి చూచి లఘుపతనకునికి తగిన యాతిథ్యము సలిపి, ఎలుకకును అతిథిపూజ గావించెను. కాకి యిట్లనియె;—'చెలికాఁడా మంథరుఁడా; ఈయనకు విశేష మయిన పూజం గావింపుము; ఏల యన, ఈయన పుణ్యము సేయువారిలో అగ్రగణ్యుఁడు, హిరణ్యకుఁడను పేరి యెలుక దొర. ఈయనయొక్క గుణములను పొగడుటకు రెండువేల నాలుకలతోడి నాగేంద్రుఁడు ఒకవేళ సమర్థుఁ డయిన నయ్యెడును.' ఇట్లు పలికి చిత్రగ్రీవుని కథలు వర్ణించెను. మంథరుఁడును ఆదరముతో హిరణ్యకుని సత్కరించి 'అయ్యా నీకు మంగళము; నీవు జనులు లేని యడవిలో నుండినందులకారణమును చెప్పవలయు.' అని యడిగెను.

## హిరణ్యకుని పూర్వ వృత్తాంతము.

హిరణ్యకుఁడు ఇట్లనియె; చెప్పుచున్నాను వినుము.—చంపకావతి యను పట్టణములో సన్న్యాసుల మఠ మొకటి కలదు. అందు చూడాకర్ణుఁ డను సన్న్యాసి వసించి



యుండెను. అతఁడు తినఁగా మిగిలిన బిచ్చపుటన్నముతోడి బిచ్చపుఁబాత్రమును చిలుకకొయ్యకు తగిలించి నిద్రించుచుండును. నేను ప్రతిదినము ఎగిరి ఆయన్నమును తినుచుండును. ఇట్లుండఁగా అతని ప్రియమిత్త్రుఁడు వీణాకర్ణుఁ డనుసన్న్యాసి వచ్చెను. అతనితో నానావిషయ సంభాషలలో నుండియు చూడాకర్ణుఁడు నన్ను జడిపించుటకై చీలినవెదురు తుంటతో నేలను కొట్టుచుండెను. దానిం గని వీణాకర్ణుఁడు ఇట్లనియె.—'సఖుఁడా, నీ వేల నామాటయందుఁ గాక వే రెందో ఆసక్తిఁ బూనియున్నావు?

ఎట్లనఁగా,—117. దయగల ముఖమును, నిర్మల మైన చూపును, మాటయందు ఆసక్తియు, తీయనివాక్కును, ఎక్కువచెలిమియు, తొట్రుపాటుతో చూచుటయు,—ఇది ఎప్పుడును, అనురాగము కలవాని లక్షణము.

118. ఇచ్చ లేక యిచ్చుటయు, మున్ను చేసిన యుపకారమును స్మరింపమియు, తిరస్కరించుటయు, చెడునడవడిని వర్ణించుటయు, మాటలవరుసలో పేరు మఱచుటయు,—ఇది స్నేహము చెడిన జనుని లక్షణము.'

అందులకు 'భవ్యుఁడా, నేను విరక్తుఁడను గాను; ఇదె చూడు, ఈయెలుక నాకు చెఱుపు సేయుచున్నది. సర్వదా నాపాత్రలోని భిక్షాన్నమును తినుచున్నది.' అని చూడాకర్ణుఁడు ఉత్తరము చెప్పెను. వీణాకర్ణుఁడు చిలుకకొయ్యను చూచి యిట్లనియె; 'ఎలుక యెంత! దాని బలమెంత! ఎట్లది యింత యెత్తు ఎగురఁగలదు? కావున నిందుల కేమో కారణ ముండును. పెద్దలు చెప్పియున్నారు;—

119. ఆకస్మికముగా లేజవరాలు ముసలిమగనిని బిగువుగా కౌఁగిలించుకొని జుట్టు పట్టుకొని వంచి ముద్దుగొనుచున్నది, ఇందులకు హేతువు ఉండును.'

## కథ. 3.

చూడాకర్ణుఁడు ఆకథ చెప్పు మని యడిగెను. వీణాకర్ణుఁడు చెప్ప సాగెను.—గౌడదేశములో కౌశాంబి యని పట్టణము గలదు. అందు చందనదాసుఁ డను వైశ్యుఁడు మహాధనము కలవాఁడు ఉండెను. అతఁడు ముసలితనములో కామప్రేరిత మానసుఁడై ధనగర్వముచేత లీలావతి యను వైశ్య కన్యను వివాహ మాడెను. ఆమెయు యౌవన మొంది మదనుని గెలుపు జెండావోలె వెలుంగుచుండెను; ఆ ముదిమగనివలన ఆమెకు సంతుష్టి కలుగ దాయెను. ఏల యనఁగా,—

120. చలికి బాధపడుచున్నవారికి చంద్రునియందును, ఎండకు బాధపడుచున్నవారికి సూర్యునియందును, ఎట్లో అట్లే స్త్రీలకు ముదిమిచే పీడితుఁడయిన మగనియందు మనస్సు సంతోషపడదు. మఱియు;—

121. వెండ్రుకలు నరసిన తర్వాత సయితము పురుషునికి కామ మనఁగా నెట్టిది? ఏల యన, స్త్రీలు అన్యునియందు మనస్సుంచినవారై యిట్టివానిని మందుగా చూతురు.

ఆ ముసలిమగనికి ఆమెయందు అత్యంతప్రేమ. అది యెట్లనఁగా,—

122. ప్రాణులకు ఎప్పుడును ధనాశయు ప్రాణాశయు గొప్పవి, ముసలివానికి వయసు పెండ్లాము ప్రాణములకన్నను ఎక్కువ, మఱియు,—

123. ముసలివాఁడు విషయములను అనుభవించుటకును వదలుటకును సమర్థుఁడు గాక, బోసికుక్క యెముకనుంబోలె ఊరక నాలుకతో మాత్రము నాకుచుండును.

మఱి యాలీలావతి యౌవన మదముచేత కులమర్యాదను ఉల్లంఘించి ఎవఁడో ఒక వైశ్యకుమారునిమీఁద మరులుకొనెను. ఏలన,—

124. స్వతంత్రముగా నుండుటయు, తండ్రియింట వసించుటయు, జాతర యుత్సవములలో తిరుగుటయు పురుషులగోష్ఠి నుండుటయు, వ్రతము లేకుండుటయు, అట్లే వేఱుదేశమం దుండుటయు, అంకుటాండ్రతో తఱుచుగా చెలిమియు, తన జీవిక చెడుటయు, మగనిముదిమియు, ఈసును, వికవిక నవ్వుటయు, స్త్రీ చెడుటకు కారణములు. మఱియు;—

125. త్రాగుడు, దుర్జనులతోడిచెలిమి, మగని నెడఁబాయుట, సంచారము, పరులయింట నిద్రయు వాసమును, ఇవి స్త్రీలను చెఱుచునట్టివి. మఱియు;—

126. చోటు లేదు, సమయము లేదు, వేఁడుకొనువాఁడు లేఁడు; ఓనారదుఁడా, ఇందువలన స్త్రీలకు పాతివ్రత్యము కలుగుచున్నది. మఱియు;—

127. స్త్రీలకు అప్రియుఁ డెవ్వఁడును లేఁడు, ప్రియుఁ డేనియు ఎవఁడును లేఁడు; ఆవులు అడవిలో గడ్డినింబోలె క్రొత్తక్రొత్తవానిని కోరుచుందురు. . . .

129. దేవతలయు స్త్రీలు చపలురాండ్రని ప్రసిద్ధము; వారిని ఎవరు రక్షించుకొందురో ఆమనుజులు సుఖము పొందుదురు.

130. సిగ్గుగాని అణఁకువగాని దయగాని పిఱికితనముగాని స్త్రీకి పాతివ్రత్య కారణము గాదు; వేఁడుకొనువాఁడు లేమి యొక్కటియే తత్కారణము. మఱియు;—

131. స్త్రీ నేతికుండ వంటిది, పురుషుఁడు మండుచున్న బొగ్గవంటి వాఁడు; కావున నేతిని నిప్పును బుద్ధిమంతుఁడు ఒకచోట నుంపఁ గూడదు. మఱియు;—

132. తండ్రి బాల్యమందు రక్షించును, మగఁడు యౌవనమందు రక్షించును, పుత్త్రులు ముసలితనమందు రక్షింతురు; స్త్రీకి స్వాతంత్ర్యము ఎప్పుడును తగదు.

133. తల్లితోఁ గాని, సహోదరితోఁ గాని, కూఁతుతోఁ గాని ఏకాంతమందు కూర్చుండరాదు. ఇంద్రియసమూహము బల్లిద మయినది, జ్ఞానిని సయితము లాగును.

ఒకప్పుడు ఆలీలావతి రత్నాల వెలుఁగులచే పలువన్నెలు గలదైన మంచము మీఁద ఆవైశ్యకుమారునితో సుఖముగా కూర్చుండి నమ్మకముగా సల్లాపించుచుండి, తెలియకుండ వచ్చిన మగనిం గాంచి తటాలున లేచి జుట్టుపట్టి బిగ్గఁ గౌఁగిలించి ముద్దు గొన్నది. ఈసందములో మిండఁడును పాఱిపోయెను. చెప్పిరి గదా;—



134. శుక్రాచార్యుఁడు ఏశాస్త్రమును నేర్చెనో బృహస్పతియు దేనిని నేర్చెనో, అది యెల్ల స్వభావముచేతనే స్త్రీబుద్ధియందు నాటఁబడి యున్నది.

ఆ కవుఁగిలింతం గాంచి చెంత నున్న కుంటెనకత్తె 'ఏల ఆకస్మికముగా ఈమె యీతనిని కౌఁగిలించుకొన్నది?' అని యాలోచించి అందులకారణము ఆమిండగాఁడని యెఱింగి లీలావతిని రహస్యముగా చీవాట్లు పెట్టినది. కావున నేను 'ఆకస్మికముగా లే జవరాలు ముసలిమగనిని' ఇత్యాది పలికితిని.

---

కావున ఇట ఈయెలుకయొక్క బలమునకు అండ యయిన కారణ మొకటి యుండవలయును.— నిముస మాలోచించి, సన్న్యాసి యిట్లనియె:—'ఇందుల కారణము విశేషముగా ధనార్జనమే అగును. ఏల యనఁగా,—

135. లోకములో ఎల్లయెడలను, ఎల్లకాలమందును, ధనవంతుఁ డెల్ల బలవంతుఁడు; రాజులకు సయితము దొరతనము ధనమువలననే కలుగుచున్నది.

ఇట్లు చెప్పి ఆసన్న్యాసి గుద్దలి తెచ్చి నాలాఁగను త్రవ్వినవాఁడై చిరకాలము నుండి నేను గడించి పెట్టుకొన్న నాధనము నంతయు పుచ్చుకొనెను. అదిమొదలు నేను దినమునకు దినము బలము ఉడిగిన వాఁడనై సత్త్వోత్సాహములు కోలుపోయి నాయాహారము నయినను సంపాదించుకొనుటకు శక్తిలేక భయముతో మెల్ల మెల్లఁగా సంచరించుచుండఁగా నన్నుఁ గని చూడాకర్ణుఁ డిట్లనియె:—

136. ఎల్లవాఁడును ధనముచేత బలవంతుఁడు; ధనముచేత పండితుఁ డగును; చూడు, ఈ పాడుమూషికము ఇపుడు తన జాతితో సమానమైనది.

137. ధనము కోలుపోయిన మందమతికి పను లన్నియు వేసవిలో చిన్నయేళ్లు ఎట్లో అట్లే నశించి పోవును. మఱియు;—

138. ధనముకలవానికి స్నేహితు లుందురు, ధనముకలవానికి బంధువు లుందురు, ధనముగలవాఁడు లోకములో పురుషుఁడు, ధనముగలవాఁడు పండితుఁడు. మఱియు;-

139. పుత్త్రుఁడు లేనివానికి ఇల్లుశూన్యము, మంచిమిత్త్రుఁడు లేనివానికిని అట్లే; మూర్ఖునికి దిక్కులు శూన్యములు, దరిద్రునికి సమస్తమును శూన్యమే. మఱియు;—

140. పేదఱికముకంటె చావుమేలు, పేదఱికము మేలుగాదు,— అని పెద్దలు చెప్పుదురు ; చావువలన ఇంచుకయే ప్రయాసు, పేదఱికము బొత్తిగా భరింపరానిది.

141. ఇంద్రియములు పాటవము తప్పనట్టివి అమునుపటివే, పేరు అదే, బుద్ధియు ఓటమి లేనట్టిది అమునుపటిదే, పలుకును అదే ; ధనమదము ఎడలఁగానే పురుషుఁడు ఆ

మునుపటివాఁడే క్షణములో వేఱొకఁడగుట వింతగా నున్నది.'

ఇదంతయు విని నేనిట్లు తలపోసికొంటిని.— ఇఁక నేనిట నుండుటసరిగాదు; ఇపుడు ఈవృత్తాంతమును ఒరునికి చెప్పుటయు సరిగాదు. ఏల యన ;—

142. ధనము కోలుపోవుట, మనస్తాపము, ఇంటిలో చెడునడవడులును, మోసమును, అవమానమును, బుద్ధిమంతుఁడు వెల్లడి చేయఁగూడదు. మఱియు;—

143. ఆయుస్సు, ధనము, కుటుంబములోని దోషము, మంత్రము, స్త్రీభోగము, మందు, తపస్సు, దానము, అవమానము, ఈ తొమ్మిదియు ప్రయత్న పూర్వకముగా దాఁపవలసినవి. పెద్దలు చెప్పిన దేమనఁగా;—

144, దైవము మిక్కిలి ప్రతికూలమై యుండఁగా, పురుష ప్రయత్నము వ్యర్థమై పోఁగా, మానవంతుఁడయిన దరిద్రునికి అడవిలోఁ దక్క మఱి సుఖ మెక్కడ కలుగును?

145. మానవంతుఁడు చచ్చియేని పోవును గాని దీనత్వమును మాత్రము పొందఁడు. అగ్ని ఆఱినైనం బోవును గాని చల్లఁబడను మాత్రము చల్లఁబడదు.

146. మానవంతునికి పూగుత్తికింబోలె రెండే ఉనికులు ! ఎల్లవారికి శిరమునం దుండుటయేని అడవిలో నాశ మగుటయేని.

ఇచట నే యాచనచే జీవించుట మఱియు నింద్యము. ఏల యన;—

147. విభవము కోలుపోయినవాఁడు ప్రాణము లర్పించి అగ్నిదేవుని సంతోష పెట్టుట మేలుగాని మరియాద యెఱుఁగని కృపణజనుని యాచించుట మేలుగాదు.

148. నరుఁడు దారిద్ర్యముచేత లజ్జ పొందును, లజ్జ పొందినవాఁడు మనోబలము కోలుపోవును, మనోబలము లేనివానిని అవమానింతురు, అవమానముచేత విసుగు గలుగును, విసుగొందినవాఁడు దుఃఖముపా లగును, దుఃఖముచేఁ గూలినవానికి బుద్ధి పోవును, బుద్ధిహీనుఁడు నాశ మొందును ; అయ్యో ! దారిద్ర్యము ఎల్ల యాపదలకును ఉనికి పట్టు.

అబద్ధమాడుటకన్న పలుకకుండుట మేలు ! పురుషులకు పరభార్యా గమనముకన్న నపుంసకత్వము మేలు ; కొండెములు చెప్పుటకన్న ప్రాణమువదలుట మేలు; ఒరుల ధనములను అనుభవించెడు సౌఖ్యమునకన్న బిచ్చపుటన్నము తిని బ్రతుకుట మేలు.

150. చెడ్డ యెద్దు ఉండుటకన్న కొట్టము పాడుపడియుండుట మేలు ; చెడు నడతగల కులభార్యకన్న భోగముది భార్య యగుట మేలు ; తెలివిమాలిన ఱేని పట్టణములో నుండుటకంటె అడవిలో కాఁపుర ముండుట మేలు;అధములను ఆశ్రయించుటకంటె ప్రాణము వదలుట మేలు. మఱియు;—

151. గౌరవము నెల్లను కొలువు ఎట్లో, చీఁకటిని వెన్నెల యెట్లో, ముదిమి సౌందర్యమును ఎట్లో, హరికథయు శివకథయు పాపమును ఎట్లో, అట్లే నూఱుగుణముల



నైనను యాచకత్వముహరించును.

మఱి నేను ఇతరుల యన్నము తిని జీవింతునా? అయ్యో ! అదియు చావునకు రెండవ దారి. ఏల యన;—

152. పై పైనుండు విషయములు కొంచెకొంచెము నేర్చిన పాండిత్యము, విలిచిన సంభోగము, అన్యులవశమం దున్న యన్నము, ఈ మూఁడును పురుషులకు వాలకములు. మఱియు ;—

153. రోగియు, చిరకాలము విదేశమం దుండువాఁడును అన్యులయన్నము తిని జీవించువాఁడును. అన్యులయింట నిద్రించువాఁడును, జీవించుట యేదో అదే చావు, చా వేదో అదే వానికి విశ్రాంతి.—

ఇట్లాలోచించుకొని లోభముచేత పగల ధనమార్జించుటకు ఇల్లు చేసికొంటిని. అట్లే చెప్పబడినది ;—

154. లోభముచేత బుద్ధి చలించును ; లోభము ఆశను పుట్టించును ; ఆశాపీడితుఁడైన మానవుఁడు పరలోకమందును ఈలోకమందును దుఃఖము పా లగును.

తర్వాత వీణాకర్ణుఁడు నన్ను చీలినవెదురుఁగఱ్ఱతో కొట్టఁగా తలపోసితిని.— లోభము గలిగి సంతుష్టి లేనివాఁడు నిశ్చయముగా తన్ను తాను చంపుకొనువాఁడే అగును.

155. ధనాతురునికి సంతుష్టి లేదు; వాఁడు మనస్సును కట్ట లేఁడు, ఇంద్రియములను అణఁపలేఁడు;— ఎవని మనస్సు తుష్టి చెందదో అన్ని యాపదలును వానివే. అది అట్లే;—

156 ఎవని మనస్సు తుష్టిఁ జెందినదో సకల సంపదలును వానివి. కాలికి చెప్పులు తొడుగుకొన్న వానికి భూమి యంతయు తోలు గప్పినదే. మఱియు;—

157. సంతోష మనెడి యమృతముచేత తనిసి మనస్సులో కామక్రోధాదులు ఉడిగిన వారికి ఏసుఖమో అది ధనలోభముచేత ఇటునటు పరుగిడువారికి ఎక్కడిది?

158. ఎవఁడు ఆశలను వెనుకకుఁ ద్రోచి వైరాగ్యమును అవలంబించినాఁడో, వాఁడే చదివినవాఁడు, వాఁడే విన్నవాఁడు, వాఁడే సర్వము అనుష్ఠించినవాఁడు. మఱియు;—

159. ధనికుల ద్వారములయందు కొలువు సేయక, ఎడఁబాపుదుఃఖము నెఱుఁగక, దీనాలాపములు పలుకక, ఎవఁడు బ్రదుకునో వాఁడు ధన్యుఁడు. ఏలయనఁగా;—

160. ఎవనిని ఆశ మోచికొని పోవుచున్నదో వానికి నూఱామడలైనను దూరము గావు ; సంతుష్టికలవానికి చేతిలోని ధనముమీఁద నయితము ఆదరణ ఉండదు.

కావున ఈవిషయములో ఇప్పటి దశకు తగినపని యేదో దానిని నిర్ణయించుకొనుట మంచిది. పెద్ద లేమి చెప్పినా రనఁగా;—

161. ధర్మమేది ? భూతములయందు దయ. సౌఖ్య మేది? లోకములో ప్రాణికి

రోగము లేమి. స్నేహమన నేది? విశ్వాసము. పాండిత్య మేది? వివేకము. అది ఎట్లన.—

162. ఆపదలు వచ్చినప్పుడు వివేక మే పాండిత్యము; వివేచించికొనక వ్యవహరించు వారికి అడుగడుగునను ఆపదలు కలుగుచుండును. మఱియు;—

163. మిగత కులమును రక్షించుకొనుటకై ఒకనిని వదల వలయును; ఊరికొఱకు కులమును వదలవలయును; దేశము కొఱకు గ్రామమును వదలవలయును; ఆత్మకొఱకు భూమిని వదలవలయును. మఱియు,—

164. గొప్పవారిని అండ గొన్నను తనభాగ్యము ప్రకారమే ఫలము గలుగును. శివునికంఠమం దుండియు వాసుకి గాలినే మేయును. మఱియు;—

165. ఆయాసములేని నీరుగాని, అపాయకర మయిన మధుర భోజనముగాని, ఈ రెంటికిని తారతమ్యము చూచుకొనఁగా ఎందు బాధ లేదో అది సుఖము.

ఇట్లాలోచించుకొని నరులు లేని యీయడవికి వచ్చితిని. ఏల యనఁగా,—

166. పులులు మదపుటేనుఁగులును నివసించు నడవిలో, చెట్లే ఇల్లుగా, పండిన పండ్లు తిని, నీళ్లు త్రాగి, గడ్డియే పడకగా, నారయే చీరగా, బ్రదుకుట యైనను మంచిది గాని బంధువులమధ్యను ధనము లేక జీవించుట మంచిది గాదు.

తర్వాత నాపుణ్యము మొలకయెత్తి ఈచెలికాఁడు నాయందు స్నేహ ముంచి నన్ననుగ్రహించినాఁడు. ఇపుడు ఆపుణ్యము పండి నీప్రాపు సాక్షాత్స్వర్గము నాకు దొరకినది. ఏల యనఁగా,—

167. సంసార మనునది యొకవిషవృక్షము, కాని దానికి అమృతతుల్యము లయిన పండ్లు రెండు కలవు, ఒకటి కావ్యములయొక్క అమృతతుల్య మయిన రసమును రుచి చూచుట, రెండవది సజ్జనులతోడి సాంగత్యము. మఱియు;—

168. సజ్జనులతోడి సాంగత్యము, హరియందు భక్తి, గంగాజలములో మునుఁగుట, ఈమూఁటిని నిస్సార మయిన యీసంసారములో సారములనుగా నెఱుఁగునది.

మంథరుఁడు ఇట్లనియె;—

169. ధనములు పాదరసమువలె (చంచలములు), జవ్వనము కొండవాఁకవడివలె (నస్థిరము), మనుష్యజన్మము నీటిబొట్టువలె నస్థిరము, బ్రదుకు నురుగువలె నిస్సారమును అస్థిరమును, స్వర్గద్వారముయొక్క గడియను తీసిపై చునదైన ధర్మమును ఏకాగ్రబుద్ధితో ఎవఁడు చేసికొనఁడో వాఁడు ముదిమి మూఁడినప్పుడు పశ్చాత్తాప మొంది శోక మనెడు నిప్పుచేత కాలిపోవును.

నీవు అమితముగా కూడఁబెట్టితివి, ఇది అందులదోషము. వినుము;—

170. చెఱువుకడపులోని నీళ్లకు కలుజు ఎట్లో, అట్లు కూడఁబెట్టిన ధనములకు దానమే రక్షణము. మఱియు;—



171. కడుపునిండ తినక నేలలో లోఁతున ధనమును పాఁతిపెట్టుట ఏదో అది అధోగతికి పోవుటకై దారి చేసికొనుట. ఏల యన;—

172. తన సౌఖ్యమును మానుకొని ఎవఁడు ధనమార్జింపఁగోరునో వాఁడు అన్యుల కొఱకు బరువు మోచువానివలె ఆప్రయాసను మాత్రమే అనుభవించును. చెప్పిరిగదా;—

173. ఒకరికి ఇచ్చుటయు తా ననుభవించుటయు లేని ధనముచే ఒకరు ధనికులేని భూమిలో గోతులలో పూడ్చిపెట్టిన ధనముచేత మేమును ధనికులమే. మఱియు;—

174. పిసినిగొట్టువానిధనము అనుభవము లేని విషయములో వానికిని ఇతరులకును సమానమే. మఱి వీనిదే యీధన మని తెలియుట ఎట్లనఁగా—నష్ట మైనప్పుడు వాఁడు మాత్రమే దుఃఖపడుటచేత. మఱియు,—

175. లోభివానిధనము దేవునికి వినియుక్తము గాదు, బ్రాహ్మణునికిని గాదు, బంధువులకును గాదు, తనకును గాదు; మఱి యది నిప్పుపాలు, దొంగపాలు, రాజుపాలును అగును. అట్లును చెప్పఁబడినది;—

176. మంచిమాటతోఁగూడుకొన్న యీవి, గర్వములేని జ్ఞానము, ఓర్పుతోడి పరాక్రమము, ఈవిగల ధనము, ఈనాలుగును లోకములో దొరకవు.

177. ధనమును నిత్యము కూడఁబెట్ట వలసినదే గాని అపరిమితముగా కూడఁబెట్టఁగూడదు. కూడఁబెట్టుటయే అలవాటైననక్క వింటిచేత చచ్చుటను ఎఱుఁగుఁడు.

---

కథ. ౪.

ఆరెండును (కాక మూషకములు) ఆకథ చెప్పుమని యడిగినవి. మంథరుఁడు చెప్పందొడంగెను;— కల్యాణకటక మను నగరములో భైరవుఁ డని యొక వేటకాఁ డుండెను. వాఁ డొకనాఁడు మాంసముకొఱకు విల్లు కేలఁగొని వింధ్యారణ్యమధ్యముం గొచ్చెను. అచ్చట నొకజింకను చంపి కొనిపోవుచుండఁగా వానికి భయంకరమయిన పందియొకటి యగపడెను. అంత నావేటకాఁడు జింకను నేల దించి పందిని కోలతో కూల నేసెను. పందియు మేఘమువలె భయంకరముగా గర్జించి వానిని ముష్కములో పొడిచెను; ఆపోటునకు వాఁడు నఱికినచెట్టువలె నేలం గూలెను. ఏల యన,—

178. నీళ్లు, నిప్పు, విషము, ఆయుధము, రోగము, కొండ పడుట,—ఇట్టి దేదో ఇంచుకనిమిత్తమును పొంది ప్రాణి ప్రాణములను వదలును.

వేటకానియొక్కయు పందియొక్కయు అడుగుల త్రొక్కుడిచేత పామొకటి చచ్చినది. ఇంతలో దీర్ఘరావ మను నక్క యొకటి మేఁతకై తిరుగుచు చచ్చిపడియున్న వానిని, జింకను, వేటకానిని పామును, పందిని, చూచి యిట్లు తలపోసెను.—'నాకు విస్తారము ఆహారము దొరకినది.' కా కేమి,—

179. ప్రాణులకు ముందు ఊహింపనిదుఃఖములు ఎట్లు వచ్చునో సుఖములు కూడ అట్లే వచ్చు నని తలంచెదను. ఇందు దైవబలమే బలము.

బళీ! వీనిమాంసములు నాకు మూఁడునెలలకంటె పైగానే తిండికి చాలును.

180. మనుష్యుఁడు ఒకనెలకు చాలును, జింకయు పందియు రెండుమాసములకు వచ్చును, పాము ఒకనాఁటికి వచ్చును, ఈదినమునకు వింటినారిని తినవలసినది. కావున తొలియాఁకటికై చవిలేనిదానిని కొయ్యకు తగుల్కొనియున్న యీనరముల్రాటిని తినెదను.' ఇట్లనుకొని అట్లు చేసెను. నరముల్రాటిని తెగఁగొఱుకఁగానే విల్లు ఎగసిపడి దీర్ఘరావమునకు ఱొమ్మునం దాఁకెను. దీర్ఘరావము చచ్చెను.

కావున ధనమును 'నిత్యము కూడఁబెట్టవలసినదే గాని' ఇత్యాదికమును పలికితిని.

181. దేనిని ఇచ్చునో దేనిని అనుభవించునో అదే ధనికులయొక్క ధనము చచ్చినవానియొక్క భార్యతోను ధనములతోను ఇతరులు క్రీడింతురు.

కడచిపోయినదాని నిప్పుడు వర్ణించి యేమి ప్రయోజనము? ఏల యన.—

182. వివేకముతోఁ గూడిన బుద్ధి గలజనులు, దొరకనిదానిని కోరరు, పోయిన దానికి వగవరు, ఆపదలయందు సయితము తెలివి తప్పరు.

కావున మిత్త్రుఁడా, ఎల్లవిధములను నీవు ఉత్సాహవంతుఁడవుగా నుండవలయును. ఏల యన,—

183. శాస్త్రములు చదివియు మూర్ఖుఁ డగును, కార్యము ఎవ్వఁడు సేయునో వాఁడు విద్వాంసుఁడు; చక్కఁగా ఆలోచించి చేసినమందు సయితము పేరు చెప్పినమాత్రాన రోగులకు రోగమును కుదుర్పదు. మఱియు;—

184. పని చేయుటకు వెఱచువానికి విజ్ఞానము సంపాదించుటచేత ఇంచుకయేని ప్రయోజనము లేదు. గ్రుడ్డివానికి అఱచేతిలో దీపమున్నను వస్తువులు అగపడునా?

కావున మిత్త్రుఁడా, యీయసాధారణదశలో ఓపిక సేయవలయును. ఇదియు ఎక్కువ కష్ట మని నీవు తలంపవలదు. ఏల యన,—

185. రాజు, కులభార్య, బ్రాహ్మణుఁడు, మంత్రులు స్తనములును, దంతములు, వెండ్రుకలు, గోళ్లు మనుష్యులును- తమ తావు తప్పినయెడల శోభం గోలుపోవుదురు. ఇది యెఱిఁగి బుద్ధిమంతుఁడు తనతావును వదలఁడు.—అనుమాట దుర్జనులది. ఏలన;—

186. సింగములు, సజ్జనులు, ఏనుఁగులును, తావు వదలి పోవుటయు, కాకులు, కాపురుషులు, జింకలును అక్కడనే నశించుటయు ప్రసిద్ధము.

187. మానవంతుఁడైన వీరునికి స్వదేశ మేది, పరదేశ మేది? ఏదేశమున చేరునో దానినే బాహుపరాక్రమముచేత స్వాధీనపఱుచుకొనును. సింహములు ఏయడవిలో చొచ్చునో ఆయడవిలోనే కోఱలు, గోళ్లు, తోఁకయునే ఆయుధములుగా మత్తగజ



ములం గూల్చి వానినెత్తుటితో దప్పి తీర్చుకొనును. మఱియు;—

188. పడియను కప్ప లెట్లో, నిండుచెఱువును పక్షు లెట్లో, అట్లే ప్రయత్నము సేయునట్టి నరుని ఎల్లసిరులును తమ వసము దప్పి వచ్చి చేరును. మఱియు;—

189. వచ్చిన సుఖమును అనుభవింప వలసినది; వచ్చినదుఃఖమును అట్లే; సుఖదుఃఖములు చక్రమువలె సుడియుచుండును. మఱియు;—

190. ఉత్సాహము గలవాఁడును, పని త్వరగా చేసికొనువాఁడును, పని చేయు విధము నెఱిఁగినవాఁడును. జూదము లోనగు దుర్వ్యసనములయందు తగులనివాఁడును, శూరుఁడును, చేసినమేలు మఱవనివాఁడును, చెడని స్నేహము కలవాఁడును; అయినపురుషునియందు లక్ష్మి స్వయముగా వచ్చి నివసించును. మఱియు ముఖ్యముగా,—

191. ధీరుఁడు ధనములు లేకున్నను సత్కారముతోడి యున్నత మయిన పదవిని బొందును; పంద ధనములు కలవాఁ డయినను అవమానము పొందును: సింహమునకు గుణసమూహములకు తావల మయిన స్వాభావికకాంతి కుక్కకు బంగారపుఁ బూదండలతో నలంకరించినను కలుగునా? మఱియు,—

192. ధన మున్నప్పుడు గర్వపడ నేల? విభవము పోయినప్పుడు దుఃఖపడ నేల? మనుష్యులకు పడుటయు లేచుటయు చేతితోఁ గొట్టిన బంతి కెట్లో అట్లే సుమా.

193. మేఘములయొక్క నీడ, దుష్టులతోడి చెలిమి, క్రొత్త పైర్లు, స్త్రీలును, కొలఁదికాలమే అనుభవింపఁబడునవి; అట్లే జవ్వనములును ధనములును. మఱియు;—

194. జీవికకొఱకు ఎక్కువగా చింతింపవలదు, దానిని ముందుగా బ్రహ్మయే ఏర్పఱిచి యున్నాఁడు; కడుపులోనుండి ప్రాణి పుట్టఁగానే తల్లి చన్నులు చేఁపుటయే యిందులకు నిదర్శనము.

దీనిని విని లఘుపతనకుఁ డిట్లనియె;—కృతార్థుఁడవు మంథరుఁడా, ఎల్లవిధములను పొగడవలసిన గుణములు గలవాఁడవు సుమా చెలికాఁడా.

195. ఎవఁడు హంసలను తెల్లని వానినిగాను, చిలుకలను పసరు వన్నె వానినిగాను, నెమళ్లను చిత్రవర్ణములు కలవానిని గాను, చేసెనో, వాఁడు నీకు బ్రదుకుఁదెరువు నేర్పరించును.

మఱియు, మిత్త్రుఁడా, ఒక రహస్యము వినుము.—

196. సంపాదనలో శ్రమ కలిగించునవి, నష్టములయినప్పుడు దుఃఖపెట్టునట్టివి? కలిమి యున్నప్పుడు తెలివి తప్పించునవి, ధనములు సుఖ మొసంగు ననుట యెట్లు?

197. ఎవఁడు ధర్మమునకై ధనమును కోరునో వానికి కోరికయే లేకుండుట మేలు. అడుసును ద్రొక్కి కడిగికొనుటకంటె, దూరమున అంటక యుండుటయే మేలు, ఏల యన;—

198. మాంసమును ఆకాశములో పక్షులును, నేలలో ఘాతుకమృగములును, నీటిలో చేపలు భక్షించునట్లే ధనవంతుని యెల్లయెడలను భక్షింతురు. మఱియు;-

199. ప్రాణము కలవారికి మృత్యువువలన భయ మెట్లో, అట్లే ధనము కలవారికి సర్వదా రాజువలన, నీటివలన, నిప్పువలన, దొంగవలన, బంధువులవలనను భయము

200. కష్టములతో నిండిన జన్మములో ఇంతకన్న దుఃఖ మే మున్నది? ఏ దన— క్షీణసంపద లేకుండుటయు, కోరిక పోకుండుటయు. మఱియు అన్నా, వినుము.

201. ధనమే మో సులువుగా దొరకదు; దొరకినా కాపాడుట కష్టము; దొరకి నది పోయె నేని ప్రాణము పోయినట్లే యుండును; కావున ధనమును తలంప వలదు.

202. ఆశను వదలినయెడల, ఇఁక దరిద్రుఁ డెవఁడు? ధనికుఁ డెవఁడు? దానికి చోటు ఇచ్చినయెడల దాస్యము నెత్తిని కూర్చుండును. మఱియు;—

203. దేనిని దేనిని కోరునో దానిమీఁదికి కోరిక ప్రసరించును. దేనినుండి ఆశ మరలునో, అది అబ్బినదానితో సమానము.

పెక్కుమాట లేల? నమ్మకముగా మాటలాడుకొనుచు నాతో కూడ ఇట నే కాలము గడపుము. ఏల యనఁగా;—

204. మహాత్ములకు స్నేహములు చావుపర్యంతము ఉండును; కోపము గలిగినా క్షణములో పోవును; భోగభాగ్యాదులను వదలుటలో శంక యుండదు.

205. ఎల్లయెడలను ప్రాణి నిశ్చయముగా మిక్కిలి లేచుట, పడుటకే, కూడుట పాయుటకే, బ్రదుకుట చచ్చుటకే. ఏల యన,—

206. ఎప్పుడును సజ్జనులే సజ్జనులను ఆపదనుండి ఉద్ధరింపఁగలవారు; బురదలో కూలిన యేనుఁగులను లేవఁదీయుటకు ఏనుఁగులే సమర్థములు. అట్లే మఱియును;—

207. గుణ మెఱిఁగినవాఁడు గుణము గలవానిని ప్రేమించును, గుణశీలములు లేని వానికి గుణవంతునియందు సంతోషము లేదు; తుమ్మెద అడవినుండి వచ్చి తామరను చేరును; ఆతామరతోఁగూడనే వసించున దైనను కప్ప తామరం జేరదు. మఱియు;—

208. ఎవనినుండి యాచకులుగాని శరణార్థులుగాని ఆశాభంగము నొందరో, విముఖులు గారో, లోకములోని మానవులలో అతఁ డొక్కఁడే పొగడఁదగినవాఁడు, ఉత్తముఁడు, సత్పురుషుఁడు, కృతార్థుఁడు.

## చిత్రాంగుని రాక.

ఈ తీరున నామూఁడును ఇచ్చవచ్చినట్లు తినుచు; తిరుగుచు తనివి గలిగి సుఖ ముగా జీవించు చుండినవి. ఇట్లుండఁగా చిత్రాంగుఁ డను జింక ఎవనికో భయపడి బెదరి వచ్చి వానితోఁ గలసినది. వెనుక వచ్చుచున్న జింకను చూచి మంథరుఁడు నీటఁ జొచ్చె ను. ఎలుక లాఁగలోఁ దూరెను. కాకి ఎగిరి చెట్టుకొనకుఁ బోయెను.



లఘుపతనకము మిక్కిలి దూరము పరికించి భయకారణము నేమియు కానదా యెను. తర్వాత అన్నియు వచ్చి కలసికొని కూర్చున్నవి. ‘కల్యాణుఁడా, జింకా, నీకు కుశలము; స్వేచ్ఛగా నీరు లోనగు నాహారము ననుభవింపుము. ఇచ్చట నీ వుండుటచేత ఈయరణ్యమును నాథుఁడు గలదానినిగాఁ జేయుము.’ అని మంథరకుఁ డనియెను. ‘అయ్యా, నేను వేఁటకానికి భయపడి వచ్చి మిమ్ము శరణుఁజొచ్చితిని; ఏల యన, —

209. లోభముచేతఁగాని భయము చేతఁ గాని ఎవఁడు శరణాగతుని వదలునో వానికి బ్రాహ్మణునిఁ జంపిన పాపము వచ్చు నని పెద్దలు చెప్పుదురు.

కావున మీతోఁ గూడ చెలిమిని కోరియున్నాను.’ అని చిత్రాంగుఁడు పలికెను. అంతట హిరణ్యకుఁ డిట్లనియె.—‘అయ్యా’ చెలిమి నీకు మాతో నిప్పు యత్నముగానే సిద్ధించినది. ఏల యనఁగా,—

210. కడుపునఁ బుట్టినవాఁడు, సంబంధము చేసినవాఁడు, అట్లే వంశపరంపరగా వచ్చినవాఁడు, కష్టములనుండి కావఁబడినవాఁడును, అని మిత్త్రుని నాలుగు విధముల వానినిగా నెఱుంగవలయును.

కావున నిట నీయింట నున్నట్లే అభేదముగా నుండుము.’ ఆమాట విని జింక సంతోషపడి ఇచ్చవచ్చిన మేఁత మేసి నీరు త్రాగి నీటిచెంత నున్న చెట్టునీడయందు కూర్చున్నది. ఏల యనఁగా,—

211. నూతి నీరు, మఱ్ఱినీఁడ, నడిజవ్వనంపు స్త్రీ, ఇటికయిల్లు,— ఇవి చలి కాలములో వెచ్చఁగాను వేసవికాలములో చల్లఁగాను ఉండును.

తర్వాత మంథరుఁడు ‘చెలికాఁడా, జింకా, ఎవనికి భయపడితివి? ఈ నిర్జన వనములో వేఁటకాండ్రెచట నేని ఎపుడేని సంచరింతురా ఏమి?’ అని యడిగెను. జింక యిట్లనియె.— ‘కళింగదేశములో రుక్మాంగదుఁ డని రాజొకఁడు కలఁడు. అతఁడు దిగ్విజయంపువరుసలో వచ్చి చంద్రభాగానది యొడ్డున విడిసి యున్నాఁడు. తెల్లవాఱునప్పటికి అతఁడు ఇచ్చట కర్పూరసరస్సుకడకు వచ్చు నని వేఁటకాండ్ర మాటలవలన నానుడి కలిగియున్నది. కావున ఇట కూడ తెల్లవాఱినతర్వాత ఉండుట అపాయకరము అని ఆలోచించి ఏమి చేయఁదగునో అట్లు చేయుఁడు.’ ఆమాట విని భయపడి తాఁబేలు ‘నే నింకొక చెఱువునకుం బోయెదను.’ అనెను కాకియు జింకయు ఆలోచించి, ‘అట్లే చేయుము’ అని చెప్పినవి. హిరణ్యకుఁడు ఆలోచించుకొని యి ట్లనియె. ‘మఱియొక చెఱువునం జేరిన పిమ్మట మంథరునికి క్షేమమే, నేలను పోవుచుండఁగా ఆపదం దొలఁగించు కొనుట యెట్లు? ఏల యన;—

212. జలజంతువులకు నీరు గొప్పబలము; దుర్గమందు నివసించువారికి దుర్గము గొప్పబలము; ఘాతకమృగములు లోనగువానికి వానివాని యునికిపట్టు బలము; రాజులకు దండు గొప్పబలము.

చెలికాఁడా, లఘుపతనకుఁడా, ఈ యుపదేశముచేత ఏ మగు ననఁగా.—

213. తనభార్యయొక్క స్తనములను ఒరుఁడు పీడించుచుండఁగా తానే చూచి వైశ్యకుమారుఁడు ఎట్లు దుఃఖపడెనో, నీవును అట్లే అగుదువు.'

కథ. ౧౧.

ఆకథ చెప్పు మని వారిరువురును అడిగిరి. హిరణ్యకుఁడు చెప్ప సాగెను.— కాన్యకుబ్జదేశమందు వీరసేనుఁ డని రా జుండెను. అతఁడు వీరపుర మను పట్టణమునకు తుంగబలుఁ డను రాజకుమారుని యువరాజుం జేసెను. అతఁడు మహాధనికుఁడు, వయసువాఁడు, ఒకనాఁడు తననగరములో సంచరించుచు మిక్కుట మయిన నిండు జవ్వనమున నున్నదానిని లావణ్యవతి యనుదానిని ఒక వైశ్యకుమారునిభార్యను గాంచెను. అంతట మదనునిచేత మతి కలఁగి తన మేడకుం బోయి ఆ జవరాలికై దూతి నంపెను. ఏలన;—

214, 215. వింటినారిని చెవిదాఁక లాఁగి ప్రయోగించిన నీలిఱెక్కల కోల గుండెకుఁ దాఁకఁగానే ఎట్లో, అట్లే ఎమ్మెకత్తియల చూపులు కనుబొమల చలనముతోఁ గూడినవై చెవులతుదలవఱకు నిగిడినవై నల్లనిఱెప్పలు గలవై ఎందాఁక మనస్సును దాఁకవో, అందాఁకనే నరుఁడు మంచిమార్గమున నడచును, అందాఁకనే ఇంద్రియములను నిగ్రహించును, అందాఁకనే లజ్జపడును, అందాఁకనే వినయము వహించును.

లావణ్యవతియు అతనిం గాంచినక్షణమునుండి మదనుని కోలల యేటులచేత గుండె తూట్లు వోయి అతనియందే మనస్సు నుంచిన దాయెను. చెప్పిరి గదా;—

216. అసత్యము, సాహసము, మోసము, కడుం బిసిఁడితనము, మంచితనము లేమి, శుచిత్వము లేమి,— ఇవి స్త్రీలకు స్వభావసిద్ధము లయిన దోషములు.

అంతట దూతిమాటను విని లావణ్యవతి యి ట్లనియె.— 'నేను పతివ్రతను జుమా, పరపురుషుని తాఁక నయినను తాఁకను. ఏల యనఁగా, —

217. ఎవతె ఇంట నిపుణురాలో అదిభార్య, ఎవతె సంతతికలదో అది భార్య, ఎవతెకు పతి ప్రాణమో అదే భార్య, ఎవతె పతివ్రతయో అది భార్య. మఱియు;—

218. ఎవతెయందు పతి సంతోషము చెందఁడో, దానిని భార్య యని చెప్పఁగూడదు; భర్త సంతోషించిన స్త్రీలకు ఎల్లవేల్పులును సంతోషింతురు.

219. కోకిలలకు స్వరమే సౌందర్యము; స్త్రీకి పాతివ్రత్యమే సౌందర్యము; కురూపులకు విద్యయే సౌందర్యము, తాపసులకు శాంతియే సౌందర్యము.

220. ఎవతెయొక్క గుణములను మంచి నడవడితోను ధర్మముతోను కూడుకొన్నవానిని భర్త పొగడునో (అది భార్య); అగ్నిసాక్షిక మయిన ప్రతిజ్ఞకలవాఁడు భర్త గదా స్త్రీకి రక్షకుఁడు.



కావున నా ప్రాణేశ్వరుఁడు ఏమే మాజ్ఞాపించునో నేను దానినే ఆలోచింపక చేసెదను.' 'ఈమాట నిశ్చయమా?' అని దూతి యడిగెను. 'నిశ్చయము' అని లావణ్యవతి యుత్తరము చెప్పెను. వెంటనే దూతి పోయి ఆవృత్తాంతము నెల్ల తుంగబలునికి తెలియఁజేసెను. దానిని విని తుంగబలుఁడు 'దాని మగఁడే తెచ్చి నా కిచ్చుట యనునది యెట్లు సాధ్యము?' అని యడిగెను. 'అందులకు ఉపాయము చేయవలయును. పెద్దలమాటయే మన;—

221. ఉపాయమునకు ఏది సాధ్యమో అది పరాక్రమమునకు సాధ్యము గాదు; బురదదారిలోఁ దోడ్కొని పోయి నక్క యేనుఁగును చంపినది.' అని కుట్టని చెప్పినది.

అవాంతర కథ. ౨.

ఆకథను చెప్పు మని రాజపుత్త్రుఁ డడిగెను. కుట్టని చెప్పుచున్నది.— బ్రహ్మారణ్యమందు కర్పూరతిలక మనుపేరి యేనుఁగు ఉండెను. దానిని గాంచి నక్క లన్నియు ని ట్లాలోచించినవి. 'ఏ యుపాయముచేత నైనను ఇది చచ్చునెడల అంతట మనకు దీనికళేబరము నాలుగు నెలలకు ఆహార మగును.' అని. అందొక ముదినక్క 'నేను బుద్ధిప్రభావముచే దీనిని చంపెదను.' అని ప్రతిజ్ఞ చేసెను. తర్వాత ఆనక్క కర్పూరతిలకము కడకుపోయి సాష్టాంగముగా చాఁగిలంబడి 'దేవా, నాకేసి కటాక్షము ననుగ్రహింపుము' అని వేఁడెను. 'ఎవఁడవు నీవు?' అని యేనుఁగు అడిగెను. అది చెప్పెను. 'నేను నక్కను, అడవిలో నివసించు జంతువు లన్నియు కలసి తమ సన్నిధానమునకు నన్ను పంపినవి. ఏల యనఁగా, రాజు లేక యుండుట సరిగాదు; కావున ఇచ్చట అడవి దొరతనమందు నిన్ను సకల ప్రభులక్షణములతోను కూడుకొన్నవానిని పట్టాభిషేకము చేయుటకు నిశ్చయించుకొన్నవి. ఏల యనఁగా;—

222. కులాచారమందు, లోకాచారమందును, మిక్కిలి పరిశుద్ధుఁడు, ప్రతాపవంతుఁడును, ధర్మమాచరించువాఁడును, నీతియందు నిపుణుఁడును, ఎవఁడో, అట్టివాఁడు లోకములో రాజుగా నుండఁదగినవాఁడు. మఱియుం బరికింపుము;—

223. ముందుగా రాజును ఏర్పరించుకొనవలయును, తర్వాత భార్యను, తర్వాత ధనమును. లోకములో రాజు లేఁడేని భార్య యెక్కడ? ధన మెక్కడ? మఱియు;—

224. మేఘునివలె జంతువులకు రాజు రక్షకుఁడు; మేఘుఁడు లేకున్నను బ్రదుక వచ్చును గాని రాజు లేనియెడల బ్రదుకలేము. మఱియు;—

225. దెబ్బకు భయపడి లోకులు వారివారి హద్దులో వారు ఉందురు. లోకము వసము దప్పినయెడల యోగ్యుఁడు అరుదు. కృశుఁడుగాని కుంటిగాని రోగిగాని అగు మగని కులస్త్రీప్రముఖము దెబ్బకు భయపడి కూడును.

కావున లగ్నవేళ మించకుండ ఏలినవారు వడిగా రావలయును.' ఇట్లు పలికి లేచి చనసాగెను.

అంతట కర్పూరతిలకము రాజ్యముమీఁదియాశ లాగఁగా నక్క పోయిన దారినే పరువిడి గొప్పయుబ్బలిలో పూడి 'చెలికాఁడా, నక్కా, ఇప్పు డేమి చేయఁదగును? పెనుబురదలో పడితిని.' అని యడిగెను. నక్క నవ్వుచు నిట్లనియె;—'ప్రభూ, నాతోఁకకొనను చేయి యుంచి లెమ్ము. నామాటను నీవు నమ్మినందులకు ఫల మిది. అట్లే చెప్పినారు;—

226. ఎప్పుడు సత్సహవాసము కలవాఁడ వగుదువో అప్పుడు వర్ధిల్లుదువు, ఎప్పుడు దుర్మార్గుల సహవాసములో పడుదువో అప్పుడు నశింతువు.'

అంతట పెనుబురదలో పడిన యేనుఁగును నక్కలు భక్షించినవి. కావున 'ఉపాయమునకు ఏది సాధ్యమో' ఇత్యాదికమును చెప్పితిని.

———

తర్వాత కుంటెనకత్తెయొక్క ఉపదేశముమీఁద ఆరాజకుమారుఁడు ఆవైశ్యకుమారుని తన కొలువులో నుంచుకొనెను; క్రమక్రమముగా సమస్తమైన నమ్మకపుఁబనులలోను నియమించెను. ఒకనాఁడు రాజకుమారుఁడు స్నానము చేసి మైపూఁత యలంది సింగారపు నగలు ధరించి యి ట్లనియె;—'నేను ఒక నెలవఱకు గౌరీవ్రతము చేసెదను, అందులకై నేఁటినుండి ప్రతిరాత్రియు కులకన్య నొకతెను జవరాలిని తెచ్చి నా కప్పగింపుము. ఆమెను నేను విధిప్రకారము పూజించెదను.' అంతట చారుదత్తుఁ డనుపేరి యావైశ్యకుమారుఁడు ఆవిధ మయిన జవరాళ్లని తెచ్చి ఒప్పగించుచుండెను; ఏమి చేయునో యని చాటునుండి చూచుచుండెను. తుంగబలుఁడు ఆతరుణిని తాఁకకయే దూరమునుండి వస్త్రాలంకార గంధ చందనములు సమర్పించి తోడిచ్చి యింటికి పంపుచుండెను. దానిం గని వైశ్యకుమారుఁడు నమ్మకము పొందినవాఁడై లోభము మనస్సును లాగఁగా తన భార్యను విలాసవంతురాలిని తెచ్చి యిచ్చెను. తుంగబలుఁడు ఆమెను తన మనోదయితయగు లావణ్యవతినిగా నెఱింగి తొట్రుపాటుతో లేచి బిగ్గఁగవుంగిలించి ఆనందముచే కనులు మూసికొని మంచముపై దానితోఁగూడ క్రీడించెను. దానిం గని వైశ్యకుమారుఁడు చిత్తరుబొమ్మవలె ఱిచ్చవడి మిక్కిలి దుఃఖపడెను. కావున 'తన భార్యయొక్క' ఇత్యాదికమును చెప్పితిని, నీకును అట్లే అగు నని.

అంతట ఆమాటను ఆకళించి మంథరుఁడు ఆచెఱువును వదలి తరలెను. హిరణ్యకాదులును దాని వెంబడినే పోవుచుండినవి. నేలమీఁద పోవుచున్న యాతాఁబేటిని వేటకాఁ డొకఁడు అడవిలో తిరుగుచు చూచి పట్టుకొని ఎత్తి వింటికి కట్టి ఆఁకటికి దప్పికి శ్రమపడుచు తనయింటికేసి పోవుచుండెను. కాక మృగ మూషకములు మిక్కిలి దుఃఖము పొంది వానివెంటనే పోవుచుండినవి. అంతట హిరణ్యకుఁడు ఇట్లు వందురెను.—

227 ఒకదుఃఖమునకు మహాసముద్రమునకుంబోలె ఇంకను గట్టును నేను కానక



యుండఁగా, ఇంతలో రెండవది నాకు సంభవించినది; కష్టములలోఁ జెఱుపులు పెరుఁగును.

228. భాగ్యము చూచివచ్చిన మిత్త్రుఁడు గాక స్వభావముచేత ఎవఁడు మిత్త్రుఁడయినాఁడో వాఁడుకృత్రిమముగాని చెలిమిగలవాఁడు, ఆపదలయందుకూడ వదలిపోఁడు.

229. స్వాభావికమిత్త్రునియందు పురుషులకు ఎట్టివిశ్వాసమో అట్టి విశ్వాసము తల్లియం దుండదు, భార్యయం దుండదు, భ్రాతయం దుండదు, కొడుకునం దుండదు.

ఇట్లని మాటిమాటికిం దలపోసి, 'అయ్యో! ఏమి నాదురదృష్టము! ఏల యన;—

230. తనకర్మపరంపరయొక్క చేఁతలును కాలాంతరమందు శుభాశుభ రూపమున మరల మరల వచ్చుచుండునవియు నైన యవస్థాఫలములను జన్మాంతరములనుంబోలె నేను ప్రసిద్ధముగా ననుభవించితిని. అట్లు కాదేని,—

231. దేహమునకు అపాయము దగ్గఱనే ఉన్నది; సంపదలు ఆపదలకు మూలము; కూటమి పాయుటకే; పుట్టునదెల్ల చచ్చునదే. (ఆలోచించుకొని)

232. శోకమునుండియు శత్రువులనుండియు రక్షించునదియు, స్నేహమునకును విశ్వాసమునకును తా నైనదియు, మిత్త్ర మనెడి రెండక్షరముల యీరత్నమును ఎవఁడు సృజించినవాఁడు! మఱియు;—

233. కన్నులకుప్రీతినొసంగెడు దివ్యౌషధ మైనవాఁడును, మనస్సునకు ఆనందము కలిగించువాఁడును, తనతో సమానముగా సుఖదుఃఖము లనుభవించువాఁడును, అగు మిత్త్రుఁడు దొరకఁడు; ఐశ్వర్య మున్నప్పుడు అంతటను ధనాభిలాషచేత చేరునట్టి యితర స్నేహితులు ఎవరో వారి వాస్తవ స్వరూపమును పరీక్షించునట్టి యొరగల్లు ఏ దనఁగా, ఆపద.'—

ఇట్లు పనవి పనవి హిరణ్యకుఁడు చిత్రాంగలఘుపతనకులతో— 'మిత్త్రులారా' ఈ వేటకాఁడు అడవి దాఁటి పోకముందే మంథరుని విడిపించుటకు యత్నము సేయుదము.' అనెను. 'చేయవలసిన విధములు త్వరగా చెప్పుము.' అని ఆరెండు నడిగినవి. 'చిత్రాంగుఁడు నీటికడకేఁగి తాను చచ్చిపడియున్నట్లుఅగపఱుచుకొనునుగాక; కాకి దానిపై నెక్కి ముక్కుతో ఏమేమో గీఱుచుండునుగాక; అంతట నిశ్చయముగా ఈ వేటకాఁడు అచ్చట తాఁబేటిని క్రిందఁ బెట్టి జింకమాంసమున కాసపడి వడిగా పోవును. అంతట నేను మంథరుని యురులను తెగఁగొఱికెదను.' అని హిరణ్యకుఁడు చెప్పెను. చిత్రాంగలఘుపతనకులు త్వరగా పోయి ఆప్రకారము చేయఁగా, ఆవేటకాఁడు అలసి నీళ్లు త్రాగి చెట్టుక్రింద కూర్చుండి ఆతీరున నున్న జింకను చూచి వెంటనే కత్తెర తీసికొని సంతోషముతో దానికడకు నడచెను. ఈలోపల హిరణ్యకుఁడు వచ్చి ఉరులు త్రెంపఁగా తాఁబేలు వడిగా చెఱువులో చొచ్చెను. సమీపించిన వేటకానిం గాంచి జింక లేచి పాఱిపోయెను. మరల వచ్చి వేటకాఁడు చెట్టుక్రింద

చూచుకొనునప్పటికి తాఁబేలు లేదు. అంతట వేటకాఁడు ఇట్లు తలపోసెను.—చక్కఁగా చూచుకొనకుండ ప్రవర్తించినట్టి నాకు ఇది తగినదే. ఏల యనఁగా,—

234. ఎవఁడు చేత స్థిరముగా నున్నవానిని వదలి అస్థిరముల నపేక్షించిపోవునో వానికి స్థిరములు నశించును, అస్థిరములు నష్టములే గదా.'

ఇట్లు దుఃఖపడి వాఁడు తన తప్పిదముచేత నిరాశుఁడై ఊరికి పోయెను.

235. మిత్రులను సంపాదింపవలసినది; చూడు, చొరరాని యడవులలో తాఁబేటిని బంధనమునుండి ఎలుక విడిపించినది.

మంథరాదు లందఱును ఆపద తీఱి తమతావు చేరి సుఖ ముండిరి.

ఇట్లు విని రాజకుమారులు సంతోషించి "మేము, అంతయువింటిమి, సుఖుల మైతిమి. మాకోరిక ఈడేరినది.' అని పలికిరి. విష్ణుశర్మ యి ట్లనియె.—

ఇంతటితో మీకోరిక తీరినది. అయినను ఇది కూడను అగును గాక.

236, 237, సత్పురుషులారా, మిత్రులను గడించుకొనుఁడు, దేశములలో సిరి నెలకొనును గాక, రాజులు భూమిని సదా ధర్మమార్గమం దుండి పరిపాలింతురు గాక, క్రొత్తపెండ్లికూఁతువలె మీకు నీతి మనస్సంతోషమును కలిగించుఁగాక, నెలబాలుని సిగరత్నముగాఁ దాల్చునట్టి భగవంతుఁడు జనులకు మేలు సేయును గాక.

మిత్రలాభము.

సమాప్తము.

---

శ్రీ

# హితోపదేశము.

## సుహృద్భేదము.

తర్వాత రాజపుత్రులు 'అయ్యా, మిత్రలాభమును వింటిమి. కనుక నిప్పుడు మేము సుహృద్భేదమును వినఁగోరుచున్నాము.' అని పలికిరి. విష్ణుశర్మ యి ట్లనియె.—'సుహృద్భేదమును వినుఁడు; దాని మొదటి శ్లోక మిది.—

1. అడవిలో సింహమునకును ఎద్దునకును పెరుఁగుచున్న మహాస్నేహమును మిక్కిలి యొంటెత్తుదనముగల దైన నక్క కొండెములు చెప్పి నాశము చేసినది.'

రాజపుత్రులు ఆకథ చెప్పు మని యడిగిరి. విష్ణుశర్మ చెప్పందొడంగెను —

దక్షిణాపథమందు సువర్ణవతి యని ఒక పట్టణము కలదు. అందు వర్ధమానుఁడను వైశ్యుఁడు వసించియుండెను. అతనికి ధనము విస్తారముగా నున్నను ఇతరులను అతి సమృద్ధులను చూడఁగా ఇంకను ధనము సంపాదింపవలయు నని కోరిక కలిగినది. ఏల యనఁగా;—

2. క్రిందక్రింద చూచువాని కెవనికి తన మహిమ ఎక్కువగా అగపడదు? పైపై చూచువా రెల్ల దరిద్రులే అగుదురు. మఱియు;—

3. విస్తారము ధనము గలజనుఁడు బ్రహ్మహత్య చేసినవాఁ డయినను పూజ్యుఁడగును. చంద్రునితో సమాన మయిన మంచివంశమందు పుట్టినవా నైనను ధనహీనుని తిరస్కరింతురు. మఱియు;—

4. పాటుపడని వానిని, సోమరిని, దైవమునే నమ్మికొనియుండు వానిని, తెగువ లేని వానిని, సిరి, ముదిమగని పడుచుభార్యవలె, తాఁక నైన నొల్లదు. మఱియు;—

5. సోమరితనము, స్త్రీలను కొలుచుట, రోగము కలిగియుండుట, పుట్టినతావు మీఁది ప్రేమ, పిఱికితనము, అసంతుష్టి,—ఈయాఱును గొప్పతనమును రానీవు. ఏలన,—

6. ఎవఁడు ఉన్నసంపద స్వల్ప మయినను దానితో సంతుష్టి చెంది సోమరిగా నుండునో, వాని విషయమై తన పని తాను చేసినవాఁ డైన బ్రహ్మ వానిసంపదను వృద్ధి సేయఁ డని తలఁచెదను. మఱియు;—

7. ఉత్సాహము లేనివాఁడు, ఆనందము లేనివాఁడు, బీరము లేనివాఁడు, శత్రువులను సంతోషపెట్టువాఁడు,—ఇట్టి పుత్రుని ఏ సుమంగలియు కనకుండును గాక. అట్లే చెప్పఁబడియున్నది;—

8. దొరకనిదానిని కోరవలయును, దొరకిన దానిని వృథావ్యయము కాకుండ కాపాడవలయును, కాపాడిన దానిని చక్కఁగా వృద్ధిసేయవలయును, వృద్ధిపొందిన దానిని సత్పాత్రములకు ఈవలయును.

9. ఇచ్చుటయు ననుభవించుటయు లేక ఎవనిదినములు గడచిపోవునో, వాఁడు కమ్మరకొలిమిలోని తిత్తివలె ఊపిరించుచున్నను బ్రదుకనివాఁడే. ఏల యనఁగా,—

లేనిధనమును కోరనివానికి ప్రయోజనమును బట్టి చూడఁగా ధనములేని యట్లే; దొరకినదానిని కాపాడుకొనని యెడల నిధి యైనను స్వయముగా నశించును; వృద్ధి సేయని ధనము కాటుకవలె ఎంతకొంచెపాటి వ్యయముచేత నయినను క్షీణించును. అనుభవింపని ధనము నిష్ప్రయోజనమే. అట్లే గదా చెప్పినారు;—

10. పెట్టుక కుడువక యుంచుకొన్న ధన మది యేల? శత్రువులను కొట్టనట్టి బల మది యేల ? ధర్మము సేయనివాని శాస్త్రజ్ఞానము ఏల? జితేంద్రియుఁడు కానివాని బుద్ధి యేల ? మఱియు;—

11. కాటుక తఱుఁగుటయు, పుట్టలు పెరుఁగుటయు, చూచి, ఇచ్చుటయందు, చదువుటయందు, పని చేయుటయందును, దినమును సఫలముగాఁ గడపవలయును.

12. ఒక్కొక్కచినుకుగా నీరు పడి క్రమముగా కుండ నిండును; సకలవిద్యలకును ధర్మములకును ధనములకును ఇదే ప్రకారము.—

ఇట్లాలోచించి సంజీవక నందకము లనియెడు రెండెడ్లను పూంచి, బండి నిండ నానావిధ ద్రవ్యము లెక్కించి వర్తకముకై కాశ్మీరమునకు తరలెను. ఏల యనఁగా,—

13. బలముగలవారికి ఏబరువును మిక్కుటము గాదు; పాటుపడువారికి ఎంత దూర మయినను లక్ష్యము గాదు; విద్యగలవానికి పరదేశము లేదు. ప్రియ మాడువారికి శత్రువు లేఁడు.

తర్వాత అతఁడు పోవుచుండఁగా సుదుర్గ మను పేరి మహారణ్యములో కొండలో సంజీవకము మోఁకాలు విఱిగి పడినది. దానిం గని వర్ధమానుఁ డిట్లు తలపోసెను.

14. 'నీతి యెఱింగినవాఁడు ఎన్నివిధముల నైనను యత్నించును గాక, ఫలము మాత్రము విధి మనస్సులో ఏ మున్నదో అదే కలుగును. అయినను,—

15. దిగులును ఎల్లవిధములను మానవలయును; ఏల యన, అది ఎల్లపనులకును విఘ్నము; కావున దిగులు మాని సాధింపవలసిన పనిని సాధింపవలసినది.'—

ఇట్లు తలపోసికొని సంజీవకమును అచట విడిచిపెట్టి, వర్ధమానుఁడు తానే ధర్మపుర మను పట్టణమునకు పోయి గొప్పదొడ్డును మఱియొకదానిని కొని, నొగకు పూంచి తరలెను.



సంజీవకము ఎట్టకేలకు మూఁడుకాళ్లమీఁదనే బరువు ఊనుకొని లేచినది. ఏలన,—

16. సముద్రములో మునిఁగినవానికి, కొండమీఁదనుండి పడినవానికి, తక్షకనాగునిచేత కఱవఁబడినవానికి ఆయుశ్శేష మున్నయెడల అది ఆయువుపట్లను కాపాడును. మఱియు;—17. కొండశిఖరమునుండి పడనీ, సముద్రములో మునుఁగనీ, అగ్నిలో దూరనీ, పాములతో ఆడనీ, కాలము వచ్చిననే గాని ఎవనికిని చావు రాదు.

18. నూఱులకొలఁది బాణములతో కొట్టినను జంతువు దానికాలము రాకమునుపు చావదు. కాలము వచ్చెనేని దర్భమొనతో తాఁకినమాత్రాననే చచ్చును. ఏలనఁగా,—

19. కావక విడువఁబడినట్టిది దైవముచేత కావఁబడి చక్కఁగా నుండును, చక్కఁగా కావఁబడినది దైవముచేత కొట్టఁబడి నశించును; అడవిలో విడువఁబడి దిక్కుమాలినవాఁడు బ్రదుకుచున్నాఁడు, ఇంట నున్న వానికై ప్రయత్న మెంత చేసినను వాఁడు బ్రతుకుట లేదు.

తర్వాత దినములు గడచుచుండఁగా సంజీవకము తన కిష్ట మయిన మేఁత లోనగునవి దొరకినందున అడవులలో తిరుగుచు సంతోషముచేత దేహము బలియఁగా బెట్టిదముగా అంకెవైచెను. ఆ యడవిలో పింగళక మను సింహము తన బాహుబలముచే సంపాదించుకొన్న రాజ్యసుఖమును అనుభవించుచు నివసించెను. పెద్దలు చెప్పిరి;—

20. అడవిలోని మృగములు తమ్ము నేలు మని సింహమునకు పట్టాభిషేకసంస్కారము చేయవు; అదియే పరాక్రమముచేత రాజ్యమును సంపాదించి మృగరాజగును.

అది యొకనాఁడు దప్పిగొని నీరుద్రాగుటకై జమునకసెమునకు పోయి, అచట ప్రళయకాల మేఘగర్జితమువంటిదానిని మును విననట్టి యాసంజీవకధ్వనిని విని భయపడి నీరుద్రాగకయే వెనుకకు మరలి తన యునికిపట్టునకు వచ్చి, ఇదేమో అని ఆలోచించి ఊరక యుండెను. ఆస్థితిలో నున్న యాసింహమును దానిమంత్రికుమారులు కరటక దమనకము లనెడినక్కలు చూచినవి. అంత దమనకుఁడు కరటకు 'మిత్త్రుఁడా, ఏల మన దొర నేఁడు దప్పిగొనియు నీరుద్రాగక వచ్చి యూరక యున్నాఁడు?' అని యడిగెను.

కరటకుఁ డిట్లనియె:—మిత్త్రుఁడా, నేను విశ్వాసముతో ఇతనిం గొలుచుట లేదు. ఇతనిచేష్టల విచారము మన కేల? కావున ఈదొరచేత అవమాన మొందినవార మయి కడుంగడు దుఃఖము ననుభవించినారము. మఱియు;—

21. ధనముకై కొలువు గొలుచు సేవకులు ఏమి చేసికొన్నారో చూడుము; శరీరము యొక్క స్వాతంత్ర్య మనునది యేది కలదో దానిని నయితము మూఢులై పోఁగొట్టుకొన్నారు. మఱియు;—

22. ఒరులను కొలుచువారు చలివలనను గాలివలనను ఎండవలనను ఎంతటి బాధ

లను అనుభవింతురో అందులో సగముతోనే బుద్ధిమంతుఁడు తపస్సుచేసి సుఖము పడయును. మఱియు;—

23. ఒరులం గొలువకుండుటయే జన్మమెత్తినందులకు ఫలము. ఒకరి వసమునం బడినవారే బ్రదికినవారేని మఱి చచ్చినవారెవరు?

24. పాములతో నాడుదురు, పరస్త్రీలను కూడుదురు, రాజును సయితము సేవింతురు; ఆహా! మనుష్యులు ఎంత సాహసికులు! మఱియు;—

25. రా, పో, పడు, లే, మాట లాడు, పలుకకు,—ఈతీరున ఆశాపిశాచము పట్టిన దరిద్రులతో ధనికులు ఆడుకొందురు. మఱియు;—

26. మూఁఢులు ధనము నిమిత్తము వెలయాండ్రవలె తమ్ము సంస్కరించుకొని సంస్కరించుకొని ఒరులకు ఉపకరణముగా చేసికొందురు. మఱియు;—

27. ఏది స్వభావముచేతనే అస్థిరమో, అశుచియందే పడునట్టిదో, దొరయొక్కయా చూపును సయితము సేవకులు దొడ్డగా నెంచుకొందురు. విశేషముగా,—

28. ఉన్నతి పొందుటకై వంగును, బ్రదుకుటకై ప్రాణములను విడుచును, సుఖము కోరి దుఃఖపడును,—సేవకునికంటె మూఢుఁ డింకెవ్వఁడు? మఱియు;—

29, 30. మాటలాడకున్నయెడల మూఁగ, మాటనేర్పరియైన వెఱ్ఱివాఁడో ప్రేలుడుగాఁడో, ఓర్చినయెడల పిఱికి, ఓర్పులేనిచో ప్రాయికముగా మంచికులమువాఁడు గాఁడు, ప్రక్కను నిలిచినయెడల నిశ్చయముగా తెంపరి, దూరముగా నిలిచినచో తెలివి మాలినవాఁడు,—ఈవిధముగా సేవకధర్మము బొత్తిగా సాధ్యము గాదు, యోగ్యులకుం గూడ దాని రహస్యము తెలియదు.

దమనకుఁ డనియె:— ‘మిత్త్రుఁడా, ఎంతమాత్రమును నీ వట్లు తలంపఁగూడదు.

31. మహాధనికులను నీవు ప్రయత్నపూర్వకముగా కొలుచుట లేదా? వారు త్వరలోనే సంతుష్టులై కోర్కులను నెఱవేర్తురు.

32. కొలువు లేనివారికి చామరములు వేయించుకొనెడి సంపదలును, ఎత్తిన తెల్లగొడుగును, ఏనుఁగులు గుఱ్ఱములునుం గల దండును ఎట్లు కలుగును?’

కరటకుఁడు పలుకుచున్నాఁడు.—‘అయినను ఈవ్యవహారము మన కేల? ఏల యన, జోలిమాలిన వ్యవహారములయందు ఎంతమాత్రమును ప్రవేశింపఁగూడదు. చూడు.—

33. జోలిమాలిన వ్యాపారమందు ప్రవేశించెడినరుఁడు మేకును పీకిన కోఁతివలె దెబ్బ తిని నేలం గూలును.’

‘ఆకథ యెట్లు?’ అని దమనకుఁ డడిగెను. కరటకుఁడు ఇట్లనియె.—



కథ. ౧.

పూర్వము మగధదేశములో ధర్మారణ్యముచెంత నొకచోట శుభదత్తుఁ డని యొక కాయస్థుఁడు బౌద్ధాలయ మండపమును కట్టింప నారంభించెను. అందు వడ్రంగి ఒక స్తంభమును అంపముతో కొంత కోసి ఆచఱవలో గూటముమ కొట్టియుంచెను. అక్కడికి అడవి కోఁతులదండు ఆడుచు వచ్చెను. అందులో నొకకోఁతి యమదండముచే ప్రేరింపఁబడినదియుఁబోలె ఆగూటమును రెండుచేతులతోను పట్టి పీకెను. ఆసమయమున దానివృషణ ద్వయము ఆరెండుతుండ్ల నడిమి కోఁతలో వ్రేలుచుండెను. తర్వాత ఆకోఁతి తనకు స్వాభావిక మయిన చాపల్యముచే బల మంతయు వైచి ఆగూటమును పెకలించివైచినది. వెంటనే రెండుతుండ్లును చేరుకొనఁగా వానినడుమ వృషణద్వయము చిదియఁగా చచ్చినది. కావున నేను ‘జోలిమాలిన వ్యాపారమందు’ ఇత్యాదికముం జెప్పితిని.

అందులకు దమనకుఁడు ‘అయినను సేవకుఁడు తప్పకుండ దొరయొక్క వ్యాపారమును పరికింపవలసినది.’ అనెను. కరటకుఁ డిట్లనియె —‘సర్వాధికారమందు నియమింపఁబడిన ప్రధానమంత్రి యెవఁడో అతఁడు అట్లు చేయునుగాక. ఏల యనఁగా, సేవకమాత్రునికి ఒరులయధికారమును తడవుట సరిగాదు. చూడు.—

34. దొరకు మేలు కోరి ఒరుల యధికారమును మీఁద నుంచికొన్నవాఁడు ఓండ్రించి మోఁదులు వడిన గాడిదవలె నెగులు పొందును.’

అది యెట్లని దమనకుఁడు అడిగెను. కరటకుఁడు చెప్పుచున్నాఁడు.—

కథ. ౨.

కాశిలో కర్పూరపటుఁ డని చాకలి యుండెను. వాఁ డొకప్పుడు లేజవరాలగు కాంతతో కడుం దడవు క్రీడించి బిగ్గఁగవుంగిలించి నిద్రపోయెను. తర్వాత వానివస్తువులను దొంగిలుటకు ఇంటిలో దొంగ ప్రవేశించెను. దాని ముంగిట గాడిద యొకటి కట్టఁబడియుండెను. కుక్కయు కూర్చుండెను. అంత గాడిద కుక్కతో నిట్లనియె.—‘ఇది యిప్పుడు నీపని. మఱి నీ వేల బిగ్గరగా మొఱిగి దొరను లేపవు?’ కుక్క చెప్పినది—‘నాపనిని నీవు విచారింపవలదు. నే నెట్లు రేయింబవలు అతనియింటిని కాచుచున్నానో నీవే యెఱుఁగవా ఏమి? అందుచేత నితఁడు చిరకాలమునుండి హాయిగా నుండి నా యుపయోగమును ఎఱుఁగకున్నాఁడు. అందువలన నా కిపుడు ఆహార మిడుటకు కూడ మన సొప్పక యున్నాఁడు. ఏల యనఁగా ఇక్కట్టును గాననియెడల దొరలు సేవకులమీఁద ఆదరము దాల్పరు.’ అందులకు గాడిద ‘ఓరి మూర్ఖుఁడా, పుట్టుకచేతనే కుక్కజాతి తాఁకఁగూడనిది. అందులోను సేవకజాతివి నీవు. చూడు.—

35. పనిసమయమున యాచించువాఁడు చెడుబంటు, చెడుమిత్త్రుఁడును; ఆపన్ని

చెడినయెడల ఆ బంటేల, ఆమిత్త్రుఁడేల?' అని మందలించినది.

కుక్క యిట్లనియె.—

36. 'ఎవఁడు బంట్లను పనిసమయాన సమ్మానించునో వాఁడు చెడుదొర. బంట్లను భార్యను సర్వదా పోషింప నక్కఱ లేదా? ఏల యన,—

37. సేవకులను బ్రోచుటయందును, దొరలను కొలుచుటయందును, ధర్మమును ఉద్యమించుటయందును, పుత్త్రుని పుట్టించుటయందును, ప్రతినిధులు ఉండరు.'

అంతట గాడిద కోపముతో నిట్లనియె;—'నీవు మహాపాపివి, ఏలన, ఆపదయందు దొరపనిని ఒప్పరికించుచున్నావు. కానీ; దొరను ఇదిగో నేను మేలుకొల్పెద. ఏలన,—

38. వీఁపున ఎండ కాఁచుకొనవలయును, కడుపున నిప్పును కాఁచుకొనవలయును, దొరను (వీఁపున కడుపున అనక) సర్వభావముచేతను సేవింపవలయును, పరలోకమును సత్యవర్తనచేత సాధింపవలయును.'

ఇట్లు పలికి గాడిద మిక్కిలి బిగ్గరగా ఓండ్రపెట్టెను. చాకలి ఆయోండ్రకు మేల్కొని నిద్ర చెడఁగొట్టిన కోపాన దుడ్డుఁగఱ్ఱతో గాడిదను మోఁదెను. దాన నది కాలధర్మము నొందెను.

---

కావున నేను 'దొరకు మేలు కోరి ఒకరియధికారమును' ఇత్యాదికము చెప్పితిని. మఱియుం జూడుము. పసరములను వెదకుట మనపని. మనపనిని చర్చించుకొందము. (ఆలోచించి) ఆచర్చవలన నిప్పుడు ప్రయోజనము లేదు; ఏల యన, మనకు తినఁగా మిగిలిన తిండి విశేషముగా కలదు.

అందులకు దమనకుఁడు కోపించి యిట్లనియె:—"ఏమి యిది! నీవు ఒక్క తిండి కోసమే రాజును కొలుచుచున్నావా? నీవు చెప్పినమాట సరి కాదు. ఏల యన;—

39. మిత్త్రులకు ఉపకారము సేయుటకును, శత్రువులకు అపకారము సేయుటకును, బుద్ధిమంతులు రాజాశ్రయమును కోరుదురు; పొట్ట పోసికొనుట మాత్రమేని ఎవని చేతఁగాదు?

40. ఎవఁడు జీవించిన మిత్త్రులును బ్రాహ్మణులును బంధువులును జీవింతురో వాని జీవనము సఫలము; తన యొక్కనికై ఎవఁడు జీవింపఁడు? మఱియు;—

41. ఎవఁడు జీవించిన, అనేకులు జీవింతురో వాఁడు జీవించుగాక; కాకి కూడ ముక్కుతో తనపొట్టను నిండించుకోదా? చూడు,—

42. అయిదు*పురాణములకై ఒకఁడు దాస్యము సేయును, లక్ష పురాణములకు ఒకఁడు తనియును, ఒకఁడు లక్ష యిచ్చినను సేవకు రాఁడు. మఱియు;—

* పురాణ మనఁగా 80 గవ్వలకు సమాన మగు నాణెము.



43. మనుష్యజాతి సమానమై యుండఁగా ఒకఁడింకొకనికి దాస్యము సేయుట మిక్కిలి నింద్యము. ఆదాస్యమందును పైవాఁడు కాఁడేని వాఁడును బ్రదికి యున్నవారిలో లెక్కయా? ఇట్లును చెప్పియున్నారు;—

44. ఏనుఁగులలోను, గుఱ్ఱములలోను, లోహములలోను, కొయ్యలలోను, ఱాలలోను, వస్త్రములలోను, స్త్రీలలోను, పురుషులలోను, నీళ్లలోను, ఒకటికొకటికి వార మిక్కిలి గొప్పది. అట్లే;—

45. కుక్కకు గొడ్డునెముక కొంచెపాటి సన్నవరములు గలిగి క్రొవ్వుతడిచే కంపు కొట్టుచు మాంసహీనమై యున్నట్టిది దొరకినచో, దాని కది సంతసింపును గాని దానిచే దాని యాఁకలి తీఱదు; సింహము చెంత నున్న నక్కను మాని యేనుఁగునే చంపును. ఎల్ల వారును తమ కష్టదశలోనైనను తమశక్తికిఁ దగినఫలమునే కోరుదురు.

ఇంకను స్వామిభృత్యులకుఁ గల వారను ఇదె చూడుము.—

46. కుక్క తనకుఁ బిండ మిడువానియెదుట తోఁక యాడించును, కాళ్లతో నేలను తాటించును, క్రింద వెదకిలంబడి నోటిని కడుపును చూపును; గజరాజ మయిననో బెట్టుగా చూచును, మావటీఁడు బుజ్జవములు పలుకఁగా పలుకఁగా దాణాను ఆరగించును.

47. శాస్త్రజ్ఞానమునకు పరాక్రమమునకు కీర్తికిని లోపము లేకుండ మనుష్యులు ఒక నిముసమయినను బ్రదుకుట యేది కలదో అదే బ్రదుకుట యని పెద్దలు చెప్పుదురు. కాకియు బలిని తినుచు చిరకాలము బ్రదుకును. మఱియు;—

48. మేలుకీళ్లను విచారించు బుద్ధి లేక వైదికమర్యాదలకు వెక్కింటికి తప్పి నిందితుఁడై పొట్టపోసికొనుటకు మాత్రమే కోరుచుండెడు నరపశువునకును పసరమునకును భేద మేమి?'

కరటకుఁడు 'మన మేమో ప్రధానులము గాము. మఱి మన కేల యీ విచారము?' అనెను. మఱల దమనకుఁడు పల్కుచున్నాఁడు:— 'ప్రధానతను గాని అప్రధానతను గాని మంత్రి ఎంతలో పొందెడును? ఏల యన;—

49. ఎవఁడు గాని ఎవనిని గాని సహజముగానే గొప్పవాఁడని గాని దుర్జనుఁడని గాని తలంపఁడు. లోకములో గౌరవమును గాని తిరస్కారమును గాని వానివానిచేష్టలే తెచ్చును. మఱియు;—

50. గుండును కొండమీఁదికి నెక్కించుటకు ఎట్లు గొప్పప్రయత్నము వలయునో, క్రిందఁబడఁ ద్రోయుట ఎట్లు క్షణములో నగునో, అట్లే పురుషుఁడు తాను గుణదోషములు పొందుట.

51. నూయి త్రవ్వువాఁడును, ప్రాకారము కట్టువాఁడును, ఎట్లో అట్లే, నరుఁడు తన పనులచేత నే క్రింది క్రిందికి పడును, మీఁది మీఁదికి ఎక్కును.

కావున మంచివాఁడా, తన గౌరవము తన ప్రయత్నములో నున్నది?'

'అటు లయిన నీవు ఏమి చేయు మనియెదవు?' అని కరటకుఁడు అడిగెను. 'మన దొర పింగళకుఁడు ఏకారణమువలననో భయపడి మరలి వచ్చి కూర్చున్నాఁడు గదా?' అని దమనకుఁ డనెను. 'ఆకారణమును నీ వెఱుఁగుదువా?' అని కరటకుఁ డడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.—'ప్రజ్ఞావంతులకు తెలియని దే మున్నది? చెప్పిరిగదా.—

52. చెప్పిన యభిప్రాయమును పశువులు కూడ గ్రహించును; గుఱ్ఱములును ఏనుఁగులును ఆజ్ఞాపింపఁబడినవై మోయుచున్నవి; చెప్పని యభిప్రాయమును కూడ తెలివిగలవాఁడు ఊహించును; బుద్ధి యున్నందులకు ఒరుల యింగితము నెఱుంగుటయే గదా ప్రయోజనము.

53. ఆకారములచేతను, అభిప్రాయములచేతను, నడకచేతను, వ్యాపారములచేతను, మాటచేతను, కంటి యొక్కయు ముఖముయొక్కయు వికారముచేతను, లోని మనస్సు తెలియఁబడును.

కావున ఈభయసందర్భములో నాప్రజ్ఞాబలముచేత నే నీతనిని నావానినిగా చేసికొనెదను. ఏల యన,—

54. సందర్భమునకు తగిన మాటను, విశ్వాసమునకు తగిన ప్రియమును, తనశక్తికి తగిన కోపమును, ఎవఁడు ఎఱుఁగునో వాఁడు పండితుఁడు.'

కరటకుఁడు పలుకుచున్నాఁడు.—'మిత్త్రుఁడా, నీవు కొలువు ఎఱుఁగవు. చూడుము;—

55. పిలుపులేకయే చొచ్చువాఁడును, ప్రశ్న లేకయే మిక్కిలి పలుకువాఁడును, దొర తన్ను మెచ్చినాఁ డని తలఁచువాఁడును, ఎవఁడో వాఁడు దుర్బుద్ధి.'

దమనకుఁడు చెప్పుచున్నాఁడు.—'కల్యాణుఁడా, నాకు కొలువు తెలియదా? చూడు;—

56. స్వభావము చేతనే మంచి దనియు చెడ్డ దనియు ఒకటి కలదా? ఎవని కేది ఇష్టమో అది వానికి మంచిది. ఏ లన;

57. ఎవనికి ఏభావము ఉన్నదో వానిని ఆభావము మూలముగా ప్రవేశించి బుద్ధిమంతుఁడు తన వసము చేసికొనవల్లయును. మఱియు;—

58. 'ఎవ రక్కడ?' అనఁగానే 'నేను' అనవలయును, 'ఏలినవారి యాజ్ఞ యేమి?' అనియు చక్కఁగా చెప్పవలయును; శక్తివంచన సేయక ఏలిని యాజ్ఞను నెఱవేర్పవలయును. మఱియు;—

59. భూపతులకు ఆజ్ఞను మీఱుటయు, బ్రాహ్మణులకు సొగసాకారమును, స్త్రీలకు వేఱుపడుకయు, కత్తిలేకుండ చంపుట. మఱియు ;—



60. కొంచెమునకు సంతోషించుచు ప్రజ్ఞ కలవాఁడై నీడవలె సర్వదా వెంట నుండుచు ఆజ్ఞాపించిన పనిని మాఱాడక చేయునట్టివాఁడు ఎవఁడో వాఁడు ఏలినయింట నుండఁ దగినవాఁడు.'

కరటకుఁడు 'ఒకవేళ అనవసరముగా చొచ్చితి వని నిన్ను దొర అవమానించు నేమో?' అనెను. అందునకు దమనకుఁడు చెప్పుచున్నాఁడు:—'అట్లే అనుకొమ్ము. అయినను సేవకుఁడు తప్పక సన్నిధిలో నుండవలసినది.

61. చెడుగు కలుగునో యనుభయముచేత పనినే ఆరంభింపమి కాపురుష లక్షణము; అన్నము జీర్ణము కాదేమో అనుభయముచేత ఎవరు తిండి మానుకొందురు ? చూడు;—

62. చెంత నున్న వానినే రాజు అవలంబించును, వాఁడు విద్యావిహీనుఁడు గానీ, కులము తక్కువవాఁడు గానీ, సంబంధము లేనివాఁడు గానీ; తఱుచుగా రాజులును గుబ్బెతలును తీఁగలును ప్రక్కను ఎవఁడు (ఏది) ఉండునో వానిని (దానిని) చుట్టుకొందురు. (చుట్టుకొనును).'

'అక్కడి కేఁగి ఏమి చెప్పుదువు?' అని కరటకుఁ డడిగెను. 'స్వామి నాయందు ప్రీతికలవాఁడో కాఁడో తెలిసికొనెదను.' అని దమనకుఁ డనెను. 'దానిం దెలిసికొనుటకు చిన్నె లేమి?' అని కరటకుఁ డడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.—'వినుము.—

63. దూరమునుండి పరికించుట, నవ్వుట, అడుగుటయందు మిక్కిలి ఆదరణ, ఎదుట లేనప్పుడును గుణములను పొగడుట, ప్రియ మయిన వస్తువులు లభించినప్పుడు జ్ఞప్తికి తెచ్చికొనుట.

64, 65. వానిసేవకుని మీఁదఁగూడ ప్రీతి, మంచిమాటలతో ఇచ్చుట, దోషములను గూడ గుణములనుగా గ్రహించుట,—ఇవి అనురాగము కల దొరయొక్క చిన్నెలు. అనురాగము లేని దొరయొక్క చిన్నెలు ఏవనఁగా—జరుపుడు సేయుట, ఆసలు పెంచుట, ఫలవిషయములో భంగపెట్టుట.— వీనిని బుద్ధిమంతుఁ డైన మనుష్యుఁడు కనిపట్టవలయును.

దీని నెఱిఁగి ఇతఁ డెట్లు నాకు వసపడునో అట్లు పలికెదను. ఎట్లనఁగా;—

66. ప్రజ్ఞావంతులు అపాయము కనఁబడుటచేత రానున్నట్టి యాపదను, ఉపాయము కనఁబడుటచేత కలుగనున్నట్టి కార్యసిద్ధిని, నీతిప్రయోగముయొక్క ప్రభావముచేత ఎదుట ప్రకాశించుచున్న దానినిగా చూపింతురు.'

కరటకుఁడు చెప్పుచున్నాఁడు.—అట్లయినను అనవసరముగా మాట లాడుట సరిగాదు. ఏల యన;—

67. బృహస్పతి సయితము సమయము కాని మాటను వచించినచో తెలివిమాలిన

వాఁడనిపించుకొనుటయే గాక, శాశ్వత మయిన తిరస్కారమును కూడ బొందును.

68. ఓరాజా, సర్వదా ప్రియమే పలుకునట్టి పురుషులు కలరు, అప్రియమైన హితమును చెప్పువాఁడును వినువాఁడును అరుదు.'

దమనకుఁడు పలికెను.—'మిత్త్రుఁడా, భయపడకు, నేను సమయము రానిమాటను పలుకువాఁడను గాను. ఏల యనఁగా,—

69. హితము కోరిన సేవకుఁడు ఆపదయందును, తప్పుదారిని పోవునప్పుడును, పని చేయవలసిన కాలము మించిపోనున్నప్పుడును, దొర యడుగక పోయినను చెప్పవలయును.

మఱి అవసరము కలిగినను నేను ఆలోచన సెప్పఁగూడదేని, ఆపత్తమున నాకు మంత్రిత్వమే తగదు. ఏల యనఁగా,—

70. ఏగుణముచేత జీవనము సంపాదించుకొనునో, ఏగుణముచేత లోకములో పెద్దలవలన పొగడ్తనొందునో, ఆగుణమును ఆగుణముకలవాఁడు కాపాడుకొని వృద్ధి చేసికొనవలయును.

కావున మంచివాఁడా, నాకు సెల విమ్ము, పోయెదను.'

'నీకు మేలు కలుగునుగాక; నీ దారులు మంగళము లగుఁ గాక. నీవు కోరిన యట్లు చేయుము.' అని కరటకుఁ డనియె.

అంతట దమనకుఁడు పింగళకుని సన్నిధిం గూర్చి వెఱఁగుపడినవాఁడుంబోలె పోయెను. దూరమునుండియే రాజు చూచి ఆదరముతో రప్పించుకొనఁగా సాష్టాంగ ప్రణామము కావించి కూర్చుండెను. 'ఏమి చిరకాలమునకు కనఁబడితివి?' అని రాజు అడిగెను.

దమనకుఁడు చెప్పందొడంగెను.— శ్రీమంతు లయిన యేలినవారికి నా సేవవలన ఇంచుకేనియు ఉపయోగము లేకపోయినను, సమయము వచ్చినప్పుడు సేవకుఁడు తప్పకుండ దగ్గఱ నుండవలసినది గదా యని వచ్చినాఁడను. ఏల యనఁగా;—

71. ఎవరు ప్రభువునకు యుద్ధములలో వాఁడికైదువుల వ్రేటులకు పగిలిన యేనుఁగులకుంభస్థలములచే పరిమళించుచున్న భూమిని సదా అర్పించినారో, వారికి కూడ ఆతని ప్రోలకు వచ్చునప్పుడు వెల్లుభయముచేత ఖండితములై మాటలు తడఁబడును. మఱియు;-

72 రాజుప్రోలను, పండితులనడుమను, స్త్రీలకోడి పొందునను, మాట నేర్పరి కూడ జంకుచేత మనస్సు కలంగి తబ్బిబ్బుపడును.

నావలనను ఒకానొక హేతువుచేత ప్రయోజనము కలదు. చెప్పుదురుగదా;—

73. ఓదొరా, పలుదోముకొనుటకుఁగాని చెవిగోఁకుకొనుటకుఁగాని ప్రభువులకు గడ్డిపోఁచయు ఉపయోగపడును, వాక్కును చేతులును కల మనుష్యునిమాట చెప్పవలయు నఁటయ్యా?



ఏలినవారు చిరకాలము అధికారమునుండి తొలఁగించి యున్నట్టి నాకు తెలివి పోయిన దని తలంతురేమో, అట్లును తలంపవలదు. ఏల యన;—

74. ఎవనికి ఏ గుణములు కలవో, అవి స్వయముగానే వికసిల్లును, కస్తూరి యొక్క తావి ఒట్టుపెట్టినను పోదు గదా, మఱియు;—

75. రత్నము అడుగులలో దొరలుచుండుఁగాక, గాజుపెంకు శిరంబున ధరింపఁబడుఁగాక; కొనుటయు అమ్మటయు వచ్చినప్పుడు, గాజుపెంకు గాజుపెంకే, రత్నము రత్నమే.

76. ధైర్యస్వభావుఁడు తిరస్కరింపఁబడినను తెలివిని కోలుపోవు నను భయము లేదు. నిప్పును క్రిందికి పట్టినను జ్వాల యెప్పుడును క్రిందికి పోదు.

మహాప్రభూ, ప్రభువు తారతమ్యము నరయువాఁడు గావలయును.

77. రాజు ఎప్పుడు తారతమ్యము తెలియఁగక సేవకులనెల్ల సమముగాఁ జూచునో, అప్పుడు ప్రయత్నములు సేయ సమర్థు లయిన భృత్యులు నిరుత్సాహు లగుదురు.

78. ఉత్తములు మధ్యములు అధములు నని పురుషులు మూఁడువిధములు. మువ్వురను అట్లే మూఁడువిధము లయిన పనులకు నియోగింపవలయును. ఏల యన:—

79. సేవకులను తొడవులను వానివానిచోటనే ఉంపవలయును; సిగమానికము కాలియందును అందె సిగయందును ప్రకాశింపవు గదా. మఱియు;—

80. బంగారపుఁ దొడవునందు తాపింప వలసిన రత్నమును సీసములో పొదివిన యెడల అది ఏడువదు, ప్రకాశింపకయుఁ బోదు. కాని అట్లు కూర్చినవానిని నిందింతురు.

మఱియు;-81. గాజుపెంకును కిరీటములో పొదిగినాఁడు, మణిని కాలితొడవులో చెక్కినాఁడు; మణికి ఏదోషము లేదు గాని వర్తకునికి మాత్రము తెలివిలేమి.

చూడుము;-82. వీఁడు బుద్ధిమంతుఁడు, వీఁడు స్వామి భక్తిగలవాఁడు, వీఁడు శూరుఁడు, వీనివలన భయము కలదు, ఇట్లని, భృత్యుల తారతమ్యము నెఱింగిన దొర చుట్టును భృత్యులు నిండుదురు. అట్లే గదా;—

83. గుఱ్ఱము, కైదువు, శాస్త్రము, వీణ, వాక్కు, పురుషుఁడు, స్త్రీయు, తాము చేరిన పురుషునింబట్టి యోగ్యతను అయోగ్యతను పొందుదురు, మఱియు;—

84. సామర్థ్యము లేని భక్తునిచేత నేమి ప్రయోజనము? అపకారము చేయునట్టి సమర్థునిచేతను ఏమి ప్రయోజనము? ఓ ప్రభూ, భక్తుఁడను సమర్థుఁడను అగు నన్ను తిరస్కరించుట నీకు తగవు గాదు. ఏల యనఁగా,—

85. రాజు అవమానించెనేని సేవకునికి తెలివి చెడును. ఆ కారణంబునం జేసి పెద్దలు ఆరాజుచెంతం జేరరు; పెద్దలు వదలినచో దొరతనములో నీతిప్రయోగము చక్కఁగా నుండదు; నీతి చెడుడు, లోక మెల్ల వసము దప్పి కూలిపోవును.

86. రాజు గౌరవించిన మనుష్యుని లోకులు సదా గౌరవింతురు; రాజు ఎవనిని తిరస్కరించునో వానిని ఎల్లవారును తిరస్కరింతురు. మఱియు;—

87. యుక్తియుక్తమయిన మాటను బాలుఁడు పలికినను విద్వాంసులు గ్రహింపవలయును; సూర్యుఁడు లేనప్పుడు దీపము ప్రకాశింపదా?

పింగళకుఁ డనియె.—'మంచివాఁడా, దమనకుఁడా, ఇది యేమి? నీవు మాకు ప్రధానమంత్రికుమారుఁడవు. ఇంతకాలము కొండీండ్ర మాటలు విని రాకుంటివి. ఇప్పుడు నీ యిష్ట మేమో చెప్పుము.' అందులకు దమనకుఁడు 'ప్రభూ, ఒకమాట యడిగెదను, చెప్పుము. నీరు ద్రాఁగఁబోయి ఏలినవారు త్రాగకయే నివ్వెఱగొన్నట్లు మరలి వచ్చియున్నందులకు కారణ మేమి?' అని యడిగెను. 'చక్కఁగానే పలికితివి. మఱి యే మన, ఇది రహస్యము, చెప్పుటకు తగిన నమ్మకపుఁజోటు దొరకకున్నది. అయినను ఏకాంతముగా చెప్పెదను వినుము; ఇప్పుడు ఈ యడవిలో నొక యపూర్వజంతువు నెక్కొని యున్నది. కావున మనము దీనిని విడిచి పోవలయును. ఈ కారణముచేత వెఱఁగుపడి యున్నాను. అట్లే నేను గొప్ప యపూర్వ శబ్దమును వింటిని. ఆ యులివుంబట్టి యాలోచించిన, ఆప్రాణి మహాబలిష్ఠ మయినదిగా నుండనోపును.' అని పింగళకుఁడు పలికెను. దమనకుఁ డిట్లనియె;—'దేవా, అవును మహాభయంకర మయిన యా శబ్దమును మేమును వింటిమి. అయినను ఎవఁడు ముందుగా దేశత్యాగమును తర్వాత యుద్ధమును ఉపదేశించునో వాఁడు పాడుమంత్రి. మఱియు;—సేవకులవలని ప్రయోజనము ఈ కార్యసందేహములోనే తెలిసికొనవలయును. ఏల యనఁగా,—

88. బంధువులయు స్త్రీలయు సేవకబృందములయు తన బుద్ధిబలములయు చేవను ఇక్కట్టు అనెడి యొరగంటిలో నరుఁడు తెలిసికొనును.

సింహము 'ఓయి మంచివాఁడా; నన్నొక గొప్పసందేహము బాధించుచున్నది.' అని పలికెను. అందులకు దమనకుఁడు 'కాదేని రాజ్యసుఖమును వదలి దేశాంతరము పోవుటకు ఏల నాతో ప్రస్తావింతువు?' అని మనస్సులో అనుకొని ప్రకాశముగా, 'దేవా, నేను బ్రదికియున్నంతవఱకు భయపడ నక్కఱలేదు. అయినను, కరటకాదులను కూడ కూడఁదీసికొనవలయును. ఏల యనఁగా ఆపదకు ప్రతిక్రియ సేయుటకు పురుషసముదాయము దుర్లభము.' అని చెప్పెను. అంతట రాజు కరటకదమనకులకు గొప్ప పసదనం బొసంగి సత్కరించెను. వారును అభయమునకు ప్రీతికార మొనర్చెద మని ప్రతిన వట్టి చనిరి.

కరటకుఁడు నడచుచు దమనకు నడిగెను.—'మిత్త్రుఁడా, ఏమి? ఈభయహేతువునకు ప్రతిక్రియ చేయఁగలమో చేయలేమో తెలియకయే భయము నడంచెద నని ప్రతిన వట్టి యీ మహాప్రసాదమును గ్రహించితివి? ఏల యన, ఎవరికేని ఉపకారము



చేయనివాఁడు వానివలన బహుమానము గైకొనఁ గూడదు, ముఖ్యముగా రాజువలన గైకొనఁ గూడదు. చూడు,—

89. ఎవని యనుగ్రహములో లక్ష్మి యున్నదో, పరాక్రమమందు విజయము (విజయుఁడు) కలదో (కలఁడో), కోపమందు మృత్యువున్నదో, అసర్వతేజస్స్వరూపుఁడు రాజు. అట్లే సుమా,—

90. మనుష్యుఁడే గదా యని రాజును బాలుఁ డయినను అవమానింపఁ దగదు. అది నరరూపమున వెలసియున్నట్టి యొక గొప్ప దేవత!'

అందులకు దమనకుఁడు నవ్వి 'చెలికాఁడా, ఊరకుండు. భయకారణము ఎద్దు అంకె యని నేను తెలిసికొంటిని. ఎద్దు మనకే ఆహారమే, ఇఁక సింహమునకు చెప్పవలయునా?' అనెను. 'అట్లైన యేలిక భయమును అక్కడనే ఏల తీర్పవైతివి?' అని కరటకుఁ డడిగెను. దమనకుఁ డిట్లనియె:— దొరయొక్క భయమును అక్కడనే తొలఁగించినయెడల, యీ గొప్పబహుమాన మెట్లు దొరకును? మఱియు;—

91. సేవకుఁడు ఎప్పుడును దొరకు తనతో పని లేకుండునట్లు చేయఁ గూడదు. ప్రభువునకు అక్కఱ తీర్చి సేవకుఁడు దధికర్ణుని గతిని పొందును.'

అది యెట్లని కరటకుఁ డడుగఁగా దమనకుఁడు చెప్పం దొడంగెను.—

## కథ. 3.

ఉత్తరాదియందు అర్బుద శిఖరమను పర్వతములో మహావిక్రముఁ డను పేరి సింహముండెను. అది కొండగుహలో నిద్రించుచుండునప్పుడు ఎలుక యొక్కటి జూలు కొసను కొఱుకుచుండినది. మొండె మయిన జూలుకొసను చూచుకొని కోపగించి, సింహము, లాఁగలోఁ దూఱిన యెలుకను పట్ట లేక, యిట్లు చింతించెను.—

92. 'ఎవఁడు క్షుద్రశత్రుఁడో పరాక్రమమునకు సాధ్యపడఁడో, వానిని చంపుటకు వానివంటి బంటునే నియమింప వలయును.'

ఇట్లాలోచించి పట్టణమునకుం బోయి దధికర్ణుఁడను పేరి పిల్లిని తెచ్చి మాంసపుఁ దునకలు గానుకలు పెట్టి సంతోషపెట్టి లాఁగకడ నెలకొలిపినది. అది మొదలు ఆ పిల్లికి భయపడి ఎలుకయు బయటికి రాకుండినది. దానంజేసి సింహము జూలు తెగక హాయిగా నిద్రించుచుండినది. ఇట్లుండఁగా ఒకనాఁడు ఆయెలుక ఆఁకటికి నిలువలేక బయటికి రాఁగా, దానిం బట్టి పిల్లి చంపినది. తర్వాత సింహము చిరకాలము ఎలుక కనఁబడనందునను, దానియెలుఁగు కూడ వినఁబడనందునను, మఱి పిల్లివలన ఉపయోగము లేకుండుటంబట్టి దానికి మేఁత యిడుటకు అసడ్డ చేసినది. కావున, 'సేవకుఁడు ఎప్పుడును' ఇత్యాదికమును చెప్పితిని.

తర్వాత దమనక కరటకములు సంజీవకుని కడకు పోయినవి. అట కరటకుఁడు చెట్టుక్రింద ఠీవిగా కూర్చుండెను. దమనకుఁడు సంజీవకునికి దగ్గఱఁగా పోయి యిట్లనియె.— "ఓరి ఎద్దుగా, వీఁడుగో నిన్ను పింగళకమహారాజుచేత అడివికి కాపుదలకై సేనాపతిగా ఏర్పరింపఁబడినవాఁడు కరటకుఁడు ఆజ్ఞాపించుచున్నాఁడు.—'తత్క్షణమురా, రావేని ఈయడవినుండి దూరముగా పో. అట్లు చేయవేని నీకు కీడు మూఁడును. కోపించిన మాయేలిక ఏమి చేయునో ఎఱుఁగను.' అని."

అంతట ఆదేశపు వ్యవహారము నెఱుఁగని వాఁడు గావున సంజీవకుఁడు భయపడి వచ్చి కరటకునికి సాష్టాంగ ప్రణామము గావించెను. అట్లే గదా చెప్పిరి.—

93. ఏనుఁగుమీఁద మావటీఁడు వాయించుచున్న రాయిడిగిడిగిడి మ్రోయుచు 'బలముకంటె బుద్ధియే శ్రేష్ఠము, అది లేనందున ఏనుఁగుల కీదశ సంభవించినది.' అని ఘోషించుచున్న ట్లొప్పుచుండెను.

మఱి సంజీవకుఁడు భయముతో 'సేనాపతీ, నే నేమి సేయవలయునో చెప్పుము.' అని యడిగెను. 'ఓరి యెద్దా, ఈయడవిలో నుండుటకు నీకిచ్చ కలదేని, మాయేలినవారి పాదకమలములకు మ్రొక్కుము.' అని కరటకుఁడు చెప్పెను. 'నాకు అభయవాక్కొసంగుము, ఇదె వచ్చుచున్నాను.' అని సంజీవకుఁడు పలికెను. కరటకుఁ డిట్లనియె:— 'వినరా ఓరి యెద్దా, ఈ భయము వలదు.

94. చేదిరాజు తిట్టుచున్నను అతనికి శ్రీకృష్ణులవారు ఉత్తరము చెప్పరైరి; సింహము మేఘగర్జనమునకు ఎదురు బొబ్బరించును గాని నక్కకూఁతలకు బదులు బొబ్బరింపదు. మఱియు;—

95. వాయువు ఉన్నతముగా నిగిడియున్న చెట్లను విఱుచును గాని మెత్తనివై అంతటను క్రిందికి వంగియుండు గడ్డిని వేరుతో పెల్లగింపదు; గొప్పవాఁడు గొప్పవాని మీఁదనే పరాక్రమించును.'

అనంతరము ఆ రెండు నక్కలును సంజీవకుని ఎక్కువదూరము గాకుండ నొకచోట ఉంచి పింగళకునికడకుం బోయి నమస్కరించి కూర్చుండినవి. 'ఆజంతువును నీవు చూచితివా?' అని రా జడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు—'దేవరా, చూచితిని, వినయవంతముగా చేయునుం జేసితిని. కాని తమరు తలంచినట్లే అది మహాబలము గల జంతువు. అయినను అది యిప్పుడు ఏలినవారిపాదములను దర్శింపఁ గోరుచున్నది. కావున సన్నద్ధులరై కూర్చుండుఁడు. ఏల యన,—

96. అనకట్టు నీటిచే పగలును, దాఁపఱికము సేయని యెడల మంత్రము చెడును, స్నేహము కొండెముచే చెడును, పిఱికివాఁడు మాటలచే లోఁబడును.

కావున శబ్దమాత్రమునకు భయ పడఁ గూడదు. ఏల యనఁగా,—



97. శబ్దకారణమును ఎఱుఁగక శబ్దమాత్రమునకు భయపడఁగూడదు; శబ్దకారణమును ఎఱిఁగినదై కుంటెనకత్తె గౌరవము పొందినది.'

కథ. ౮.

'అది యెట్లు?' అని రా జడిగెను. దమనకుఁడు చెప్పందొడంగెను.—శ్రీపర్వతము నడుమ బ్రహ్మపుర మని పట్టణ మొకటి కలదు. అచ్చట కొండకొమ్మన ఘంటాకర్ణుఁ డను రాక్షసుఁడు వసించి యున్నట్లు లోకవాదము ఉండినది. ఒకప్పుడు ఘంటను గొని పరారి యయిన దొంగను ఒకనిని పులి చంపి తిన్నది. వానిచేతినుండి పడిన ఘంట కోఁతులకు దొరికినది. కోఁతులు దానిని అనుక్షణము వాయించుచుండినవి. ఊరిజనులు పులి తిన్న యామనుష్యుని దేహమును చూచిరి, ప్రతిదినమును ఘంటానాదము వినఁబడుచున్నది. తర్వాత, 'ఘంటాకర్ణుఁడు కోపగించి మనుష్యులను తినుచున్నాఁడు, ఘంటను వాయించుచును ఉన్నాఁడు.' అనిపలికి జను లందఱు ఊరు వదలి పాఱిపోయిరి. అంతట, కోఁతులు గంట వాయించుచున్న దని ఎఱిఁగి కుంటెనకత్తె రాజుతో 'ప్రభూ, ధనము వ్యయింతువేని ఈ ఘంటాకర్ణుని నేను సాధించెదను.' అని విన్నవించెను. అంతట రాజు దానికి విస్తారముగా ధన మిచ్చెను. అంతట అది ఆయడవిం జొచ్చి చెట్టుక్రింద పండ్లను బియ్యమును నేలమీఁద పెట్టినది. వెంటనే కోఁతులు గంటను వదలి పండ్లమీఁద వచ్చి పడినవి. గంటను కైకొని కుంటెనకత్తె ఊరికి వచ్చినది, ఎల్లవారికి పూజ్యురా లయినది. కావున, శబ్దమాత్రమునకు భయపడఁ గూడ దని నేను వచించితిని.

అనంతరము నక్కలు సంజీవకుని తెచ్చి దర్శనము సేయించినవి. అది మొదలు ఆ యడవిలోనే సంజీవకుఁడు మిక్కిలి సంతుష్టుఁడై చిరకాలము వసించెను.

ఇట్లుండ ఒకనాఁడు ఆసింహముయొక్క యన్న స్తబ్ధకర్ణుఁడు అను సింహము వచ్చెను. దానికి అతిథిసత్కారము గావించి కూర్చుండఁ బెట్టి, పింగళకుఁడు దాని భోజనమునకై పసరమును చంపుటకు తరలెను. సంజీవకుఁడు 'దేవరా, నేఁడు చంపిన మృగములమాంస మే మైనది?' అని యడిగెను. 'దమనక కరటకు లెఱుఁగుదురు.' అని రాజు ఉత్తరము చెప్పెను. 'కలదో లేదో విచారింపవలయును.' అని సంజీవకుఁ డనియె. సింహము నవ్వి 'అది లేనే లేదు.' అని పలికెను. 'ఏమి! ఇంత మాంసమును ఆ యిరువురును తిన్నారా?' అని సంజీవకుఁ డడిగెను. 'తిన్నారు, వ్యయముచేసినారు, పాఱవైచినారు ప్రతిదినమును ఇదే వరుస.' అని రాజు పలికెను. 'ఏమి! శ్రీమంతు లయిన యేలినవారి యెఱుకనే ఇట్లు చేయుచున్నారా?' అని సంజీవకుఁ డడిగెను. 'నాకు తెలియకుండనే యిట్లు చేయుచున్నారు.' అని రాజు చెప్పెను. సంజీవకుఁడు ఇట్లు చెప్పుచున్నాఁడు.—ఇది సరి గాదు. పెద్దలు ఇట్లు చెప్పియున్నారు:—

98. ఓలోకనాయకా, ఆపదలయొక్క ప్రతిక్రియను దప్ప దొరకు చెప్పక

ఏ కొంచెపుఁ గార్యము నయినను చేయఁగూడదు. మఱియు;—

99. మంత్రి కమండలువువంటివాఁడు, కొంచెము ఇచ్చుచు విశేషముగా గ్రహించువాఁడు. ఓరాజా, నిముసమును సరకు సేయనివాఁడు మూర్ఖుఁడు, గవ్వను సరకు సేయని వాఁడు దరిద్రుఁడు.

100. ఎవ్వఁడు గవ్వను వృద్ధి సేయునో ఆ మంత్రి సర్వదా శ్రేష్ఠుఁడు. ఖజానా గల రాజునకు ఖజానాయే ప్రాణము, ప్రాణము ప్రాణము గాదు.

101. మఱియు, కులము ఆచారము అను నితరగుణములు గలవానినైనను పురుషుని కొలువరు; ధనహీనుని భార్య కూడ వదలును, ఇతరులమాట చెప్పవలయునా?

రాజునందు ముఖ్య మయిన దోషము ఏ దనఁగా;—

102. మితి మీఱి వ్యయముచేయుట, పైవిచారణ సేసికొనకుండుట, అన్యాయ్యముగా ధన మార్జించుట, దూరమందున్న వారివలన రావలసిన పైకములను వదలి వేయుట—దీనికి కోశవ్యసన మని పేరు. ఏల యనఁగా;—

103. త్వరలో రాబడి నాలోచింపక తన యిచ్చ వచ్చినట్లు వ్యయము చేయు వాఁడు కుబేరు సంతతి ధనికుఁ డయినను తప్పకుండ క్షీణించును.

ఆమాట విని స్తబ్ధకర్ణుఁ డిట్లనియె.—'వినుము తమ్ముఁడా చిరకాలసేవకులు ఈ దమనకకరటకులు ఒడంబడికలు పోరాటములు అను పనులయందు అధికారము గలవారు, వీరిని ఎప్పుడును ధనాధికారమందు నియమింపఁగూడదు. మఱియు పనిగొను విషయములో నేను విన్న దానిని చెప్పెదను.

104. బ్రాహ్మణుని, క్షత్రియుని, బంధువును కోశాధికారమం దుంచుట మంచిది గాదు; బ్రాహ్మణుఁడు ధనము సిద్ధముగా నున్నను కష్టముమీఁదఁ గూడ ఒసఁగఁడు.

105. ధనముపై నియోగింపఁబడిన క్షత్రియుఁడు నిశ్చయముగా కత్తి చూపును. బంధు వయినవాఁడు ఆబంధుత్వమును పురస్కరించుకొని సకలధనమును పట్టి దిగమ్రింగును.

106. చిరకాలసేవకుఁడు నేరము చేసియు భయము లేకుండును; వాఁడు ప్రభువును లక్ష్యపెట్టక అడ్డు లేక చరించుచుండును.

107. ఉపకారిని అధికారమం దుంచినయెడల వాఁడు తనతప్పిదమును తలంపఁడు, తాఁ జేసిన యుపకారమునే నిమిత్తగాఁ జేసికొని సర్వమును అపహరించును.

108. ఏకాంతముగా తనతో ఆడుకొను మంత్రి తానే రాజుగా వర్తించును, కావున, పరిచయమువలన వాఁడు తప్పకుండ సదా రాజును అవమానించుచుండును.

109. లోపల పగ గలిగి పైకి మన్నించినవాఁడు ఎల్లకీడులనుం జేయువాఁడు గదా. ఓరాజా, ఇందులకు శకునియు, (నందమంత్రి) శకటారుఁడును తార్కాణములు.



110. సమృద్ధుఁ డయిన మంత్రి ఎప్పుడును వశపడఁడు, అతఁడే సర్వము అగును. ఏల యన, సమృద్ధి బుద్ధిని వికారపఱుచు నని జ్ఞానులు తెలిపియున్నారు.

111. దొరకిన ధనమును హరించుట, ద్రవ్యములను మార్చుట, అడ్డి సేయుట, ఒప్పరికించుట, తెలివి లేమి, తా ననుభవించుట,—ఇవి మంత్రిదోషములు.

112. ఉద్యోగస్థులు అపహరించెడు ద్రవ్యమును మరలం గైకొనుటకు రాజులకు ఉపాయ మే మనఁగా,—నిత్యము పరీక్షించుట, తెలివి గొలుపుట, పని మార్చుటయు.

113. ఓరాజా, నియోగస్థులు తఱచుగా చెడువ్రణములవంటివారు, బాగుగా ఒత్తినయెడల లోపలి సారమును వెడలఁ గ్రక్కుదురు.

114. రాజు నియోగులను పలుమాఱు పిండి ధనధారను పొందవలసినది. స్నానము చేసిన వస్త్రము ఒకమాఱు పిడిచిన మాత్రాన సర్వజలమును వదలునా?

దీని నెల్ల ఎఱిఁగి సమయోచితముగా వ్యవహరింపవలయును.'

అన్న యిట్లు చెప్పఁగా పింగళకుఁడు 'మీరు చెప్పినది సరియే, మఱి ఈ యిరువురును బొత్తిగా నామాటప్రకారము చేయరు;' అని చెప్పెను. స్తబ్ధకర్ణుఁ డిట్లనియె.—'ఇదంతయు తగదు. ఏల యనఁగా,—

115. ఆజ్ఞ నతిక్రమించువారిని తన కొమరుల నయినను రాజు క్షమింపఁగూడదు, మఱి రాజునకును చిత్తరువులోని రాజునకును భేద మేమి?

116. ఊరకుండు వానికి కీర్తియు, వంచకునికి చెలిమియు, ఇంద్రియనాశము పొందినవానికి కులమును, ధనాసక్తునికి ధర్మమును, త్రాగుడు మొద లయిన దురభ్యాసములు కలవానికి చదువువలనిప్రయోజనమును, లోభికి సౌఖ్యమును, పొగ రెక్కిన మంత్రులు గల రాజునకు రాజ్యమును నశించును. మఱియు ముఖ్యముగా;—

117. దొంగవలననుండి, ఉద్యోగస్థులవలననుండియు, పగతురవలననుండియు, తనప్రియులవలననుండియు, తనధనాశవలననుండియు, రాజే తండ్రివలె ప్రజలను కాపాడ వలయును జుమీ.

తమ్ముఁడా, ఎల్లవిధముల నామాటను నెఱవేర్పుము. మన కిప్పుడు భోజనము కూడ కానే అయియున్నది. ఈపైరుమేపరిని భోజనాధికారమందు నియమింపుము.' ఈ మాట ప్రకారము అట్లే జరుగఁగా, పింగళక సంజీవకులకు ఇతరబంధువులతో పని లేకుండ నిండు చెలిమిగా కాలము గడచుచుండెను.

అంతట సేవకులకు సయితము రాజు ఆహార మొసంగుటయందు అసడ్డ సేయుచుండుటం గాంచి దమనకకరటకులు ఒండొరులతో ఆలోచించుకొనిరి, దమనకుఁడు ఇట్లనియె. "ఇది మనము చేసికొన్న చెఱుపు. స్వయంకృతదోషమునకు ఏడ్చుట సయితము సరి గాదు. అట్లే చెప్పిరి;—

118. 'స్వర్ణలేఖను తాఁకి నేనును, తన్ను తాను కట్టివైచికొని తారువుగత్తెయు, రత్నమున్న కైకొనఁ బోయి వర్తకుఁడును, వీరు తమ తమ దోషముచేత దుఃఖమునకు పాలు అయినారు.' "

అది యెట్లని కరటకుఁ డడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.—

కథ. ౧౧.

కాంచనపురమను పట్టణములో వీరవిక్రముఁ డని రాజుండెను. అతని ధర్మాధికారి మంగలి నొకనిని మరణదండన తావునకు కొనిపోవుచుండఁగా కందర్పకేతు వనుపేరి సన్న్యాసి ఒక వర్తకునితోఁ గూడ వచ్చి, 'వీనిని చంపఁగూడదు' అని చెప్పి వస్త్రముసం బట్టుకొని యాఁపెను. 'ఏల వీనిని చంపఁగూడదు?' అని తలవరులు అడిగిరి. వినుండని ఆతఁడు 'స్వర్ణలేఖను నేనును' ఇత్యాదికమును పలికెను. వివరముగా చెప్పుమని వారడిగిరి. సన్న్యాసి యిట్లు చెప్పందొడంగెను.—

నేను సింహళద్వీపరాజు జీమూతకేతుని కుమారుఁడను. ఒకనాఁడు నేను క్రీడావనములో నుండఁగా ఓడవర్తకుఁ డొకఁడు వచ్చి నాతో ఇదె యిట నడిసముద్రములో ప్రతిచతుర్దశియందును నీటిపైకి లేచెడు కల్పవృక్షము క్రింద రత్నాల వరుసల వెలుఁగులచేత పలువన్నెలు గల మంచము మీఁద నున్నదై సకలభూషణ భూషితురాలై, మహాలక్ష్మివలె, వీణ వాయించుచు, ఒక కన్య యగపడుచున్నది.' అని చెప్పెను. అంత నేను ఆవర్తకునిం దోడ్కొని ఓడయెక్కి అచటి కేఁగితిని. అచట, అతఁడు చెప్పినట్లే మంచములో సగము మునిఁగి యున్నట్టి యాకన్యను కంటిని. వెంటనే ఆకన్నియ చేటితోఁ గూడ కడలి లోపలికి మునిఁగి అదృశ్యురాలాయెను. అనంతరము ఆ సుందరియొక్క సౌందర్య గుణముచేత లాఁగబడినవాఁడనై అప్పటికి పుట్టిన బుద్ధిప్రకారము నీట దుమికితిని. తర్వాత ఆకల్పవృక్షము కొమ్మను పట్టుకొని ఆ సుందరియొక్క కనకపట్టణమునకుం బోయి అట బంగారునగర విద్యాధరాంగనలు కొలుచుచుండ మునుపటివలెనే మంచముపై నున్నట్టి యా కన్నియం గంటిని. నన్ను దూరమునుండియే గాంచి యాసుందరి చెలికత్తెను నావైపు పంపి ప్రీతితో పలుకరింపించినది. అంతట నే నడుగఁగా ఆ సఖి యిట్లు చెప్పినది. "ఈమె కందర్పకేళి యనెడు విద్యాధర చక్రవర్తికూఁతురు, ఈమె పేరు రత్నమంజరి. ఈమె యిట్లు ప్రతిన పట్టినది.— 'ఎవఁడు వచ్చి యీ కనకపట్టణమును తన కంటితో చూచునో వాఁడే నన్ను మానాయన యెఱుకను వివాహమాడును.' అని. కావున నీవు ఈమెను గాంధర్వ వివాహమునం గయికొమ్ము." గాంధర్వవివాహము జరుగఁగా ఆ కోమలితో క్రీడించుచు నేను చిరకాలము ఉంటిని.

తర్వాత నొకనాఁడు ఆప్రియ నాతో ఏకాంతమున 'స్వామీ' ఎల్లప్పుడును నీయిచ్చ వచ్చినట్లు దీని నెల్ల అనుభవింప వచ్చును; కాని ఇదిగో ఈచిత్తరువునం దున్న



విద్యాధరిని స్వర్ణలేఖ యనుదానిని నీవెప్పుడును తాఁకఁగూడదు.' అని చెప్పెను. అంతట ఆమాటవలన కుతూహలము కలిగి నేను స్వర్ణలేఖను పాలిండ్లప్రదేశమున తాఁకితిని. చిత్తరువుగానే యున్నదయ్యును ఆస్వర్ణలేఖ అడుగుఁదామరతో తాఁచినతాఁపునకు నేను వచ్చి మారాష్ట్రమందు పడితిని.

అది మొదలు దుఃఖపీడితుఁడనై నేను సన్న్యసించి భూమియెల్లఁ ద్రిమ్మరుచు ఈ పట్టణము చేరితిని. అప్పటికి ప్రొద్దు క్రుంకఁగా ప్రవేశించిన సమీపముననే యున్న గొల్ల యింట బస యడిగితిని. గొల్లయు తనయింట నొకమూల నాకు చోటిచ్చి పెండ్లాముతో 'నేను వచ్చునప్పటికి ఈయనను హాయిగా నుండునట్లు చేయుము.' అని చెప్పి పోయెను. అనంతరము అతనిభార్య అంకుటాలు కుంటెనకత్తెతో గుసగుసలాడుచుండఁగా అంతలో దానిమగఁడు ఆ గొల్లవాఁడు కొట్టమునుండి వచ్చినవాఁడై అట్లు కుట్టనితో మాటలాడుచున్న భార్యను చూచెను. గొల్లది మగనిం గాంచి తటాలున తెలివిదెచ్చుకొని మగలి యింటి లోనఁ జొచ్చి పడక లోనగు నుపచారములను కావించెను. అంతట గొల్లయు దానిని మోది కంబమునకు కట్టివైచి నిద్రపోయెను. తర్వాత నడికిరేయి దానిమాతి మంగలిది మరల వచ్చి యా గొల్లభామతో నిట్లనియె.— 'ఆమహానుభావుఁడు చచ్చెడు స్థితిలో నున్నాఁడు, నీయెడఁబాపే అతనిని నిప్పై కాల్చుచున్నది. చెప్పిరి కదా;—

119. రేద్రిమ్మరులసామి యైన చంద్రుఁడు చీఁకటిం జీల్పఁగా మన్మథుఁడు వయసువాండ్ర హృదయములను వెదకి వెదకి ఏయసాగెను.

కావున నే నిట నన్ను కట్టుకొని యుండెదను. నీవు అటకేఁగి అతనిని సంతోషపెట్టి త్వరగా రమ్ము.' గొల్లదియు ఆప్రకారమే చేసెను. ఇంతలో గొల్ల మేల్కొని 'ఓసీ, ఇప్పుడు ఋండనికడకు పోవేమి?' అని యడిగెను. అందులకు దూతి మాఱు పలుక దాయెను. అంతట 'ఇంతపొగరా నీకు? ఉత్తర మయినను పలుకవా?' అని గొల్ల కోపమున దానిముక్కును కోసివైచి తాను మరల నిద్రపోయెను. తర్వాత గొల్లది వచ్చి కుంటెనకత్తెను 'ఏమివార్త?' అని యడిగెను. 'నాముఖము చూడు, నాముక్కే వార్తనంతయు చెప్పును.' అని కుట్టని పలికెను. తర్వాత గొల్లది ఎప్పటియట్లే తన్ను స్తంభమునకు కట్టుకొని యుండినది. కుట్టని తెగ పడి యున్న ముక్కును కైకొని తనయింటికి పోయి ఖేదపడుచు ఉండినది.

తర్వాత తెల్లవాఱఁగా మంగలి పెండ్లామును పొదితెమ్మనెను. అది పొది తేక ఒకకత్తిమాత్రము తెచ్చి యిచ్చినది. అందులకు కోపగించి మంగలి దూరముగా ఇంటిలో కత్తిని పాఱవైచెను. ముక్కుకత్తిరింపించుకొన్న యీ మంగలిది 'నావలన ఏతప్పులేకయే ఇతఁడు నాముక్కును కోసివైచినాఁడు.' అని మొఱపెట్టుచు వానిని ధర్మాధికారి కడకు కొనిపోయినది.

గొల్ల అడుగఁగా ఆగొల్లది యిట్లనియె.—‘ఓరి పాపాత్ముఁడా, మహాపతివ్రతను నన్ను రూపు రేఖ చెఱుచుటకు నీకు శక్యమా? నానడువడిలో దోషము లేదని దిక్పాలకులు ఎనమండుగురును ఎఱుంగుదురు. ఏల యన;—

120. సూర్యచంద్రులు, గాలి, నిప్పును, ఆకాశము, భూమి, నీళ్లు, మనస్సు, యముఁడును, రెండు సంజలును, రాత్రి, పగలును, ధర్మమును, మనుష్యుని నడవడిని ఎఱుంగుదురు.

కావున నేనే మహాపతివ్రతనేని నామగనిం దక్క-ఒరుని మనస్సులోనైనను తలంపనేని, నాముఖము గాయము లేనిది అగుఁగాక.’ అంతట గొల్లబోయఁడు దీపము తెచ్చి గాయములేని దానిముఖమును గన్నంతట ‘నా నేరమి మన్నింపుము’ అని ప్రదక్షిణము తిరిగి సంతోషముతో నిండిన మనస్సుతో కట్టు విప్పి దాని పాదములలో వ్రాలి ‘ఇట్టి పతివ్రత యయిన పెండ్లాము కలయట్టి నేను ధన్యుఁడను!’ అని పలికెను. ఏల యన,—

121. స్త్రీలకు వాక్కున తేనె యుండును, హృదయములో హాలాహల విషమే ఉండును; కాననే అధరోష్ఠమును చుంబింతురు, హృదయమును పిడికిట గ్రుద్దుదురు.

ఓ తలారులారా, ఈవర్తకుని కథను సయితము వినుఁడు. ఇతఁడు ఇల్లు వెడలి పంద్రెండేండ్లు వర్తకము చేసి నానావిధము లయిన యపూర్వరత్నములను మలయపర్వత సమీపము నుండి తెచ్చి నిన్న ఈయూరు చేరినాఁడు. ఇట భోగముదానియింట నిద్రించినాఁడు. అచట కట్టని యింటిగడపకడ పెట్టియున్న కొయ్యబేతాళుని నెత్తిమీఁద మిక్కిలి మేలయిన రత్న మొకటి యున్నది. దానిం గని ధనలోభముచేత ఈవర్తకుఁడు రాత్రి లేచి రత్నముమీఁద చేయియుంపఁగానే ఆబేతాళుఁడు దారములమూలముగా సంచరించునట్టి తనబాహువులతో ఈయనను పట్టి నలఁపఁగా ఈయన నొగిలి యేడ్వసాగెను. అంతట తార్పుకత్తె మేల్కొని వచ్చి ‘వర్తకుఁడా, అబ్బాయీ, మలయముకడనుండి వచ్చితివి. నీరత్నముల నెల్ల ఇమ్ము. ఈవేని ఇది నిన్ను విడువదు. ఈపనివాడు ఇట్టివాఁడు’ అని చెప్పెను. అంతట ఈయన తన రత్నముల నన్నిటిని దానికి ఇచ్చెను. ఇట్లు సర్వధనముం గోలుపోయి ఇప్పుడు ఈతఁడు నాతో కలసికొన్నాఁడు.—

ఇదంతయు విని తలవరులు ధర్మాధికారితో చెప్పి న్యాయముప్రకారము చేయించిరి. కావున నేను ‘స్వర్ణలేఖను’ ఇత్యాది పలికితిని. కావున ఇది మనము స్వయముగా తెచ్చుకొన్న కీడు! ఈవిషయమున విలపించుట సయితము తగదు. (ఇంచుక సేపు ఆలోచించి) మిత్రుఁడా, ఈపింగళక సంజీవకులకు ఎట్లు చెలిమి చేసితినో అట్లే చెలిమికి భంగమును కూడ నేను చేయవలయును, ఏల యన,—

122. చిత్తరువు వ్రాయ నేర్చినవారు చదునులో మిఱుకపల్లములను ఎట్లు చూపుదురో అట్లే కడు గడుసువాండ్రు అవాస్తవములను సయితము వాస్తవముగా చూపుదురు. మఱియు;—



23. కార్యము చెడినప్పుడు కూడ ఎవనికి బుద్ధి తోఁచుపడదో వాఁడు, గొల్లది ఇరువురు మిండండ్రనుంబోలె, ఇక్కట్టులను దాఁటును.

అది యెట్లో చెప్పుమని కరటకుఁ డడిగెను. దమనకుఁడు ఇట్లు చెప్పసాగెను.

థ. ౬.

ద్వారవతీపురమందు ఒకగొల్లవాని భార్య చెడిప ఉండెను. అది ఊరికొత్వాలును వానికొడుకును ఇరువురను తగుల్కొని యుండెను. అట్లే చెప్పిరి గదా;—

124. నిప్పు కట్టియలకు తనియదు, సముద్రము నదులకు తనియదు, యముఁడు సర్వప్రాణులకును తనియఁడు, స్త్రీ పురుషులకు తనియదు. మఱియు;—

125. స్త్రీలు అన్నివిధములను కుటిలురాండ్రు; ఈవిచేనేని, సన్మానముచేతనేని, నిష్కపటవర్తనచేతనేని, కొలువుచేతనేని, కత్తిచేతనేని, శాస్త్రముచేతనేని, దేనిచేతను వశపడరు. ఏ లన,—

126. గుణవంతుఁడు కీర్తిమంతుఁడు అందగాఁడు తమ యాజ్ఞప్రకారము నడచుకొనువాఁడు ధనవంతుఁడు క్రీడానిపుణుఁడు అగు మగని వదలి, స్త్రీలు నడవడియు గుణమును లేని నరాధముని కూడుదురు. మఱియు;—

127. చెడిప గడ్డియు గాదమును చల్లియున్న నేలమీఁద పరపురుషుని కూటమిలో ఎట్టి సంతోషమును పొందునో అట్టి సంతోషమును ఇచ్చ వచ్చినట్లు విచిత్రమయిన పానుపునం బరున్నప్పుడును పొందదు.

ఒకనాఁడు అది కొత్వాలుకొడుకుతోఁ గూడి క్రీడించుచుండెను. అట్లుండఁగా కొత్వాలు రాఁ గాంచి ఆకుమారుని గాదెలో ఉంచి, కొత్వాలుతోఁ గూడి క్రీడించుచుండెను. ఇట్లుండఁగా దాని మగడు పసులకొట్టమునుండి వచ్చెను. వానిం గని గోపి ‘కొత్వాలా, నీవు దుడ్డుఁగఱ్ఱ చేతఁబూని కోపము చూపుచు త్వరగా పొమ్ము.’ అని చెప్పెను. అతఁడట్లే చేయఁగా గోపాలుఁడు వచ్చి భార్యను ‘ఏల యిచ్చటికి కొత్వాలు కోపముతో వచ్చినాఁడు?’ అని యడిగెను. అది యిట్లు చెప్పెను.—‘అతఁడెందులకో కొడుకుమీఁద కోపపడినాఁడు; వాఁడు పాఱిపోయి వచ్చి ఇక్కడ ప్రవేశించినాఁడు; నేను వానిని గాదెలో దాఁచి కాపాడితిని; తండ్రి వానిని ఇచట వెదకి కానఁడాయెను; అందుకై అతఁడు కోపగించి వెడలి పోయినాఁడు.’ ఇట్లు పలికి అది అతనికొడుకును గాదెలో నుండి దింపి చూపించినది. చెప్పిరి గదా;—

128. స్త్రీలకు పురుషులకన్న తిండి రెండింతలు, బుద్ధి నాలుగింతలు, పూనిక ఆఱింతలు, కామము ఎనిమిదింతలు.

కావున నేను ‘కార్యము చెడినను’ ఇత్యాది చెప్పితిని.

కరటకుఁడు 'నీవు చెప్పినది సరియే, కాని ఈ యిరువురకును స్వాభావికమైన ప్రేమ గొప్పదిగా నున్నది, ఎట్లు విడఁదీయ శక్యమగును?' అని యడిగెను. దమనకుఁడు చెప్పెను.—'ఇందులకు ఉపాయము నాలోచింపవలయును. ఈసుద్ది వినుము,—

129. ఉపాయమునకు ఏది సాధ్యమో అది పరాక్రమమునకు సాధ్యము గాదు. కాకి బంగారపుఁదీఁగచే నల్లత్రాఁచును చంపించినది.'

అది యెట్లని కరటకుఁడు అడుగుడు, దమనకుఁడును చెప్పం దొడంగెను.

కథ. ౭.

ఒకానొక చెట్టున కాకిదంపతులు కాఁపుర ముండినవి, వాని పిల్లలను ఆచెట్టు తొఱ్ఱలో నెలకొనియున్న నల్లత్రాఁచు తిని వైచినది. మరల కడుపై కాకి కాకముతో నిట్లనియె. 'స్వామీ, ఈచెట్టును వదలుదము. ఇట ఆనల్లత్రాఁచు మూలముగా ఒకవేళ మనకు సంతతి క్షయించును. ఏల యన,—

130. చెడిన పెండ్లాము, లోలోపల చెఱుపు చేయు స్నేహితుఁడు, ఎదురాడు సేవకుఁడు, పాముఉన్న యింటిలో కాఁపురము, - ఇవి చావే, సందియము లేదు.'

అందులకు కాకము 'ప్రాణేశ్వరీ' నీవు భయపడకు. దీని పెనుదప్పిదమును, నేను మాటిమాటికి క్షమించితిని. ఈమాఱు క్షమింపను.' అనెను. 'బల్లిద మయిన దీనితో పోరాడుటకు నీకు బల మెక్కడిది?' అని కాకి యడిగెను. కాకము 'ఊభయము మానుము. ఏల యనఁగా,—

131. బుద్ధి ఎవనికి కలదో వానికి బలము కలదు, బుద్ధిహీనునికి బల మెక్కడిది? చూడు, మదోన్మత్తమయిన సింహమును కుందేలు కూల్చినది.'

అది యెట్లని కాకి యడుగఁగా కాకము చెప్పుచున్నది.'

అవాంతరకథ. ౧.

మందరపర్వతమందు దుర్దాంత మను పేరి సింహ ముండెను. అది సర్వదా మృగములను చంపుచుండెను. మృగము లన్నియు కూడి సింహమునకు 'ఏల యెల్ల మెకములను చంపెదవు? మేమే నీకు ఆహారముకై ప్రతిదినము ఒక మృగమును ఇచ్చెదము.' అని విన్నపము చేసికొన్నవి. సింహము వల్లె అని అది మొదలుకొని దినదినము అవి పంపిన యొక్కొక్క పశువును భక్షించుచుండెను. ఇట్లుండఁగా నొకప్పుడు ఒక ముసలి కుందేటి వంతు వచ్చినది. అది యిట్లు తలపోసెను.—

132. బ్రదుకుమీఁది యాశచేత భయమున కేది కారణమో దానియెడల వినయము చేసెదము. నాకు చావే కలుగ నున్నప్పుడు సింహమునెడల నేను వినయము సేయుట చేత నా కేమి ప్రయోజనము?



కావున మెల్ల మెల్లఁగా పోయెదను.' అంతట సింహము ఆఁకటికి నొచ్చి కోపమున కుందేటిని 'ఏమి ! ఇంత విలంబముగా వచ్చితివి?' విని యడిగెను. కుందే లనియె.— 'నావలనం దప్పు లేదు. మఱి యొక సింహము నన్నుఁ గని బలిమిచే పట్టి నిలిపినది. మరల వచ్చెద నని ఒట్టు పెట్టుకొని, ఏలినవారికి ఆ వృత్తాంతమును విన్నవించుటకు వచ్చితిని.' సింహము కోపంబున 'ఇప్పుడే వచ్చి చూపింపుము. ఎక్కడ నున్నాఁడు ఆ దుష్టాత్ముఁడు?' అనెను. అంతట కుందేలు దానిని వెంటఁ బెట్టుకొని లోఁతునూతి కడకు పోయి 'ఇట వచ్చి ఏలినవారు చూడవలయును.' అని పలికి సింహమునకు నూతి నీళ్లలోని దాని ప్రతిబింబమునే చూపెను. అంతట పొగరుచేత పిక్కటిల్లుచున్న యా సింహము కోపమున ఆనీడపైఁ బడి తల క్రిందును కాళ్లు మీఁదును ఐ మునిఁగి చచ్చినది. కావున నేను 'బుద్ధి ఎవనికి కలదో' ఇత్యాదివాక్యమును చెప్పితిని.

కాకి 'అంతయు వింటిని; మఱి యిప్పు డేమి సేయవలయునో చెప్పుము.' అని యడిగెను. 'ఈచెంత చెఱువులో రాజకుమారుఁడు ప్రతిదినము వచ్చి స్నానము చేయును; అప్పుడు ఒడలినుండి తీసి బంగారపుఁదీఁగను రేవు ఱాతిమీఁద నుంచును; దానిని నీవు ముక్కుతో కఱచి తెచ్చి ఈతొఱ్ఱలో వైవుము.' అని కాకము చెప్పెను. తర్వాత ఒకప్పుడు రాజకుమారుఁడు స్నాన మాడుటకు నీటఁ జొరఁగానే కాకి ఆ చెప్పినప్రకారము చేసినది. అంతట బంగారపుఁదీఁగను అనుసరించి వచ్చిన రాజభటులు ఆ చెట్టు తొఱ్ఱలో నల్లత్రాఁచుం గాంచి చంపిరి. కావున 'ఉపాయమునకు ఏది సాధ్యమో' లోనగు దానిని చెప్పితిని.

'అటయినయెడల పద. నీ దారులు శోభనము లగుగాక' అని కరటకుఁడు పలికెను. అనంతరము దమనకుఁడు పింగళకుని చెంత కేఁగి మ్రొక్కి యిట్లనియె.—'దేవరా, మిక్కిలి దుఃఖకర మయిన కీడును పొడగాంచి వచ్చితిని. ఏల యన,—

133. ఆపదయందును తప్పుదారిని పోవునప్పుడును, పనిసమయము మించి పోవుచున్నప్పుడును, తన్ను అడుగకున్నను, హితుఁడయిన మనుష్యుఁడు మంగళ మయిన మాటను చెప్పవలయును. మఱియు;—

134. రాజు భోగము ననుభవింపవలసినవాఁడు, పనులు సేయవలసినవాఁడు కాఁడు. రాజకార్యమును చెడఁగొట్టిన మంత్రికి దోష మంటును.

అది యట్లే; చూడు. మంత్రులకు ఇది పద్ధతి.

135. ప్రాణము విడుచుట యైనను మేలు; తల కోసికొనుట యైనను మేలు; కాని, ప్రభువుయొక్క పదవిని తాను పొందవలయు ననెడి పాతకము నొనర్పఁగడంగిన వాని నొప్పరికించుట బొత్తిగా మేలు గాదు.'

'మఱి నీ వేమి చెప్పవచ్చితివి?' అని పింగళకుఁడు అక్కఱతో నడిగెను. 'వీఁడు

గో ఉన్నాఁడే సంజీవకుఁడు, ఇతఁడు మీఁమీఁద తగని వ్యవహారమును పూనియున్నాఁడు. అది ఏమనఁగా, శ్రీమంతు లయిన దేవరవారి ప్రభుమంత్రోత్సాహశక్తులను మా యెదుట నిందించి రాజ్యమునే తా నేలఁ గోరినాఁడు.' అని దమనకుఁడు వక్కాణించెను.

ఈమాట విని పింగళకుఁడు ఆశ్చర్యముచే ఱిచ్చపడెను. దమనకుఁడు వెండియుం బలికెను.— 'దేవా' ఎల్ల మంత్రులను తొలఁగించి వీని నొకనినే సకల కార్యములకును అధికారిని చేసితివి. ఇది గొప్ప పొరఁబాటు. ఏల యన,—

**136.** మంత్రియు రాజును మిక్కిలి గొప్పవారై ఐకమత్యము కలిగి యున్న యెడల ఆయిద్దఱిమీఁదను శ్రీ రెండుపాదములు ఊని స్థిరముగా నిలుచును. వారు ఐకమత్యము ఎడలి చీలినచో ఆమె స్త్రీస్వభావముచేత తనబరువును తాను ఆఁపుకొలేక ఆయిరువురలో నొకనిని వదలును. మఱియు;—

**137.** ఎప్పుడు రాజు మంత్రిని రాజ్యమున కెల్ల ప్రధానునిఁగాఁ జేయునో అప్పుడే అజ్ఞానముచేత వానికి మద మెక్కును. అంతట వాఁడు మదమువలన పనులు సేయ ప్రాలుమాలి రాజునుండి విడఁబడను. విడఁబడినవాని హృదయములో తానే స్వతంత్రుఁడుగా ఏల వలయునని కోరిక కలుగును. ఆకోరికచేత వాఁడు ఱేని ప్రాణమును హరింపం గడంగును. ఇట్లు చెప్పిరి;—

**138.** మనస్సు విఱిగిన భక్తుని ఊఁగులాడం దొడంగిన దంతమును, పగ వహించిన మంత్రిని, వేరుతో లాగివేయుట మంచిది. మఱియు;—

**139.** ఏరాజు తాను స్వతంత్రుఁడు గాక మంత్రియొక్క ప్రజ్ఞవలననే సిరిని పొందునో, ఆరాజు ఆమంత్రి ద్వేషించెనేని, నడిపించువారు లేక, గ్రుడ్డివాఁ డెట్లో ఆట్లే చదికిలంబడును.

ముఖ్యముగా,—140, సదా మంత్రిని లోఁగఁదీయుట సాధ్యము గాదు, అతఁడు సమృద్ధుఁడేని సమస్తమును అతఁడే యగును; సమృద్ధి మనస్సును చెఱుచు నని యోగులు చెప్పుదురు.

అతఁడును ఎల్ల కార్యములను తన యిచ్ఛ వచ్చినట్లు ప్రవర్తిల్లును ఇందులకు తార్కాణము ఏలిన వారికి విశదమే.

**141.** సిరిని కోరని పురుషుఁడు లోకములో లేఁడు. అన్యుని పడుచు భార్యను ఆసతో చూడనివాఁడు ఎవఁడు?'

సింహము ఆలోచించుకొని యి ట్లనియె.— 'ఓయి కలా[illegible]ఁడా, నీవు చెప్పినది వాస్తవమే; అయినను నాకు సంజీవకునితో మిక్కిలి చెలిమి. చూడు;—

**142.** అప్రియములు చేయుచున్నను ప్రియుఁడు ప్రియుఁడే. సకలదోషములచేతను చెడిన దైనను దేహము ఎవనికి ప్రియము గాదు.? మఱియు;—



**143.** అప్రియములు చేయువాఁ డయినను ఇష్టుఁడు ఇష్టుఁడే; ఇంటి శ్రేష్ఠవస్తువుల నెల్ల కాల్చిన దైనను నిప్పునందు ఎవనికి తిరస్కారము?'

దమనకుఁడు వెండి ఇ ట్లనియె.—'ప్రభూ' అదియే గొప్ప పొరఁబాటు. ఏలన.—

**144.** ఎవనియందు ప్రభువు ఎక్కువగా కటాక్ష ముంచునో, కుమారుఁడు గానీ, మంత్రి గానీ, సంబంధము లేనివాఁడు గానీ, వాఁడు సిరికి పట్టగును.

దేవా, వినుము; **145.** అప్పటికి ఇష్టము గాక పోయినను పథ్యము పరిపాకములో సుఖము సేయును. పథ్య మయిన మాటను చెప్పువాఁడును వినువాఁడును ఎక్కడ కలరో అక్కడ సంపదలు క్రీడించుచుండును.

నీవు కుల క్రమాగతు లైన సేవకులను తొలఁగించితివి. క్రొత్తగా వచ్చినవానిని సమ్మానించితివి. ఇది సరియైన పనిగాదు.

**146.** మూలసేవకులను ఎడలి క్రొత్తగా వచ్చినవానిని సమ్మానింపఁ గూడదు. రాజ్యమును చీల్చునట్టి దోషము ఇంతకన్న మఱి లేదు.'

సింహము అడిగినది.—'నీమాట యాశ్చర్యముగా నున్నది! ఇతనిని నేను అభయ వాక్కు ఇచ్చి రావించి వృద్ధికి తెచ్చితిని. ఇతఁడు నాకు ద్రోహ మెట్లు తలఁచును?'

**147.** దమనకుఁ డి ట్లనియె. దేవా, వం పయిన కుక్కతోఁక చెమరింపించుట తైలాదిక మంటుట అను నుపాయముచేత ఎట్లు తిన్నఁబడదో అట్లే దుర్జనుఁడును సర్వగా ఉపచరింపఁబడుచున్నను తిన్నఁదనమును పొందఁడు. మఱియు;—

**148.** చెమరింపించి, తైలాదులతో మర్దించి, త్రాళ్లు చుట్టి పండ్రెండు సంవత్సరములు ఉంచినను, కుక్కతోఁక మొదటి స్థితికే వచ్చినది. మఱియు; —

**149.** పెంపొందించుటయు సమ్మానించుటయు దుర్జనులకు ప్రీతి నొసంగదు. అమృతము పోసి పెంచినను విషవృక్షములు పథ్య మయిన ఫలములను కావవు.

కావున నేను చెప్పున దే మనఁగా;—

**150.** ఎవని యోటమిని సహింపఁడో వానికి అడుగకున్నను హితము చెప్పవలయును; ఇదే పెద్దల ధర్మము. ఇంపలకు విపరీతముగా నడచుట పెద్దల ధర్మము గాదు.

**151.** చెఱుపునుండి వారించువాఁ డెవఁడో ఆతఁడు మిత్త్రుఁడు, ఏది దోషరహితమో అది పని, భర్త యిచ్ఛ చొప్పున చేయునది యెవతెయో అది భార్య, సజ్జనులచేత గౌరవింపఁబడువాఁ డెవఁడో అతఁడు బుద్ధిమంతుఁడు, మద మెక్కింపనిదే సిరి, ఆశ ఎవనిని వదలినదో వాఁడు సుఖవంతుఁడు, కపటము లేనివాఁ డెవఁడో వాఁడు మిత్త్రుఁడు ఇంద్రియములచే బాధపడనివాఁ డెవఁడో వాఁడు మగవాఁడు.

సంజీవకుఁడు బెడిసినందున చెడనున్న యేలినవారు నేను విన్నపము చేసికొన్నను వానిని వదలర యేని, ఆ పక్షమున సేవకుఁడ నైన నాయందు తప్పు లేదు.

152. రాజు కామపరతంత్రుఁడైనచో, రాజకార్యమును హితమును విచారించుకొనక, తన యిచ్ఛ వచ్చినట్లు స్వతంత్రముగా మదపుటేనుఁగువలె సంచరించును. అంతట గర్వముచే పూరితుఁడై యెప్పుడు తాను దుఃఖారణ్యములో పడునో అప్పుడు సేవకునియందు నేరము లెంచును, తన దుర్వృత్తిని తలంపఁడు.'

పింగళకుఁడు తన మనస్సులో నిట్లనుకొనెను.—

153 ఒకఁడు నేరమి మోపినమాత్రాన ఒరులను దండింపఁ గూడదు; తాను స్వయముగా తెలిసికొని కట్ట నైనను కట్టవలయు, పూజింప నయినను పూజింపవలయు.

154. గుణదోషములను నిర్ణయింపక సత్కారము గాని దండనము గాని చేయఁగూడదు. చేయునేని, గర్వముచేత పామునోట చేయిపెట్టినట్లే తనకే నాశము కలుగును.

ఇట్లనుకొని ప్రకాశముగా 'అటయిన సంజీవకుని తొలఁగింతునా?' అని యడిగెను. దమనకుఁడు తొట్రుపాటుతో నిట్లనియె —'దేవా, అట్లు చేయఁగూడదు. ఇందువలన మంత్రము చెడును. చెప్పుదురు గదా;—

155. మంత్రమునకు ఇది విత్తనము; దీనిని ఎట్లు రక్షింపవలయుననఁగా ఇంచుకయేని బయట తెలియకుండునట్లుగా రక్షింపవలయును; ఏల యనఁగా ఇది బయట తెలిసినచో మొలవదు. మఱియు;—

156. కొనవలసినదానిని ఈవలసినదానిని చేయవలసినపనిని శీఘ్రముగా చేయనియెడల కాలము దానిరసమును త్రాగును.

కాన ఆరంభించినదానిని తప్పక గొప్పయత్నముతో నెఱవేర్పవలయును. మఱియు;-

157. పిఱికివాఁడు అవయవము లన్నిటికిని కవచము తొడుగుకొనియు శత్రువులు చీల్తురను భయముచేత చాలసేపు ఎట్లు ఉండలేఁడో, అట్లే మంత్రమును అందు చేరినవారు ఎంత చక్కఁగా దాఁచినను చిరకాలము దాఁగదు, పరులు భేదింతురను భయము కలదు.

ఇతని దోషము ఎఱుకపడినను దానినుండి మాన్పి యితనితో సంధిచేసికొనుటయు కేవలము పొరఁబాటు. ఏల యనఁగా,—

158. ఒకమాఱు ద్వేషించిన మిత్త్రుని ఎవఁడు మరల కూర్చుకొనఁగోరునో, వాఁడు కంచరగాడిద చూలయినట్లు చావును తెచ్చుకొనును.

సింహము 'పోనీ, వీఁడు మాకేమి చేయఁగలఁడో దానిని తెలిసికొమ్ము' అనెను. దమనకుఁ డనియె.—'దేవా,

159. సాధకునియొక్క సాధనము లేవో ఎఱుఁగక సామర్థ్యమును ఎట్లు నిర్ణయింపవగును? చూడు, లకుముకి పిట్ట ఏపాటి, అది సముద్రమును కలఁత పెట్టినది.'

అది యెట్లని సింహ మడుగఁగా, దమనకుఁడు ఇట్లు వక్కాణించెను.—



కథ. ౮.

దక్షిణసముద్రముదరిని లకుముకులు రెండు ఆలును మగఁడును నివసించుచుండినవి. ప్రసవకాలము సమీపింపఁగా ఆఁడులకుముకి మగలకుముకితో 'నాథా, కానుపునకు తగిన ఏకాంతప్రదేశమును వెదకుము.' అని చెప్పెను. పోతులకుముకి 'ఓసి, ఈ చోటే కానుపునకు తగినది.' అనెను. 'సముద్రమునుండి పోటెక్కుడు చోటు గదా యిది.' అని ఆలు చెప్పెను. 'ఓసి కల్యాణీ, నే నేమి చేతఁగానివాఁడ నని తలఁచితివా? నా యింట నుండు గ్రుడ్లను సముద్రునితరమా అపహరించుటకు?' అని మగఁడు పలికెను. అందులకు టిట్టిభి నవ్వి 'నాథ, నీకును సముద్రునికి ఎంతయో వార, కాక,—

160. ఎక్కువ తక్కువలను యోగ్యాయోగ్యములను అరయు తెలివి ఎవనికి గలదో, ఎవనికి శాస్త్రజ్ఞానము కలదో, వాఁడు కష్టమందును చెడిపోఁడు. మఱియు;—

161. తగనిపని పూనుకొనుట, బంధువులను ద్వేషించుట, బలవంతునితో పోట్లాడి, స్త్రీలను నమ్ముట, ఈ నాలుగును చావునకు ద్వారములు.'

తర్వాత ఎట్టకేలకు మగని మాటకు లోఁబడి టిట్టిభి అటనే గ్రుడ్లు పెట్టినది. ఇదంతయు వినుచుండి సముద్రుఁడు టిట్టిభునిశక్తి నెఱుంగువాఁడై ఆగ్రుడ్లను అపహరించెను. అంతట టిట్టిభి దుఃఖపీడితయై మగనితో 'నాథా, కష్టము వచ్చినది, నా గ్రుడ్లను సముద్రుఁడు హరించినాఁడు.' అని మొఱపెట్టెను. అందులకు టిట్టిభము 'ప్రియా, భయపడకు,' అని చెప్పి పక్షులగుంపును వెంటఁగొని పక్షినాయకుఁ డైన గరుత్మంతుని కడకు పోయి సకల వృత్తాంతమును గరుత్మంతుని వారిముందర చెప్పుకొనెను.—'దేవా, సముద్రుఁడు నా యింట నున్న నా నా తప్పిదమేమియు లేకయే కీడు చేసినాఁడు.' ఆమాటమీఁద గరుత్మంతునిచేత అతనిద్వార సృష్టిస్థితి సంహార హేతు వయిన భగవంతుఁడు నారాయణుఁడు విన్నవింపఁబడినవాఁడై 'గ్రుడ్లు ఇచ్చివేయు' మని సముద్రుని కాజ్ఞాపించెను. అంతట భగవంతుని యాజ్ఞను శిరమునఁ దాల్చి సముద్రుఁడు గ్రుడ్లను టిట్టిభునికి సమర్పించెను. కావున నేను 'సాధకునియొక్క సాధనము లేవో' ఇత్యాదిం జెప్పితిని.

---

162. తన శక్తికి మించినవాఁ డని తెలియక ఎవఁడు శత్రువుతో వైర మారంభించునో వాఁడు టిట్టిభమువలన సముద్రుఁడుంబోలె ఓటమి నొందును.

రా జడిగెను.—'ఇతఁడు ద్రోహబుద్ధి యని యెట్లు తెలియును?' దమనకుఁడు వెండియు బలికెను.—'ఎప్పుడు వీఁడు పొగరుతో కొమ్ముఁగొనలతో పొడుచుటకు సిద్ధముగా బెదరినట్లు దగ్గఱుచూ అప్పుడు తెలిసినవా రెఱుంగవచ్చును.' ఇట్లని పలికి సంజీవకునితావునకుం బోయి మెల్లమెల్లఁగా దగ్గఱి దిగులుపడినవానివోలె నగపడెను.

సంజీవకుఁడు గారవముతో 'కల్యాణుఁడా, నీకు కుశలమా?' అని యడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.—'సేవకులకు కుశల మెక్కడిది? ఏల యనఁగా,—

163. రాజులను గొలుచువారికి సంపదలు పరాధీనములు, ఎప్పుడును మనస్సునకు హాయి లేదు, తన ప్రాణమందు సయితము నమ్మకము లేదు. మఱియు;—

164. ధనములు పొంది గర్వింపనివాఁ డెవఁడు? విషయాసక్తుని కెవనికి ఆపదలు తప్పినవి? లోకములో ఎవనిమనస్సును స్త్రీలు ఖండింపలేదు? రాజులకుఁ బ్రియుఁ డెవఁడు? యమధర్మరాజుయొక్క యొమ్మున చేరని వాఁ డెవఁడు, గౌరవ మొందిన యాచకుఁ డెవఁడు? దుర్జనులవలలలో పడి క్షేమముగా తప్పించుకొని పోయినవాఁ డెవఁడు?'

'మిత్త్రుఁడా, ఇదేమో స్పష్టముగా చెప్పుము.' అని సంజీవకుఁ డడిగెను. దమనకుఁడు పలుకుచున్నాఁడు. —'ఏమి చెప్పుదును మందభాగ్యుఁడను? చూడు.—

165. సముద్రములో మునుఁగుచున్నవాఁడు, పామును చేపట్టుగా పడసి వదలను వదలక పట్టుకొననుం బట్టుకొనక యెట్లుండునో, అట్లు ఇప్పుడు నేను ఏమియుఁ దోఁపక యున్నాను. ఏల యన.—

166. ఆవంక నేని నమ్మకము చెడును, ఈవంక బంధువు నశించును, ఏమి సేయుదును? ఎందుఁ బోదును? దుఃఖసముద్రములో పడితిని.'

ఇట్లు పలికి నిట్టూర్పు నిగిడ్చి కూర్చుండెను. 'మిత్త్రుఁడా, అయినను విటివిగా నీమనస్సులోనిదానిని చెప్పుము.' అని సంజీవకుఁ డడిగెను. దమనకుఁడు మిక్కిలి రహస్యముగా ఇట్లు చెప్పెను.—"యేని నమ్మకమును వెలిఁ బుచ్చఁ గూడదు సరియే, అయినను నీవు మాయందలి నమ్మకముచేత వచ్చినవాఁడవు. నేనును పరలోకము కోరినవాఁడను, కావున తప్పక నీకు హితము చెప్పవలసినవాఁడను. వినుము. ఈదొర నీమీఁద బుద్ధి మాఱి ఏకాంతమున నాతో 'సంజీవకునే చంపి నాపరివారమునకు సంతర్పణ చేసెదను' అని చెప్పినాఁడు." ఈమాట విని సంజీవకుఁడు మిక్కిలి ఖేదమును పొందెను. వెండియు దమనకుఁడు 'దుఃఖపడకు. ఇప్పటికి చేయవలసిన కార్యమును చేయుము.' అనెను.

సంజీవకుఁడు క్షణము ఆలోచించి తనలో తా నిట్లు తలపోసికొనెను.—'పెద్దలు చెప్పిన యీమాట మిక్కిలి సరిగా నున్నది గదా.—

167. స్త్రీలు దుర్జనులను వలతురు, ప్రాయికముగా రాజు అయోగ్యులను ప్రోచును, ధనము లోభివానిని చేరును, ఇంద్రుఁడుఁ గొండలయందును సముద్రమందును వర్షించును. అది అట్లే;—

168. సిరి నీచుని సేవించును, సరస్వతి కులహీనుని ఆశ్రయించును, స్త్రీ అయోగ్యుని పొందును, ఇంద్రుఁడు కొండలలోఁ గురియును.

ఇది దుర్జనచేష్ట యగునా కాదా యను విషయము వర్తనవలన నిర్ణయింపఁ దరము గాదు. ఏ లన,—

169. జవరాలి కనులందు తీర్చిన మఱినెం పుఁ గాటుకవలె ఒకానొక దుర్జనుఁడు ప్రాపకుని ప్రభావమువలన శోభం బొందును.

(ఆలోచించి, వెల్లడిగా) 'కట్టా! ఏల యిది సంభవించినది! ఎందుల కనఁగా,—

170. ప్రయత్నపూర్వకముగా కొలిచినను రాజు సంతోషింపమి అంతగా ఆశ్చర్యముగా నుండ లేదు. ఇది మున్నెన్నఁడు లేని వింత తెలివిగా నున్నది; ఏ దన— కొలుచుచున్నను వైరము వహించుట.

కావున ఈసందర్భము ఊహింప నలవిగాక యున్నది ;— ఎట్లనఁగా,—

171. కారణమును ఉద్దేశించి ఎవఁడు కోపగించునో, నిశ్చయముగా వాఁడు ఆకారణము తీఱఁగానే మన్నించును; కారణము లేకయే ఎవని మనస్సు పగఁబట్టి యున్నదో, వానిని సంతోషపెట్ట నెవ్వనితరము?

రాజునకు నే నేమి యపకారము కావించితిని? అట్లగుఁగ నేల? నిమిత్తము లేకయు రాజులు చెఱుపు చేయుదురు?'

దమనకుఁడు పలుకుచున్నాఁడు.—'ఇది యిట్లు. వినుము.—

172. భావమందు నిలుకడలేని ప్రభువులకు, విశేషజ్ఞులును మిత్త్రులును అయిన కొందఱు చేసిన యుపకారమువలన సయితము ద్వేషమే కలుగును; ప్రత్యక్షముగా మఱి కొందఱు అపకారమే చేసినను ప్రీతి కలుగును. వారి చరిత్రము చిత్రమా మఱియుం జిత్రమా! సేవాధర్మము కేవలము దుర్బోధము; దాని తత్త్వము యోగులకు సయితము తెలియదు. మఱియు ;—

173. దుర్జనులకు చేసిన నూఱు ఉపకారములు నష్టము; ఆపండితులకు చెప్పిన నూఱు సూక్తులు నష్టము; చేయుమన్నట్లు చేయనివారికి చెప్పిన నూఱు మాటలు నష్టము; ప్రాణము లేని మొద్దునకు నేర్పిన నూఱు బుద్ధులు నష్టము. మఱియు ;—

174. గందపుఁ బ్రాఁకులందు పాము లుండును; కమలములుగల నీళ్లలో మొసళ్లు ఉండును; సుఖానుభవమందలి గుణమును దుర్జనులు పోఁగొట్టుదురు; సుఖములకు విఘ్నములు రాకమానవు. మఱియు ;—

175. గందపుఁజెట్టులో—వేళ్లను పాములును, పువ్వుల తుమ్మెదలును, కొమ్మను కోఁతులును, కొనను పక్షులును ఆశ్రయించును; అందులో అతిదుష్టము లయిన ఘాతుక ప్రాణులు ఆశ్రయింపనిది ఏభాగమును లేదు.'

సంజీవకుఁడు పలికెను.—ఈస్వామికి ఏవో నోఱు తీపును మనస్సు విషమును అని నాకు ఎఱుఁగనయినది. ఏల యన.—

176. దూరమునుండి చే యెత్తుట, కన్నులు తడి యగుట, తన యాసనమందు

సగము చోటు సేయుట, బిగ్గఁ గవుంగిలింప నాసక్తి వహించుట, ఇష్టమును చెప్పుట యందును అడుగుటయందును ఆదరము పూనుట, కడుపులో విసము బయట తేనెయు, మాటలో కడు నేర్పు ;— ఈయపూర్వ నాటకప్రకారము దుర్జనులు ఎక్కడ నేర్చినారో! అట్లుఁగదా,—

177. దాఁట నలవిగాని సముద్రమును దాఁటుటకు ఓడ, చీఁకటి పడు వేళకు దీపము; గాలి లేనిచోట వీవన, మదముచే కన్ను దెలియని యేనుఁగుల పొగరణఁచుటకు అంకుశము;— ఈ విధముగా భూలోకములో బ్రహ్మదేవుఁడు ఉపాయ మరయని దేదియు లేదు. దుర్మార్గులయొక్క చిత్తవృత్తిని హరించు ప్రయత్నములో బ్రహ్మయు భంగమొందినాఁడని నా తలంపు.'

సంజీవకుఁడు వెండియు నిట్టూర్పు పుచ్చి—'అయ్యయ్యో! పైరు మేపరిని నన్ను సింహము పరిమార్చుట ఏటిపని! ఏలయన,—

178. ఏ యిరువురకు ధనము సమానమో, ఏ యిరువురకు బలము సమానమో, ఆ యిరువురకును వివాదము తగును గాని, ఉత్తమునికిని అధమునికిని ఎప్పుడును తగదు.

(మరల ఆలోచించి) నామీఁద రాజునకు ఎవరుకోపము తెప్పించినారో తెలియఁజాలకున్నాను. భేద మొందిన రాజువలన నెప్పుడును భయపడవలసినది. ఏలయన,—

179. విఱిగిన స్ఫటికపుఁగడియమును మరల ఎవ్వఁడును ఎట్లు అదుకలేఁడో, అట్లే మంత్రి విఱిచిన దొరమనస్సును ఎందును ఎవఁడును అదుక నేరఁడు. మఱియు;—

180. పిడుగును రాజతేజమును ఈరెండును అతిభయంకరములు; ఒకటి ఒడిచోటనే పడును, కడమది అంతటను పడును.

కావున పోరిలో చచ్చుటయే మేలు. ఇపుడు ఆతని యాజ్ఞను అనువర్తించుట సరి గాదు. ఏల యనఁగా,—

181. పోరిలో చచ్చి స్వర్గమునకుఁ బోవునొండె, శత్రువును గూల్చి సుఖంబులఁ బడయునొండె; ఈరెండును శూరులకు మిక్కిలి దుర్లభము లయిన శ్రేయములు.

ఇదియును యుద్ధమునకు కాలము.—

182. ఎప్పుడు పోరకున్నను చావు నిక్కమో, పోరిలో చావు సందియమో, దానినే పోరికి కాల మని పెద్దలు చెప్పుదురు. అది యెట్లనఁగా,—

183. ఎప్పుడు పోరకున్న తనకు ఏమేలును కనఁబడదో, అనఁగా చావు తప్పదో, అప్పుడు తెలివిగలవాఁడు పోరి శత్రువుతోఁగూడ చచ్చుట మంచిది;

184. ఒకవేళ ఆపోరిలో తాను జయించెనా సిరిని పొందును; చచ్చెనా సురస్త్రీని పొందును; దేహములు క్షణములో నశించునవి, కనుక మరణవిషయమున యుద్ధవిషయమునను ఆలోచన ఏల?



ఇట్లాలోచించుకొని సంజీవకుఁడు 'మిత్త్రుఁడా, ఇతఁడు నన్నుఁ జంప నూహించుట ఎట్లు తెలియును?' అని యడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.— 'ఎప్పు డతఁడు చెవులు నిక్కఁబొడుచుకొని తోఁక యెత్తి కాలెత్తి నోరు తెఱచుకొని నిన్ను చూచునో, అప్పుడు నీవే నీపరాక్రమమును చూపుదువు. ఏల యన,—

185. బలవంతు డయినను తేజోహీనుని ఎవరు పరాభవింపరు? లోకులు బూడిద ప్రోగుమీఁద నిర్భయముగా అడుగు పెట్టుదురు.

కాని, ఇదియెల్ల పరమరహస్యముగా చేయవలసినది, రహస్యము బయలు వడెనేని నీవు ఉండవు, నేను ఉండను.'

ఇట్లు చెప్పి దమనకుఁడు కరటకునికడకుఁ బోయెను. 'ఏమి జరిగినది?' అని కరటకుఁ డడిగెను. 'ఇదె ఒండొరులనుండి వేఱుబందము నివ్వటిల్లినది.' అని దమనకుఁడు చెప్పెను. కరటకుఁ డనియె.—'ఇందు సందేహ మేమి? ఏలన,—

186. దుష్టులకు మిత్త్రుఁ డెవఁడు? యాచించి[illegible]పగింపనివాఁ డెవఁడు? ధనముచే తృప్తి పొందువాఁ డెవఁడు? తప్పుపనిలో నేర్పరి కా[illegible]ఁ డెవఁడు? మఱియు;—

187. మోసగాండ్రు తమ పెంపుకొఱకు ఐశ్వర్యవంతుని తప్పుమార్గములో ప్రవేశ పెట్టుదురు. తాను ఎందున్నదో దానిని తినున దైన అనఁగా కాల్చున దైన నిప్పువలె దుర్జనులతోడి కూడిక ఏమి చేయదు!'

తర్వాత దమనకుఁడు పింగళకునికడకుం బోయి 'స్వామీ' ఆపాపాత్ముఁడు వచ్చినాఁడు, ఏలినవారు సిద్ధపడి యుండవలయును.' అని చెప్పి మున్ను చెప్పినరూపున నుండఁ జేసెను. సంజీవకుఁడును వచ్చి, ఆతీరున సింహము ఆకారము మాఱి యుండుటం గాంచి తనకు తగినట్లు పరాక్రమించెను. ఆరెంటిపోరిలో సంజీవకుఁడు సింహముచేత పడిసెను. అంతట సేవకుఁ డయిన సంజీవకునిం జంపి పింగళకుఁడు దుఃఖాక్రాంతుఁడుగా నుండి ఇట్లు వక్కాణించెను. 'ఏల నేను క్రూరకృత్యము చేసితిని! ఎట్లన,—

188. సింహము ఏనుఁగును చంపి మృగరాజకీర్తిని పొందుటయందు చంపుట తనవంతును మాంసము తనపరివార మగునక్కలు లోనగుజంతువుల వంతును ఎట్లో అట్లే లోకములో ధర్మము మీఱినపాతకము రాజువంతును, రాజ్యభోగములు పరివారము వంతును.

189. సారవంత మయిన భూభాగము నశించుటలోను బుద్ధిమంతుఁ డయిన సేవకుఁడు నశించుటలోను, తారతమ్య మున్నది; సేవకుఁడు నశించిన రాజు నశించును, భూభాగము పోయినను మరల సులువుగా దొరకును, సేవకులు దొరకరు.'

దమనకుఁడు ఇట్లనియె;—'స్వామీ, ఇ దేమో క్రొత్తన్యాయముగా నున్నది; ఏ దనఁగా శత్రువును చంపి వగచుట. ఇట్లే చెప్పియున్నారు;—

190. తండ్రిగాని, భ్రాతగాని, కొడుకుగాని, మిత్త్రుఁడుగాని, తనప్రాణమును హరింపం గడంగిరేని, ఐశ్వర్యము కోరెడురాజు వారిని చంపవలయును. ఇంతియగాక;—

191. ధర్మము అర్థము కామము అను పురుషార్థముల స్వరూపమును ఎఱిఁగినవాఁడు కేవలము జాలినే వహింపఁ గూడదు; ఏలయన, ఓర్చెడువానిని వానిచేతిలోని యన్నమును కూడ తిన నీరు. ఇంక నే మన,—

192. శత్త్రుమిత్త్రులయందు సమముగా ఓర్పు వహించుట యతులకు అలంకారము. తప్పిదములు సేయుజంతువులయెడ ఓర్పు వహించుట రాజులయందు దోషము. మఱియు,—

193. దొరతనమునకై ఆశించి అహంకరించి తన పదవిని కోరువానికి ఒకటియే ప్రాయశ్చిత్తము; ఏ దన, ప్రాణము కదలుటయే; వేఱుప్రాయశ్చిత్తము లేదు. మఱియు;—

194. జాలిగుండె గలరాజు సి, సర్వమును తిను బ్రాహ్మణుని, స్వతంత్రురా లయిన స్త్రీని, దుష్టస్వభావుఁ ? తోడును, ఎదురు తిరిగెడు సేవకుని, పరాకుపడు పట్టి యధికారిని, చేసినమేలు తె వానిని— ఈ రేడుగురను వదలవలయును.

194. వేశ్యాంగన, సమయోచితముగా, నిజమాడుటగాను కల్లలాడుటగాను, పరుసము లాడుటగాను ఇచ్చకములు పలుకుటగాను, క్రూరముగాను కనికరముగాను, పిసినిడితనముతోను ఈవితోను, సదా వెచ్చముతోను సదా మిక్కిలి రాఁబడితోను, పెక్కు తీరులుగా నుండును; అట్లే రాజనీతియు నుండును.'

ఇట్లు దమనకుఁడు సమాధానపెట్టఁగా పింగళకుఁడు స్వస్థమానసుఁడై గద్దియపై కూర్చుండెను. దమనకుఁడు 'మహారాజా సర్వోత్కృష్టుఁడుగా నుండుఁగాక, సకల లోకములకును మంగళ మగుఁగాక' అని పలికి సుఖముగా కూర్చుండెను.

విష్ణుశర్మ 'రాజపుత్త్రులారా, మీ రిపుడు మిత్త్రభేదమును వింటిరి.' అని హెచ్చరించెను. 'నీ యనుగ్రహమున విని మేము సుఖము పొందినారము' అని రాజపుత్త్రులు చెప్పిరి. విష్ణుశర్మ యనియె —'అయినను ఇదియు నగుఁగాక.

196. మిత్త్రులవేఱుపాటు మీ శత్రువులయింట అగుఁగాక, ఖలులు యమునిచే లాగఁబడినవారై ప్రతిదినము నశింతురుగాక, నిత్యము జనులు సకల సుఖసంపదలకు ఉనికిపట్లగుదురుగాక, మనోహర మయిన యీకథాక్రమమును విని సర్వదా బాలురు సైతము ఆనందింపుదురుగాక.

సుహృద్భేదము సమాప్తము.

---

# హితోపదేశము.

## విగ్రహము.

మరల కథ యారంభించు తఱిని రాజకుమారులు 'అయ్యా, మేము రాజకుమారులము గాన విగ్రహతంత్రమును వినఁ గోరుచున్నాము.' అనిరి. విష్ణుశర్మ యనియె.— 'మీకు ఇచ్చ యున్నది గాన చెప్పెదను. విగ్రహమును వినుఁడు, అందు ఇది మొదలి శ్లోకము.—

1. హంసలతో నెమళ్లకు ఇరుపార్శ్వములందును సమానపరాక్రమము గల పోరు పొసఁగఁగా, నెమళ్లపంపున కాకులు పగతుర యింట చేరి నమ్మించి జయించినవి.'

'అది యెట్లో చెప్పుఁడు.' అని రాకుమారులు అడిగిరి. విష్ణుశర్మ ఇట్లు చెప్పెను.

కర్పూరద్వీపమందు పద్మకేళి యని సరస్సు కలదు. అందు హిరణ్యగర్భుఁ డని రాయంచ వసించుచుండెను. దానిని నీటిపక్షు లన్నియు చేరి పక్షిరాజ్యమునకు పట్టాభిషేకము చేసినవి. ఏల యన,—

2. చక్కఁగా ఏలునట్టి రాజు లేని యెడల, ప్రజ, సముద్రమునందు అరకాఁటి (అనఁగా ఓడ నడపువాఁడు) లేని యోడవలె నశించును. మఱియు;—

3. రాజు ప్రజను కాపాడును, ప్రజ రాజును వెంపొందించును; వెంపొందించుటకన్న కాపాడుట ఎక్కువపని. ఏల యన, కాపుదల లేనియెడల ఉన్నదియు లేనిదే.

ఒకప్పుడు ఆ రాజహంస విశాలమయిన తామరపూ మంచముపై సుఖముగా కూర్చుండి యుండెను. పరివారము చుట్టురాను నిలిచియుండెను. అంతట, ఏదేశమునుండియో వచ్చి దీర్ఘముఖుఁ డనెడు కొంగ నమస్కరించి కూర్చుండెను. 'దీర్ఘముఖుఁడా, దేశాంతరమునుండి వచ్చితివి, వృత్తాంతము చెప్పుము.' అని రా జడిగెను.

దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు.— స్వామీ గొప్ప వృత్తాంతము కలదు, దానిని చెప్పుటకే నేను వడిగా వచ్చితిని. వినుఁడు.— నేటిదీవియందు వింజ మను కొండ గలదు. అందు చిత్రవర్ణుఁ డను పక్షులదొర నెమలి వసించుచున్నాఁడు. అతని సేవకులు కాలిన యడవిలో సంచరించుచున్న నన్నుఁ జూచి 'నీ వెవరవు? ఎటనుండి వచ్చితివి?' అని యడిగిరి. అంతట, 'కర్పూరద్వీపపుఁ జక్రవర్తి హిరణ్యగర్భుఁ డను రాజహంస యొక్క సేవకుఁడను నేను. కుతూహలముచే దేశాంతరములు చూడవచ్చినాఁడను.' అని

నేను చెప్పితిని. ఆమాట విని ఆపక్షులు 'ఈరెండు దేశములలోను ఏది శ్రేష్ఠము? దేని రాజు శ్రేష్ఠుఁడు?' అని యడిగినవి. 'ఇసీ, ఏమి ఇట్లడిగెదరు? వార విస్తారము; ఎట్లన. కర్పూరద్వీప రెండవ స్వర్గము, హిరణ్యగర్భుఁడు రెండవ దేవేంద్రుఁడు. ఈ యెడారిలో ఉండి మీరేమి చేసెదరు? మా దేశమునకు రండి.' అని నేను వచించితిని. అంతట నామాట విని ఆపక్షు లన్నియు కోపించినవి. అట్లును చెప్పియున్నారు;—

4. పాములకు పాలు పోయుటవలన విషమే పెరుఁగును. మూర్ఖులకు హితము చెప్పుటవలన కోపమే గలుగును గాని శాంతి గలుగదు. మఱియు;—

5. తెలివి గలవానికే హితము సెప్పవలయును గాని, ఎప్పుడును మూర్ఖునికి చెప్పఁగూడదు; క్రింది కోఁతులకు హితము చెప్పి పక్షులు తమ తావు వదలుకొని పోయినవి.—

అది యెట్లని రా జడిగెను. దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు.—

కథ. ౧.

నర్మదానదియొడ్డున గొప్ప బూరుగుచెట్టు కలదు. అందు గూండ్లు కట్టుకొని పక్షులు వసించుచుండినవి. ఒకప్పుడు వర్షాకాలములో నీల మేఘములు ఆకాశము నావరించి గొప్ప జడివాన గురిసెను. అంతట చలికి వణఁకుచు చెట్టుక్రింద ఉన్నట్టి క్రోఁతులం గని పక్షులు దయాపూర్వకముగా 'ఓహో, క్రోఁతులారా, వినుండు.—

6. ముక్కుతో మాత్రమే గడ్డిపోఁచలం దెచ్చుకొని మేము గూండ్లు కట్టుకొన్నారము, చేతులు కాళ్లు లోనగు సాధనములు కలవారు మీ రేల యిట్లు నొగిలెదరు?' అని హెచ్చరించినవి.

దానిని విని క్రోఁతులు కోపావిష్టములై 'ఓహో! గాలిలేని గూండ్లలో సుఖముగానున్న యీపక్షులు మనలను హేళనము చేయుచున్నవి! కానీ, వాన వెలయనీ.' అని యాలోచించుకొన్నవి. తర్వాత ఒక క్రోఁతి యిట్లనియె.

7. 'ఓ సూదిముక్కులారా, చెడు నడవడి గలిగియు నేర్పరుల మని మనస్సులో గర్వపడుచున్న మూర్ఖులారా, మేము ఇల్లు కట్టుకొన నేరముగాని ఇల్లు కూల్ప నేర్తుము.'

తర్వాత వాన వెలసినంతట ఆ క్రోఁతులు చెట్టెక్కి గూండ్ల నన్నిటిని పాడు చేసినవి. పక్షుల గ్రుడ్లులను నేలకు దొర్లించినవి. కావున నేను 'తెలివిగల వానికే హితము చెప్పవలయును' ఇత్యాదికముం జెప్పితిని.

తర్వాత ఆ నెమళ్లు ఏమి చేసినవి?' అని రా జడిగెను. 'ఎవరు ఈ రాజహంసను రాజును చేసినవారు?' అని యవి కోపమున నడిగినవి. అందులకు నేను కోపము వచ్చి 'మీ నెమిలిని ఎవఁడు రాజుఁ జేసెను?' అని యడిగితిని. ఆమాట విని అవి యన్నియు నన్ను చంప వచ్చినవి. అంతట నేను నా శౌర్యమును రుచి చూపితిని. ఎల యన,—



కథ. ౮.

దక్షిణసముద్రముదరిని లకుముకులు రెండు ఆలును మగఁడును నివసించుచుండినవి. ప్రసవకాలము సమీపింపఁగా ఆఁడులకుముకి మగలకుముకితో 'నాథా, కానుపునకు తగిన ఏకాంతప్రదేశమును వెదకుము.' అని చెప్పెను. పోతులకుముకి 'ఓసి, ఈ చోటే కానుపునకు తగినది.' అనెను. 'సముద్రమునుండి పో టెక్కుడు చోటు గదా యిది.' అని ఆలు చెప్పెను. 'ఓసి కల్యాణీ, నే నేమి చేతఁగాని వాఁడ నని తలఁచితివా? నా యింట నుండు గ్రుడ్లను సముద్రునితరమా అపహరించుటకు?' అని మగది పలికెను. అందులకు టిట్టిభి నవ్వి 'నాథ, నీకును సముద్రునికి ఎంతయో వార, కాక,—

160. ఎక్కువ తక్కువలను యోగ్యాయోగ్యములను అరయు తెలివి ఎవనికి గలదో, ఎవనికి శాస్త్రజ్ఞానము కలదో, వాఁడు కష్టమందును చెడిపోఁడు. మఱియు;—

161. తగనిపని పూనుకొనుట, బంధువులను ద్వేషించుట, బలవంతునితో పోటి, స్త్రీలను నమ్ముట, ఈ నాలుగును చావునకు ద్వారములు.'

తర్వాత ఎట్టకేలకు మగని మాటకు లోఁబడి టిట్టిభి అటనే గ్రుడ్లు వెట్టినది. ఇదంతయు వినుచుండి సముద్రుఁడు టిట్టిభునిశక్తి నెఱుంగువాఁడై ఆగ్రుడ్లను అపహరించెను. అంతట టిట్టిభి దుఃఖపీడితయై మగనితో 'నాథా, కష్టము వచ్చినది, నాగ్రుడ్లను సముద్రుఁడు హరించినాఁడు.' అని మొఱపెట్టెను. అందులకు టిట్టిభము 'ప్రియా, భయపడకు,' అని చెప్పి పక్షులగుంపును వెంటఁ గొని పక్షినాయకుఁ డైన గరుత్మంతుని కడకు పోయి సకల వృత్తాంతమును గరుటాళువారిమ్రోల చెప్పుకొనెను.—'దేవా, సముద్రుఁడు నాయింట నున్న నాకు నా తప్పిద మేమియు లేకయే కీడు చేసినాఁడు.' ఆమాటమీఁద గరుత్మంతునిచేత అతనిదొర సృష్టి స్థితి సంహార హేతు వయిన భగవంతుఁడు నారాయణుఁడు విన్నవింపఁబడినవాఁ డై 'గ్రుడ్లు ఇచ్చివేయు' మని సముద్రుని కాజ్ఞాపించెను. అంతట భగవంతుని యాజ్ఞను శిరమునఁ దాల్చి సముద్రుఁడు గ్రుడ్లను టిట్టిభునికి సమర్పించెను. కావున నేను 'సాధకునియొక్క... సాధనము లేవో' ఇత్యాదిం జెప్పితిని.

---

162. తన శక్తికి మించినవాఁ డని తెలియక ఎవఁడు శత్రువుతో వైర మారంభించునో వాఁడు టిట్టిభమువలన సముద్రుఁడుంబోలె ఓటమి నొందును.

రా జడిగెను.—'ఇతఁడు ద్రోహబుద్ధి యని యెట్లు తెలియును?' దమనకుఁడు వెండియు బలికెను.—'ఎప్పుడు వీఁడు పొగరుతో కొమ్ముంగొనలతో పొడుచుటకు సిద్ధముగా బెదరినట్లు దగ్గఱు నూ అప్పుడు ఏలినవా రెఱుంగవచ్చును.' ఇట నిట్లు పలికి సంజీవకునితావునకుం బోయి మెల్ల మెల్లఁగా దగ్గఱి దిగులుపడినవానివోలె నగపడెను.

సంజీవకుఁడు గారవముతో 'కల్యాణుఁడా, నీవు కుశలమా?' అని యడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.—'సేవకులకు కుశల మెక్కడిది? ఏల యనఁగా,—

163. రాజులను గొలుచువారికి సంపదలు పరాధీనములు, ఎప్పుడును మనస్సునకు హాయి లేదు, తన ప్రాణమందు సయితము నమ్మకము లేదు. మఱియు;—

164. ధనములు పొంది గర్వింపనివాఁ డెవఁడు? విషయాసక్తుని కెవనికి ఆపదలు తప్పినవి? లోకములో ఎవనిమనస్సును స్త్రీలు ఖండింపలేదు? రాజులకుప్రియుఁ డెవఁడు? యమధర్మరాజుయొక్క బొమ్మన చేరని వాఁ డెవఁడు, గౌరవ మొందిన యాచకుఁ డెవఁడు? దుర్జనులవలలలో పడి క్షేమముగా తప్పించుకొని పోయినవాఁ డెవఁడు?'

'మిత్త్రుఁడా, ఇ దేమో స్పష్టముగా చెప్పుము.' అని సంజీవకుఁ డడిగెను. దమనకుఁడు పలుకుచున్నాఁడు. —'ఏమి చెప్పుదును మందభాగ్యుఁడను? చూడు.—

165. సముద్రములో మునుఁగుచున్నవాఁడు, పామును చేపట్టుగా పడసి వదలను వదలక పట్టుకొనను బట్టుకొనక యె ట్లుండునో, అట్లు ఇప్పుడు నేను ఏమియు తోఁపక యున్నాను. ఏల యన.—

166. ఆవంక ఱేని నమ్మకము చెడును, ఈవంక బంధువు నశించును, ఏమి సేయుదును? ఎందుఁ బోదును? దుఃఖసముద్రములో పడితిని.'

ఇట్లు పలికి నిట్టూర్పు నిగిడ్చి కూర్చుండెను. 'మిత్త్రుఁడా, అయినను విఱివిగా నీమనస్సులోనిదానిని చెప్పుము.' అని సంజీవకుఁ డడిగెను. దమనకుఁడు మిక్కిలి రహస్యముగా ఇట్లు చెప్పెను.—"ఱేని నమ్మకమును వెలిఁ బుచ్చఁ గూడదు సరియే, అయినను నీవు మాయందలి నమ్మకముచేత వచ్చినవాఁడవు. నేనును పరలోకము కోరినవాఁడను, కావున తప్పక నీకు హితము చెప్పవలసినవాఁడను. వినుము. ఈదొర నీమీఁద బుద్ధి మాఱి ఏకాంతమున నాతో 'సంజీవకునే చంపి నాపరివారమునకు సంతర్పణ చేసెదను' అని చెప్పినాఁడు." ఈమాట విని సంజీవకుఁడు మిక్కిలి ఖేదమును పొందెను. వెండియు దమనకుఁడు 'దుఃఖపడకు. ఇప్పటికి చేయవలసిన కార్యమును చేయుము.' అనెను.

సంజీవకుఁడు క్షణము ఆలోచించి తనలో తా నిట్లు తలపోసికొనెను—'పెద్దలు చెప్పిన యీమాట మిక్కిలి సరిగా నున్నది గదా.—

167. స్త్రీలు దుర్జనులను వలతురు, ప్రాయికముగా రాజు అయోగ్యులను ప్రోచును, ధనము లోభివానిని చేరును, ఇంద్రుఁడుఁ గొండలయందును సముద్రమందును వర్షించును. అది అట్లే;—

168. సిరి నీచుని సేవించును, సరస్వతి కులహీనుని ఆశ్రయించును, స్త్రీ అయోగ్యుని పొందును, ఇంద్రుఁడు కొండలోఁ గురియును.

ఇది దుర్జనచేష్ట యగునా కాదా యను విషయము వర్తనవలన నిర్ణయింపఁ



దరము గాదు. ఏ లన,—

169. జవరాలి కనులందు తీర్చిన మలినంపుఁ గాటుకవలె ఒకానొక దుర్జనుఁడు ప్రాపకుని ప్రభావమువలన శోభం బొందును.

(ఆలోచించి, వెల్లడిగా) 'కట్టా! ఏల యిది సంభవించినది! ఎందుల కనఁగా,—

170. ప్రయత్నపూర్వకముగా కొలిచినను రాజు సంతోషింపమి అంతగా ఆశ్చర్యముగా నుండ లేదు. ఇది ము న్నెన్నఁడు లేని వింత తెలివిగా నున్నది; ఏ దన— కొలుచుచున్నను వైరము వహించుట.

కావున ఈసందర్భము ఊహింప నలవిగాక యున్నది ;— ఎ ట్లనఁగా,—

171. కారణమును ఉద్దేశించి ఎవఁడు కోపగించునో, నిశ్చయముగా వాఁడు ఆకారణము తీఱఁగానే మన్నించును ; కారణము లేకయే ఎవని మనస్సు పగఁబట్టి యున్నదో, వానిని సంతోషపెట్ట నెవ్వనితరము ?

రాజునకు నే నేమి యపకారము కావించితిని? అ ట్లగుడుగ నేల? నిమిత్తము లేకయు రాజులు చెఱుపు చేయుదురు ?'

దమనకుఁడు పలుకుచున్నాఁడు.—'ఇది యిట్లు. వినుము.—

172. భావమందు నిలుకడలేని ప్రభువులకు, విశేషజ్ఞులును మిత్త్రులును అయిన కొందఱు చేసిన యుపకారమువలన సయితము ద్వేషమే కలుగును ; ప్రత్యేకముగా మఱి కొందఱు అపకారమే చేసినను ప్రీతి కలుగును. వారి చరిత్రము చిత్రమా మఱియుం జిత్రమా! సేవాధర్మము కేవలము దుర్బోధము; దాని తత్త్వము యోగులకు సయితము తెలియదు. మఱియు ;—

173. దుర్జనులకు చేసిన నూఱు ఉపకారములు నష్టము; అపండితులకు చెప్పిన నూఱు సూక్తులు నష్టము; చేయుమన్నట్లు చేయనివారికి చెప్పిన నూఱు మాటలు నష్టము; ప్రాణము లేని మొద్దునకు నేర్పిన నూఱు బుద్ధులు నష్టము. మఱియు ;—

174. గంధపు మ్రాఁకులందు పాము లుండును ; కమలములుగల నీళ్లలో మొసళ్లు ఉండును; సుఖానుభవమందలి గుణమును దుర్జనులు పోఁగొట్టుదురు; సుఖములకు విఘ్నములు రాకమానవు. మఱియు ;—

175. గంధపుఁజెట్టులో—వేళ్లను పాములును, పువ్వును తుమ్మెదలును, కొమ్మను కోఁతులును, కొనను పక్షులును ఆశ్రయించును; అందులో అతిదుష్టము లయిన ఘాతుక ప్రాణులు ఆశ్రయింపనిది ఏభాగమును లేదు.'

సంజీవకుఁడు పలికెను.—ఈస్వామికి ఏమో నోఱు తీపును మనస్సు విషమును అని నాకు ఎఱుఁగనయినది. ఏల యన.—

176. దూరమునుండి చే యెత్తుట, కన్నులు తడి యగుట, తన యాసనమందు

సగము చోటు సేయుట, బిగ్గఁ గవుంగిలింప నాసక్తి వహించుట, ఇష్టమును చెప్పుట యందును అడుగుటయందును ఆదరము పూనుట, కడుపులో విసము బయట తేనెయు, మాయలో కడు నేర్పు;— ఈయపూర్వ నాటకప్రకారము దుర్జనులు ఎక్కడ నేర్చినారో! అట్లే గదా,—

177. దాఁట నలవిగాని సముద్రమును దాఁటుటకు ఓడ, చీఁకటి పడు వేళకు దీపము, గాలి లేనిచోట వీవన, మదముచే కన్ను దెలియని యేనుఁగుల పొగరణఁచుటకు అంకుశము;— ఈ విధముగా భూలోకములో బ్రహ్మదేవుఁడు ఉపాయ మరయని దేదియు లేదు. దుర్మార్గులయొక్క చిత్తవృత్తిని హరించు ప్రయత్నములో బ్రహ్మయు భంగమొందినాఁ డని నా తలంపు.'

సంజీవకుఁడు వెండియు నిట్టూర్పు పుచ్చి— 'అయ్యయో! పైరు మేపరిని నన్ను సింహము పరిమార్చుట ఏటిపని! ఏలయన,—

178. ఏ యిరువురకు ధనము సమానమో, ఏ యిరువురకు బలము సమానమో, ఆ యిరువురకును వివాదము తగును గాని, ఉత్తమునికిని అధమునికిని ఎప్పుడును తగదు.

(మరల ఆలోచించి) నామీఁద రాజునకు ఎవరుకోపము తెప్పించినారో తెలియఁజాలకున్నాను. భేద మొందిన రాజువలన నెప్పుడును భయపడవలసినది. ఏల యన,—

179. విఱిగిన స్ఫటికపుఁగడియమును మరల ఎవ్వఁడును ఎట్లు అదుకలేఁడో, అట్లే మంత్రి విఱిచిన దొరమనస్సును ఎందును ఎవఁడును అదుక నేరఁడు. మఱియు;—

180. పిడుగును రాజతేజమును ఈరెండును అతిభయంకరములు; ఒకటి ఒడి చోటనే పడును, కడమది అంతటను పడును.

కావున పోరిలో చచ్చుటయే మేలు. ఇపుడు ఆతని యాజ్ఞను అనువర్తించుట సరి గాదు. ఏల యనఁగా,—

181. పోరిలో చచ్చి స్వర్గమునకుఁ బోవు నొండె, శత్రువును గూల్చి సుఖంబులం బడయు నొండె; ఈరెండును శూరులకు మిక్కిలి దుర్లభము లయిన శ్రేయములు.

ఇదియును యుద్ధమునకు కాలము.—

182. ఎప్పుడు పోర కున్నను చావు నిక్కమో, పోరిలో చావు సందియమో, దానినే పోరికి కాల మని పెద్దలు చెప్పుదురు. అది యెట్లనఁగా,—

183. ఎప్పుడు పోరకున్న తనకు ఏమేలును కనఁబడదో, అనఁగా చావు తప్పదో, అప్పుడు తెలివిగలవాఁడు పోరి శత్రువుతోఁగూడ చచ్చుట మంచిది;

184. ఒకవేళ ఆపోరిలో తాను జయించెనా సిరిని పొందును; చచ్చెనా సురస్త్రీని పొందును; దేహములు క్షణములో నశించునవి, కనుక మరణవిషయమున యుద్ధవిషయమునను ఆలోచన ఏల?'



ఇట్లాలోచించుకొని సంజీవకుఁడు 'మిత్త్రుఁడా, ఇతఁడు నన్నుఁ జంప నుంకించుట ఎట్లు తెలియును?' అని యడిగెను. దమనకుఁడు చెప్పుచున్నాఁడు.— 'ఎప్పు డతఁడు చెవులు నిక్కఁబొడుచుకొని తోఁక యెత్తి కాలెత్తి నోరు తెఱచుకొని నిన్ను చూచునో, అప్పుడు నీవే నీపరాక్రమమును చూపుదువు. ఏల యన,—

185. బలవంతు డయినను తేజోహీనుని ఎవరు పరాభవింపరు? లోకులు బూడిద ప్రోగుమీఁద నిర్భయముగా అడుగు వెట్టుదురు.

కాని, ఇదియెల్ల పరమరహస్యముగా చేయవలసినది, రహస్యము బయలు పడెనేని నీవు ఉండవు, నేను ఉండను.'

ఇట్లు చెప్పి దమనకుఁడు కరటకునికడకుఁ బోయెను. 'ఏమి జరిగినది?' అని కరటకుఁ డడిగెను. 'ఇదె ఒండొరులనుండి వేఱుబందము నివ్వటిల్లినది.' అని దమనకుఁడు చెప్పెను. కరటకుఁ డనియె.—'ఇందు సందేహ మేమి? ఏ లన,—

186. దుష్టులకు మిత్త్రుఁ డెవఁడు? యాచించిన కోపగింపనివాఁ డెవఁడు? ధనముచే తృప్తి పొందువాఁ డెవఁడు? తప్పుపనిలో నేర్పరి కానివాఁ డెవఁడు? మఱియు;—

187. మోసగాండ్రు తమ పెంపుకొఱకు ఐశ్వర్యవంతుని తప్పుమార్గములోఁ ప్రవేశపెట్టుదురు. తాను ఎందున్నదో దానిని తినునదైన అనఁగా కాల్చునదైన నిప్పువలె దుర్జనులతోడి కూడిక ఏమి చేయదు!'

తర్వాత దమనకుఁడు పింగళకునికడకుం బోయి 'స్వామీ' ఆపాపాత్ముఁడు వచ్చినాఁడు, ఏలినవారు సిద్ధపడి యుండవలయును.' అని చెప్పి మున్ను చెప్పినరూపున నుండఁజేసెను. సంజీవకుఁడును వచ్చి, ఆతీరున సింహము ఆకారము మాఱి యుండుటం గాంచి తనకు తగినట్లు పరాక్రమించెను. ఆరెంటిపోరిలో సంజీవకుఁడు సింహముచేత పడిసెను. అంతట సేవకుఁ డయిన సంజీవకునిం జంపి పింగళకుఁడు దుఃఖాక్రాంతుఁడుగా నుండి ఇట్లు వక్కాణించెను. 'ఏల నేను క్రూరకృత్యము చేసితిని! ఎట్లన,—

188. సింహము ఏనుఁగును చంపి మృగరాజకీర్తిని పొందుటయందు చంపుట తనవంతును మాంసము తనపరివార మగునక్కలు లోనగుజంతువుల వంతును ఎట్లో అట్లే లోకములో ధర్మము మీఱినపాతకము రాజువంతును, రాజ్యభోగములు పరివారము వంతును.

189. సారవంత మయిన భూభాగము నశించుటలోను బుద్ధిమంతుఁ డయిన సేవకుఁడు నశించుటలోను, తారతమ్య మున్నది; సేవకుఁడు నశించిన రాజు నశించును, భూభాగము పోయినను మరల సులువుగా దొరకును, సేవకులు దొరకరు.'

దమనకుఁడు ఇట్లనియె;—'స్వామీ, ఇదేమో క్రొత్తన్యాయముగా నున్నది; ఏ దనఁగా శత్రువును చంపి వగచుట. ఇట్లే చెప్పియున్నారు;—

190. తండ్రిగాని, భ్రాతగాని, కొడుకుగాని, మిత్త్రుఁడుగాని, తనప్రాణమును హరింపం గడంగిరేని, ఐశ్వర్యము గోరెడురాజు వారిని చంపవలయును. ఇంతియగాక;—

191. ధర్మము అర్థము కామము అను పురుషార్థముల స్వరూపమును ఎఱిఁగినవాఁడు కేవలము జాలినే వహింపఁ గూడదు; ఏలయన, ఓర్చెడువానిని వానిచేతిలోని యన్నమును కూడ తిన నీరు. ఇంక నేమన,—

192. శత్త్రుమిత్త్రులయందు సమముగా ఓర్పు వహించుట యతులకు అలంకారము. తప్పిదములు సేయుజంతువులయెడ ఓర్పు వహించుట రాజులయందు దోషము. మఱియు,—

193. దొరతనమునకై ఆశించి అహంకరించి తేని పదవిని కోరువానికి ఒకటియే ప్రాయచ్చిత్తము; ఏదన, ప్రాణము వదలుటయే; వేఱుప్రాయశ్చిత్తము లేదు. మఱియు;—

194. జాలిగుండె గలరాజును, సర్వమును తినుబ్రాహ్మణుని, స్వాతంత్రురా లయిన స్త్రీని, దుష్టస్వభావుఁ డగుతోడును, ఎదురు తిరిగెడు సేవకుని, పరాకుపడు వట్టి యధికారిని, చేసినమేలు తలంపనివానిని—ఈ యేడుగురను వదలవలయును.

194. వేశ్యాంగన, సమయోచితముగా, నిజ మాడుటగాను కల్లలాడుటగాను, పరుసము లాడుటగాను ఇచ్చకములు పలుకుటగాను, క్రూరముగాను కనికరముగాను, పిసినిడితనముతోను ఈవితోను, సదా వెచ్చముతోను సదా మిక్కిలి రాఁబడితోను, పెక్కు తీరులుగా నుండును; అట్లే రాజనీతియు నుండును.'

ఇట్లు దమనకుఁడు సమాధానపెట్టఁగా పింగళకుఁడు స్వస్థమానసుఁడై గద్దియపై కూర్చుండెను. దమనకుఁడు 'మహారాజా సర్వోత్కృష్టుఁడుగా నుండుఁగాక, సకల లోకములకును మంగళ మగుఁ గాక' అని పలికి సుఖముగా కూర్చుండెను.

విష్ణుశర్మ 'రాజపుత్త్రులారా, మీ రిపుడు మిత్త్రభేదమును వింటిరి.' అని హెచ్చరించెను. నీ యనుగ్రహమున విని మేము సుఖము పొందినారము' అని రాజపుత్త్రులు చెప్పిరి. విష్ణుశర్మ యనియె —'అయినను ఇదియు నగుఁగాక.

196. మిత్త్రులవేఱుపాటు మీ శత్రువులయింట అగుఁగాక, ఖలులు యమునిచే లాగఁబడినవారై ప్రతిదినము నశింతురుగాక, నిత్యము జనులు సకల సుఖసంపదలను ఉనికిప ట్లగుదురుగాక, మనోహర మయిన యీకథా క్రమమును విని సర్వదా బాలురు సైతము ఆనందింపుదురుగాక.

సుహృద్భేదము సమాప్తము.

---

# హితోపదేశము.



## విగ్రహము.

---

మరల కథ యారంభించు తఱిని రాజకుమారులు 'అయ్యా, మేము రాజకుమారులము గాన విగ్రహతంత్రమును వినఁ గోరుచున్నాము.' అనిరి. విష్ణుశర్మ యనియె.— 'మీకు ఇచ్ఛ యున్నది గాన చెప్పెదను. విగ్రహమును వినుఁడు, అందు ఇది మొదలి శ్లోకము.—

1. హంసలతో నెమళ్లకు ఇరుపార్శ్వములందును సమానపరాక్రమము గల పోరు పొసఁగఁగా, నెమళ్లపంపున కాకులు పగతుర యింట చేరి నమ్మించి జయించినవి.'

'అది యెట్లో చెప్పుఁడు.' అని రాకుమారులు అడిగిరి. విష్ణుశర్మ ఇట్లు చెప్పెను.

కర్పూరద్వీపమందు పద్మకేళి యని సరస్సు కలదు. అందు హిరణ్య గర్భుఁ డని రాయంచ వసించుచుండెను. దానిని నీటిపక్షు లన్నియు చేరి పక్షిరాజ్యమునకు పట్టాభిషేకము చేసినవి. ఏల యన,—

2. చక్కఁగా ఏలునట్టి రాజు లేని యెడల, ప్రజ, సముద్రమునందు అగకాటి (అనఁగా ఓడ నడపువాఁడు) లేని యోడవలె నశించును. మఱియు;—

3. రాజు ప్రజను కాపాడును, ప్రజ రాజును వెంపొందించును; వెంపొందించుటకన్న కాపాడుట ఎక్కువపని. ఏలయన, కాపుదల లేనియెడల ఉన్నదియు లేనిదే.

ఒకప్పుడు ఆ రాజహంస విశాల మయిన తామరపూ మంచముపై సుఖముగా కూర్చుండి యుండెను. పరివారము చుట్టురాను నిలిచియుండెను. అంతట, ఏదేశమునుండి యో వచ్చి దీర్ఘముఖుఁ డనెడు కొంగ నమస్కరించి కూర్చుండెను. 'దీర్ఘముఖుఁడా, దేశాంతరమునుండి వచ్చితివి, వృత్తాంతము చెప్పుము.' అని రా జడిగెను.

దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు.— స్వామీ గొప్ప వృత్తాంతము కలదు, దానిని చెప్పుటకే నేను వడిగా వచ్చితిని. వినుఁడు.— నేరేటిదీవియందు వింజ మని కొండ గలదు. అందు చిత్రవర్ణుఁ డను పక్షులదొర నెమలి వసించుచున్నాఁడు. అతని సేవకులు కాలిన యడవిలో సంచరించుచున్న నన్నుఁ జూచి 'నీ వెవరవు? ఎటనుండి వచ్చితివి?' అని యడిగిరి. అంతట, 'కర్పూరద్వీపపుఁ జక్రవర్తి హిరణ్యగర్భుఁ డను రాజహంస యొక్క సేవకుఁడను నేను. కుతూహలముచే దేశాంతరములు చూడవచ్చినాఁడను.' అని

నేను చెప్పితిని. ఆమాట విని ఆపక్షులు 'ఈరెండు దేశములలోను ఏది శ్రేష్ఠము? దేని రాజు శ్రేష్ఠుఁడు ?' అని యడిగినవి. 'ఇదీ, ఏమి ఇట్లడిగెదరు ? వాని విస్తారము; ఎట్లన. కర్పూరద్వీపి రెండవ స్వర్గము, హిరణ్యగర్భుఁడు రెండవ దేవేంద్రుఁడు. ఈ యెడారిలో ఉండి మీ రేమి చేసెదరు ? మాదేశమునకు రండి.' అని నేను వచించితిని. అంతట నామాట విని ఆపక్షు లన్నియు కోపించినవి. అట్లును చెప్పియున్నారు;—

4. పాములకు పాలు పోయుటవలన విషమే పెరుఁగును. మూర్ఖులకు హితము చెప్పుటవలన కోపమే గలుగును గాని శాంతి గలుగదు. మఱియు;—

5. తెలివి గలవానికే హితము సెప్పవలయును గాని, ఎప్పుడును మూర్ఖునికి చెప్పఁగూడదు; క్రింది కోఁతులకు హితము చెప్పి పక్షులు తమ తావు వదలుకొని పోయినవి.—

అది యె ట్లని రా జడిగెను. దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు.—

కథ. ౧.

నర్మదానదియొడ్డున గొప్ప బూరుగుచెట్టు కలదు. అందు గూండ్లు కట్టుకొని పక్షులు వసించుచుండినవి. ఒకప్పుడు వర్షాకాలములో నీల మేఘములు ఆకాశము నావరించి గొప్ప జడివాన గురిసెను. అంతట చలికి వణఁకుచు చెట్టుక్రింద ఉన్నట్టి క్రోఁతులం గని పక్షులు దయాపూర్వకముగా 'ఓహో, క్రోఁతులారా, వినుండు.—

6. ముక్కుతో మాత్రమే గడ్డిపోఁచలం దెచ్చుకొని మేము గూండ్లు కట్టుకొన్నారము, చేతులు కాళ్లు లోనగు సాధనములు కలవారు మీ రేల యిట్లు నొగిలెదరు ?' అని హెచ్చరించినవి.

దానిని విని క్రోఁతులు కోపాక్రాంతములై 'ఓహో ! గాలిలేని గూండ్లలో సుఖముగానున్న యీపక్షులు మనలను హేళనము చేయుచున్నవి ! కానీ, వాన వెలయనీ.' అని యాలోచించుకొన్నవి. తర్వాత ఒక క్రోఁతి యి ట్లనియె.

7. 'ఓ సూదిముక్కులారా, చెడు వడవడి గలిగియు నేర్పరుల మని మనస్సులో గర్వపడుచున్న మూర్ఖులారా, మేము ఇల్లు కట్టుకొన నేరము గాని ఇల్లు కూల్ప నేర్తుము.'

తర్వాత వాన వెలసినంతట ఆ క్రోఁతులు చెట్టెక్కి గూండ్ల నన్నిటిని పాడు చేసినవి. పక్షుల గ్రుడ్లులను నేలకు దొర్లించినవి. కావున నేను 'తెలివిగల వానికే హితము చెప్పవలయును' ఇత్యాదికముం జెప్పితిని.

'తర్వాత ఆ నెమళ్లు ఏమి చేసినవి ?' అని రా జడిగెను. 'ఎవరు ఈ రాజహంసను రాజును చేసినవారు ?' అని యవి కోపమున నడిగినవి. అందులకు నేను కోపము వచ్చి 'మీ నెమిలిని ఎవఁడు రాజుం జేసెను?' అని యడిగితిని. ఆమాట విని అవి యన్నియు నన్ను చంప వచ్చినవి. అంతట నేనును నాశౌర్యమును రుచి చూపితిని. ఏల యన,—



8. ఇతరసమయములయందు పురుషులకు ఓర్పు స్త్రీలకు లజ్జవలె అలంకారము, స్త్రీలకు కామక్రీడయందు దిట్టతన మెట్లు అలంకారమో, అట్లు పురుషులకు అవమానము కలిగినప్పుడు శౌర్యము అలంకారము.—

రాజు నవ్వి యి ట్లనియె;—

9. 'తనయొక్కయు ఇతరులయొక్కయు బలాబలమును చూచియు ఎవఁడు తారతమ్యము నెఱుఁగఁడో వాఁడు శత్రువులవలన తిరస్కార మొందును. మఱియు,—

10. చిరకాలము పొలములో ప్రతిదినము పైరు మేయుచుండి పులితోలు గప్పిన గాడిద నోటిక్రొవ్వుచేత నాశ మొందినది.'

అది యె ట్లని కొంగ యడుగఁగా, రాజు చెప్పందొడంగెను.

కథ. ౨.

హస్తినాపురమందు విలాసుఁ డని చాకలి యుండెను. వాని గాడిద అమితముగా మోచిమోచి సత్తువ పోయి చావుదశకు వచ్చినది. అంత నాచాకలి ఆగాడిదను పులితోలుఁగప్పి కాటివెంబడి పైరుపొలములో నిలిపెను. అంతట దానిని దూరమునుండి కని పొలముకాఁపులు పులి యనుకొని వడిగా పాఱిపోవుచుండిరి. గాడిద పైరు మేసి దిన దినమునకు ఒడలెల్ల బలిసిన దాయెను. ఇట్లు జరుగుచుండఁగా ఒకప్పుడు పొలముకాఁపు ఒకఁడు బూడిదవన్నె కంబళితో చేసిన కవచము దాల్చి విల్లును అమ్మును సిద్ధము చేసికొని ఏకాంతమున నుండెను. వానిని దూరమున నే కాంచి గాడిద ఓండ్రపెట్టుచు వానికేసి పరుగెత్తినది. అది గాడిద యని పొలముకాఁపు తెలిసికొని ఆటగానే దానిని చంపెను.—

కావున 'చిరకాలము పొలములో' లోనగుదానిని నేను చెప్పితిని.

---

దీర్ఘముఖుఁడు చెప్పుచున్నాఁడు.— 'ఓరి పాపీ, పాడుకొంగా, మాభూమిలో తిరుగుచు మా యేలినవారిని దూషించెదవా? దానిని మేము ఇపుడు క్షమింపము.' అని పలికి ఆపక్షు లన్నియు నన్ను ముక్కులతో పొడిచి కోపమున వచించినవి.— 'మూఢరా మూర్ఖుఁడా, ఆహంస నీదొర ఎల్లవిధములను మెత్తనివాఁడు. వానికి ఏలుటకు యోగ్యతయే లేదు. ఏల యన, కేవలమ్మృదువు చేతిలోని ధనమునుకూడ కాపాడుకో నేరఁడు. అట్టివాఁడు పుడమి నేలుట యెక్కడిది? వానికి దొరతన మెక్కడిది? మఱి నీవో నూతిలోనికప్పవు సముఁడవు. కావున వానిని కొలువు మని మాకు నేర్పవచ్చితివి. విను;—

11. పండ్లును నీడయు కలదైన గొప్పచెట్టును ఆశ్రయింపవలయును; విధివశమున పండు లేకపోయినా నీడను ఎవరు తప్పింతురు ? మఱియు;—

12. నీచులను గొలువఁగూడదు, గొప్పవారిని కొలువవలయును; కల్లమ్ముదానిచేత పా లున్నను కల్లనియే చెప్పుదురు. మఱియు;—

13. అయోగ్యునితో నిముసమేనియు నిలువఁగూడదు, పోఁగూడదు; దుష్టుల సాంగత్యము మరణము; సజ్జనసాంగత్యము మందు. మఱియు;—

14 * ఆధారాధేయభావముచేత అద్దములో మహాగజమువలె ఎంతటి గుణబాహుళ్య మయినను గుణహీనునియందు కొంచెపడును. ముఖ్యముగా;—

15. రాజు అతిసమర్థుఁడగునేని అతనిపేరు చెప్పుకొన్నమాత్రాననే కార్యము నెఱవేఱును; చంద్రునిపేరిచేత కుందేళ్లు సుఖముగా నున్నవి.'

'అదెట్లు?' అని నేనడుగఁగా పక్షు లిట్లు చెప్పినవి.—

కథ. 3.

ఒకానొకప్పుడు వర్షాకాలములో సయితము వాన కురియనందున దప్పికి తాళలేక ఏనుఁగుపిండు పరికానితో నిట్లు చెప్పుకొనెను.—'దొరా, మాకు జీవనోపాయ మేమి? క్షుద్రజంతువులకుఁ గూడ స్నానమునకు చోటు లేదు. మేము స్నానము లేనందున గ్రుడ్డివారముంబోలె నున్నాము. ఎటకుఁ బోదుము? ఏమి సేయుదుము?' అంతట ఏనుఁగుదొర ఒకపాటిదూరము పోయి నిర్మలమయిన చెఱువును చూపినది. దానిదరిని నివసించియున్న కుందేళ్లు ఏనుఁగుగుంపుయొక్క కాళ్లదెబ్బలకు నలినలియైనవి. అంతట శిలీముఖమను పేరి కుందేలు ఇట్లు ఆలోచించెను.—'ఈ యేనుఁగుపిండు దప్పికి కలఁగి ప్రతిదినమును ఇటకు వచ్చెడిని. అందుచేత మనకులమే నశించును.' అందులకు విజయుఁడను ముదికుందేలు 'ఖేదపడకుఁడు, నేను ఇందులకు ప్రతిక్రియ చేసెదను.' అని ప్రతిజ్ఞ చేసి తరలెను. పోవుచు ఆకుందేలు దారిలో ఆలోచించెను. 'ఏనుఁగుపిండుకడ నిలిచి నే నేమి సేయఁగలను? ఏలన;—

16. ఏనుఁగు తాఁకుచునే చంపును, పాము మూర్కొనుచునే చంపును, రాజు రక్షించుచునే చంపును, దుర్జనుఁడు నవ్వుచునే చంపును.

మఱి నేను కొండకొమ్మున కెక్కి పరికానితో పలికెదను.' అట్లే చేయఁగా పరికాఁడు 'ఎవరవు నీవు? ఎటనుండి వచ్చితివి?' అని యడిగెను. కుందేలు 'నేను దూతను, చంద్రభగవానుఁడు పంపఁగా వచ్చితిని.' అనెను. వచ్చినపని చెప్పుమని పరికాఁ డడిగెను. విజయుఁడు చెప్పుచున్నాఁడు.—

17. తనమీఁదికి కత్తుల నెత్తినను దూత అసత్యము పలుకఁడు. ఎప్పుడును దూతను చంపఁగూడదు గావున దూత యథార్థమునే చెప్పును.

కావన నేను నాదొర యగు చంద్రునియాజ్ఞచేత చెప్పుచున్నాను వినుము.—'చంద్రసరస్సునకు కాపున్నట్టి యీకుందేళ్లను నీవు వెడలఁగొట్టితివి; అది మంచిపని గాదు. ఏల యన, వానిని నేను కాపాడుచున్నాను. అందుననే నాకు శశి యని పేరు.' రాయ

* ఒకవస్తువు దేనియం దుంపఁబడునో అది ఆధారము; ఉ. దొన్నె. అయుంపఁబడు వస్తువు ఆధేయము. ఉ. నేయి.



బారి యిట్లు పలుకఁగా, పరికాఁడు వెఱపున నిట్లనియె.—'ఇది నేను తెలియక చేసితిని. ఇక మరల నిటకు రాను.' దూత చెప్పెను.—'మఱి ఈచెఱువులో కోపముచేత కంపించుచున్న చంద్రభగవానులను ప్రణమిల్లి అనుగ్రహింపఁజేసికొని పొమ్ము.' తర్వాత ఆకుందేలు పరికానిని రాత్రి తోడ్కొని వచ్చి నీటిలో చలించుచున్న చంద్రప్రతిబింబమును చూపి నమస్కారము చేయించి; 'స్వామీ, ఈతఁడు తెలియక చేసినతప్పిదమును క్షమింపుఁడు' అని వచించి పరికానిని పంపివైచెను. కావున నేను 'రాజు అతిసమర్థుఁడేని' ఇత్యాదికముం జెప్పితిని.

---

అంతట నేను చెప్పిన దేమనఁగా—'ఆ మాయేలికయే మహాప్రతాపము గలవాఁడు, అతిసమర్థుఁడు, ఈ మూఁడు లోకములను ఏలుటకు అతఁడే తగినవాఁడు.' అంతట నన్ను ఆపక్షులు కట్టి 'మాదేశములో నీవెట్లు సంచరించెదవు?' అని పలికి వారిరాజు చిత్రవర్ణునికడకుం గొనిపోయినవి. రాజుమ్రోల ఆపక్షులు ప్రణమిల్లి నన్నుఁగూర్చి యిట్లు చెప్పినవి.—'ప్రభూ, చిత్తగింపవలయును. ఈ చెడుకొంగ మనదేశములో తిరుగుచుండియు ఏలినవారిని నిందించుచున్నది.' 'ఎవరు వీఁడు, ఎటనుండి వచ్చినాఁడు?' అని రాజడిగెను. 'వీఁడు హిరణ్యగర్భుఁడను రాయంచకు సేవకుఁడు, కప్పురదీవినుండి వచ్చినాఁడు.' అని వారు చెప్పిరి. అంత మంత్రి గద్ద 'అచట ముఖ్యమంత్రి యెవఁడు?' అని నన్నడిగెను. 'సర్వశాస్త్రపారీణుఁడు సర్వజ్ఞుఁడను పేరి జక్కవ' అని నేను చెప్పితిని. 'తగును, ఈతఁడు మీరాజునకు స్వదేశమువాఁడుగదా.' అని గద్ద చెప్పెను. ఏల యన,—

18, 19. తనదేశమువాఁడును, కులమందును నడవడియందును శుచియు, హితుఁడని రూఢికెక్కినవాఁడును, శాస్త్రములు చదివినవాఁడును, జూదము లోనగు దురభ్యాసములు లేనివాఁడును, తప్పుదారిని త్రొక్కనివాఁడును, వ్యవహారస్వరూపమును చదివినవాఁడును, ప్రసిద్ధుఁడును, వంశపరంపరగా వచ్చినవాఁడును, విద్వాంసుఁడును, ధనమును చక్కఁగా పుట్టించువాఁడును, అగువానిని రాజు మంత్రిగా నుంపవలయును.'

ఇంతలో చిలుక యిట్లనియె.—'స్వామీ, కప్పురదీవి లోనగు నవి చిన్నదీవులు జంబూద్వీపములో చేరినవే. వానిమీఁదఁ గూడ ఏలినవారికి దొరతనము కలదు.' అంతట రాజు 'అవును, అట్లే.' అని పలికెను. ఏల యన,—

20 రాజు, కైపెక్కినవాఁడు, శిశువు, వెఱ్ఱివాఁడు, ధనముచే గర్వ మెక్కినవాఁడు,— వీరు దొరకనిదానిని కోరుదురు, దొరకుదానిమాట మఱి చెప్పవలయునా?

'మాటమాత్రాననే దొరతనము కలిగెడునెడల, ఆపక్షమందు మాదొర హిరణ్యగర్భునికి జంబూద్వీపముమీఁద కూడ దొరతనము కలదు.' అని నేను వచించితిని. 'ఇందులకు నిర్ణయ మెట్లు?' అని చిలుక యడిగినది. 'యుద్ధముననే' అని నేను పలికితిని. రాజు

నవ్వుచు 'ఓయి, పోయి నీదొరను సిద్ధపఱుపుము.' అనెను. 'మీ దూతను కూడ పంపుఁడు' అని నేను అంటిని. రాజిట్లనియె.—దూతగా ఎవనిని పంపుదము. ఏలయన, ఎట్టివాఁడు దూతగా పంపఁదగినవాఁ డనఁగా;—

21. రాజభక్తుఁడు, గుణవంతుఁడు, పవిత్రుఁడు, సమర్థుఁడు, ప్రతిభ గలవాఁడు, జూదము లోనగు వ్యసనములు లేనివాఁడు, ఓర్పు గలవాఁడు, బ్రాహ్మణుఁడు, పైవారి రహస్యము నెఱిఁగినవాఁడు, సమయోచితప్రజ్ఞ గలవాఁడు.'

గద్ద యిట్లనియె;—'ఉన్నారు దూతలనేకులు; అయినను బ్రాహ్మణునే దూతగా పంపవలయును. ఏలయన,—

22. దొరకు అనుగ్రహము చేయును, తనకు ఐశ్వర్యమును కోరఁడు; మహేశ్వరుని చేరినను కాలకూటము తన నలుపును కోలుపోయినది గాదు.'

'అటయిన చిలుకయే చనునుగాక; చిలుకా, నీవే యీతనితోఁ గూడ నేఁగి మా యిష్టమును చెప్పి రమ్ము.' అని రాజు ఆజ్ఞాపించెను. చిలుక యిట్లనియె.—'ఏలినవారి యాజ్ఞప్రకారము చేసెదను. కాని యీ కొంగ దుర్మార్గుఁడు; దుర్మార్గునితో నెప్పుడును నేను పోను. పెద్దలు అట్లే చెప్పియున్నారు.—

23. ఖలుఁడు చెడునడత నడుచును, అందుల ఫల మగు కీడు సాధువులకు మూఁడును. రావణుఁడు సీతను హరించెను, సముద్రమునకు కట్టు కలిగినది. మఱియు;—

24. దుర్జనునితో కూడ ఉండఁగూడదు, పోఁగూడదు; కాకితోఁ గూడ ఉండి హంసయు, పోయి పెలిచెపిట్టయు చచ్చినవి.'

అది యెట్లని రాజడిగెను. చిలుక చెప్పందొడంగెను.

## కథ. ౪.

ఉజ్జయినికి పోయెడి యడారిదారిలో గొప్ప రావిచెట్టు ఉన్నది. దానిమీఁద హంసయు కాకియు కాఁపుర ముండినవి. ఒకప్పుడు వేసవికాలములో బాటసారి యొకఁడు బడలి ఆ చెట్టుక్రింద విల్లునమ్ములు నుంచి నిద్రించెను. తర్వాత క్షణములో వాని మొగముమీఁదినుండి నీడ తొలఁగి పోయెను. అంతట వాని మొగముపై ఎండ పర్వి యుండఁగా చూచి కనికరించి చెట్టుమీఁది హంస ఱెక్కలు విప్పి నీడఁ కలుగఁ జేసెను. అతఁడు చక్కఁగా నిద్రించి ఆసుఖముచేత నోరు తెఱచి ఆవులించెను. అంతట ఒరుల సుఖమును చూడ నొల్లనిదైన కాకి తన స్వాభావిక దౌష్ట్యముచేత అతని నోట రెట్ట వైచి ఎగిరి పోయెను. అంత నాతఁడు లేచి పైని చూడఁగా హంస యగపడుడు దానిని కోలనేసి చంపెను. ఏలయన,—

25. 'దుర్జనుల సంగాతమును త్యజింపుము, సాధువుల కూటమిని భజింపుము,



రేయుంబవలు పుణ్యము చేయుము, ఎప్పుడును నశ్వరత్నమును తలంచుచుండుము.'

మహారాజ పెలిచెకథం జెప్పెద.

## కథ. ౫.

ఒకప్పుడు పక్షు లన్నియు గరుత్మంతునికి జాతర సేయుటకై సముద్రముదరికి తరలినవి. అందు కాకితోఁ గూడ పెలిచెపిట్ట పోవుచుండినది, దారిలో గొల్లవాఁ డొకఁడు పోవుచుండఁగా వాని నెత్తిమీఁది పెరుఁగుకుండలోని పెరుఁగును కాకి మాటి మాటికి త్రాగుచుండినది. అంతట వాఁడు పెరుఁగుకుండ నేలఁబెట్టి మీఁద చూడఁగా కాకియు పెలిచెయు నగపడినవి. వానికి బెదరి కాకి ఎగిరి పోయినది. తనయందు తప్పు లేమిచేతను మెల్లఁగా పోవు స్వభావము గలది కావునను పెలిచె వానికి దొరకి చంపఁబడెను. కావున నేను 'దుర్జనునితోఁ గూడ' ఇత్యాదికముం జెప్పితిని.

---

అంతట నేనిట్లంటిని.—'అన్నా, చిలుకా, ఏల యిట్లు పలికెదవు? నాకు శ్రీమంతులు ఏలినవారు ఏట్లో నీవును అట్లే.' శుకము చెప్పెను.—'అగుఁగాక. అయినను;

26. దుర్జనులు చెప్పుమాటలు చిఱునవ్వుతోఁగూడి ప్రియముగా నున్నను అకాలమందు పూచిన పూవులవలె నాకు భయమునే కలిగించును.

నీవు దుర్జనుఁడ వని నీమాటలధోరణిచేతను ప్రత్యక్ష మయినది. ఎట్లన, ఈ రాజుల కిరువురకు పోరు పొసఁగినందులకు నీమాటయే మూలకారణము. చూడు.

27. ప్రత్యక్షముగా నే తప్పు చేసినను మూర్ఖుఁడు మంచి మాటలకు సంతోషించును. వడ్రంగి మిండనితోఁగూడి యున్న తనపెండ్లామును నెత్తిని బెట్టుకొని మోచెను.'

అది యెట్లని రాజడుగఁగా చిలుక పలుకం దొడంగెను.—

## కథ. ౬.

శ్రీనగరమందు మందమతి యని వడ్రంగి యుండెను. వానికి తనభార్య చెడిప యని తెలిసినది, కాని మిండనితోఁ గలసియుండఁగా తనకంటితో చూడలేదు. అందువలన వడ్రంగి పొరుగూరికి పోయెద నని చెప్పి తరలి కొంచెము దూరము పోయి మరల వచ్చి తనయింట మంచముక్రిందఁ దూఱి దాఁగి యుండెను. మఱి యా చెడిప మగఁడు గ్రామాంతరము పోయె నని నమ్మి జారుని సంజప్రొద్దున పిలిచి తెచ్చినది. తర్వాత వానితోఁ గూడ మంచముపై యథేష్టముగా క్రీడించుచుండెను. మంచముక్రింద కొంచెము ఒడలి తాఁకువలన తనపతియే యని తెలిసికొని దిగులుపడెను. అంతట జారుఁడు 'ఏల నాతో వెల్లుగా క్రీడింపవు? దిగులొందిన ట్లగపడుచున్నావు?' అని యడిగెను. చెడిప యిట్లనియె.—'నాప్రాణేశ్వరుఁ డున్నాఁడే ఆయన నేఁడు గ్రామాంతరము పోయినాఁడు,

దానంజేసి యీ యూరు సకలజనులతో నిండి యున్నను నాకు అడవిగా కనఁబడుచున్నది. ఆ పరస్థలమందు ఆయన ఎట్లున్నాఁడో? ఏమి భుజించినాఁడో? ఎట్లు నిద్రించినాఁడో? అని నాగుండె పగిలిపోవుచున్నది.' 'అట్టయిన, నీతో జగడమాడుచు నిన్ను అంకటా లని పలుకు వడ్రంగిమీఁద నీకు ఇంతప్రేముడియా?' అని మిండగాఁడు అడిగెను. అందులకు అది యిట్లనియె.— 'పోరా! కఠినుఁడా, ఏమనెదవు? విను.—

28. పెనిమిటి పరుసములు పలికినను, కోపముతోడి కంటితో చూచినను, ఎవతె ముఖమున సంతోషమే దాల్చియుండునో ఆ స్త్రీ ధర్మమును పొందును. మఱియు;—

29. ఊర నుండనీ, అడవి నుండనీ, పాపి గానీ పవిత్రుఁడు గానీ, ఏ స్త్రీలకు మగఁడు ప్రియుఁడో వారికి మహాభోగములు గల లోకములు కలుగును. మఱియు;—

30. అలంకారములు లేకయే స్త్రీకి మగఁడే ఉత్తమాలంకారము; పెండ్లాము అందగత్తె యయినను అతఁడు లేక అందగత్తె గాదు.

నీవు మిండఁడవు. నిన్ను బుద్ధిచాపల్యముచేత పువ్వులను తాంబూలమును ఎట్లో అట్లు ఎప్పుడేని పొందుచున్నాను. ఆయన నాయొడయఁడు, నన్ను అమ్ముటకును వేల్పులకు బ్రాహ్మణులకును ఇచ్చుటకును శక్తుఁడు. వే యేల?

31. ఆయన బ్రదికి యున్న నేను బ్రదికి యుందును; మఱి అయన మృతిఁ జెందిన నేను చత్తును. ఆయన చచ్చినప్పుడు సహగమనము చేసెదను. ఇది నాగట్టి పట్టుదల. ఏ లన,—

32. మూఁడు నర కోటి వెండ్రుకలు మనుష్యదేహమందు ఏవి కలవో పతితో సహగమనము చేసిన స్త్రీ అంతటికాలము స్వర్గమును అనుభవించును. మఱియు;—

33. పాములఁ బట్టువాఁడు ఎట్లు బలిమిచే పామును కన్నములోనుండి వెలికిఁ దివియునో సహగమనము సేయుభార్య అట్లే మగనిని ఉద్ధరించి తోడ్కొనిపోయి స్వర్గలోకములో గౌరవింపఁబడుచుండును. మఱియు;—

34. సొగమీఁద ప్రాణము పోయిన మగనిని ఏ ప్రియ కవుంగిలించుకొని దేహము వదలునో ఆమె నూఱులక్షలపాపములు చేసినదయినను మగనిం దోడ్కొని దేవలోకమును బొందును. ఏ లన,—

35. ఈమెను తండ్రిగాని తండ్రియనుమతిచే అన్నగాని ఎవని కిచ్చునో అతఁడు బ్రతికి యుండఁగా అతనిని శుశ్రూషించుచుండవలయును, అతఁడు మృతిఁజెందెనేని మఱియొకనిం గూడఁదగదు.'

ఇదంతయు విని వడ్రంగి 'నేను కృతార్థుఁడను, ఏలన, నాకు ఇట్టి భార్య ప్రేమగలదియు ప్రియము పల్కునదియు కలదు;' అని మనస్సులో నెంచుకొని ఆమంచమును ఆ స్త్రీపురుషులతోఁ గూడ నెత్తి కెత్తుకొని చాలసేపు నాట్యమాడెను. కావున



'ప్రత్యక్షముగానే తప్పు చేసినను' ఇత్యాదికముం జెప్పితిని

అంతట ఆ రాజు నన్ను ఆచారము ప్రకారము సత్కరించి పంపినాఁడు. చిలుకయు నా వెనుక వచ్చుచున్నది. దీని నెల్ల నారసి ఏమి చేయవలయునో దానిని ఏలినవారు చేయవలయును.

జక్కువ నవ్వి యిట్లనియె;—'స్వామీ, కొంగ దేశాంతరము పోయి తన శక్తి కొలఁది రాచకార్యమును సాధించినది. కానీ ఇది మూర్ఖుల స్వభావము; ఏల యన,—

36. నూ అయిన నిచ్చును గాని వాదమాడఁడు— అనుట ప్రాజ్ఞుని లక్షణము; కారణము లేకయే జగడమాడుట అనునది మూర్ఖుని లక్షణము.'

రా జనియె;—'ఏటికీనింద? ఇప్పుడు చేయవలసినదేమో దాని నాలోచింపవలయును.' జక్కువ పలికినది—'స్వామీ, ఏకాంతమందు చెప్పెదను; ఏల యన,—

37. వర్ణముచేతను, ఆకారముచేతను, ప్రతిధ్వనిచేతను, కన్నులయొక్కయు ముఖముయొక్కయు మార్పులచేతను, మనస్సులోని భావమును బుద్ధిమంతులు ఊహింతురు. కావున మంత్రము విజనమందు చేయవలయును.

అంతట రాజును మంత్రియు నటనే యుండిరి. ఇతరులు అవలికి పోయిరి. జక్కువ చెప్పినది.— 'దేవా, నా కిట్లు తోఁచుచున్నది, మనయుద్యోగస్థుఁడే ఎవఁడో ప్రేరింపఁగా కొంగ ఈపని చేసినది? ఏల యనఁగా,—

38. వైద్యులకు రోగి అనుకూలుఁడు, నియోగస్థునికి వ్యసనాసక్తుఁడు అనుకూలుఁడు, విద్వాంసులు మూర్ఖునివలన జీవింతురు, సజ్జనులకు మంచికులమువారే జీవనము.'

రా జనియె —'కానీ, కారణమును తర్వాత కనిపట్టుదము. ఇప్పటి కేది ప్రస్తుతమో దానిం జెప్పుము. చక్రవాక మిట్లు చెప్పుచున్నది.—'స్వామీ, వేగును పంపవలయును. వానివలన వారి సన్నాహమును బలాబలమును ఎఱుంగుదము. అట్లే గదా;—

39. తన రాష్ట్రముయొక్కయు పరరాష్ట్రములయొక్కయు కార్యాకార్యములను చూచుటకు రాజునకు వేగువాఁడే కన్ను, ఏ రాజునకు వాఁడు లేఁడో అతఁడు గ్రుడ్డియే.

వాఁడు నమ్మకమయిన వాని నింకొకని తోడ్కొని పోవలయు. అట్లు చేసిన వేగు తా నచటనే యుండి అచటి మంత్రకార్యములను మిక్కిలి గూఢముగా నిజము నెఱింగి, ఆరెండవవానిచేత చెప్పి పంపును. అట్లును చెప్పిరి;—

40. తీర్థములందును ఆశ్రమములయందును దేవాలయములయందును, శాస్త్రము నేర్చుకొను కారణమువలన మునివేసంబులు దాల్చిన తమ వేగులతోఁ గూడఁ బలికికొనవలసినది.

గూఢచారుఁ డనఁగా నీటను నేలనుం గూడ సంచరించువాఁడు; కావున ఈకొంగనే అందులకు పనిగొనవలయును. ఇట్టిదానినే మఱియొక కొంగను వీనికి తోడుగా పంపవలయును. వారి యింటివారు రాజద్వారమున నుండవలయును. మఱి, రాజా, ఇదంతయు

మిక్కిలి రహస్యముగా చేయవలయును. ఏల యన,—

41. ఆఱుచెవుల యాలోచన బయటఁబడును; అట్లే వార్తగా వచ్చినదియు; కావున రాజు తానే రెండవవాఁడుగా మంత్రము చేయవలయును. మఱియు;

42. మంత్రము బయలుపడుటచేత రాజునకు ఏ చెఱుపులు కలుగునో వానిని చక్కఁబెట్టుటకు అలవి గాదని నీతికోవిదులయభిప్రాయము.'

రాజు ఆలోచించుకొని 'నాకు మేలయిన వేగు దొరకినాఁడు గాదా?' అనెను. 'అట్టయిన జయము సయితము కలిగినదే.' అని మంత్రి పలికెను. ఈసమయమున దౌవారికుఁడు ప్రవేశించి ప్రణమిల్లి 'స్వామీ, జంబూద్వీపమునుండి చిలుక వచ్చి ద్వారమం దున్నది.' అని విన్నవించెను. రాజు చక్రవాకుని కేసి చూచెను. 'ఇప్పటికి పోయి బసలో ఉండు మను. తర్వాత తెచ్చి దర్శనము చేయింతువు గాని.' అని చక్రవాకుఁడు చెప్పెను. 'ఏలినవారి యాజ్ఞ' అని పలికి ద్వారపాలకుఁడు చిలుకను తోడ్కొని పోయెను. 'పోరేమో పొసఁగినది' అని రాజనెను. జక్కవ యిట్లనియె;—'స్వామీ, అవును. కాని ముందుగానే పోరు శాస్త్రీయము గాదు. మఱియు;—

43. పగతురను పోరిచే జయింప యత్నింపఁగూడదు, ఏల యన, పోరువారలకు ఇరువురకును గెలుపు అనిశ్చయ మనుట తెలిసినవిషయమే గదా. మఱియు;—

44. మంచిమాటచేతను, ఈవిచేతను, చీలఁదీయుటచేతను, ఈయన్నిటిచేతఁగాని, ఇందు ఒకటొకటిచేతఁగాని, పగతురను సాధించుటకు యత్నింపవలయును; యుద్ధము చేతమాత్రము ఎప్పుడును యత్నింపఁగూడదు. ఏల యన;—

45. పోరు పొసఁగనప్పుడు ప్రతివాఁడును శూరుఁడే; ఎదిరియొక్కసామర్థ్యము చూడనివాఁడు ఎవఁడు గర్వపడఁడు? మఱియు;—

46. కొయ్యతో లేపినట్లు ఱాతిబండను చేతులతో లేప శక్యము గాదు; ఇంచుక యుపాయమునకు గొప్పసిద్ధి కలుగుట యనునిది మంత్రముయొక్క గొప్పఫలము.

మఱి పోరు పొసఁగిన నెఱింగి వ్యవహరింపవలయును. ఏల యన,—

47. సమయాన చేసిన ప్రయత్నమువలన సేద్యము మంచిపంట నొసంగును; అట్లే ఈనీతి, ఓరాజా, కాలాంతరమందు ఫలించును గాని, నిముసములో ఫలింపదు. మఱియు;-

48. ఆపద దూరమం దున్నప్పుడు భయపడుటయు, సమీపించినప్పుడు పరాక్రమించుటయు, గొప్పవానికి గుణము. లోకములో గొప్పవాఁడు ఆపద వచ్చినప్పుడు ధైర్యము నవలంబించును. మఱియు;—

49. కోపముచే ఎకిరియుట ఎల్లసిద్ధులకును మొదటివిఘ్నము. కడుంజల్లని నీరు కొండలను చీల్చుట లేదా?

ముఖ్యముగా ఈరాజు చిత్రవర్ణుఁడు మిక్కిలి బల్లిదుఁడు.



50. బలవంతునితో పోరవలసిన దనుటకు నిదర్శనము లేదు; కావున ఏనుఁగుతోడి యుద్ధము మనుష్యులకు చావు దెచ్చును. మఱియు;—

51. కాలము రానప్పుడు అపకారిమీఁదికి లేచువాఁడు మూర్ఖుఁడు; బలవంతునితో పోరాటము పురుగునకు ఱెక్కలు మొలచుటవంటిది. మఱియు;—

52. తాఁబేటివలె ఒడలు ముణఁచుకొని దెబ్బ నైనను ఓర్వవలయును, సమయము రాఁగానే నీతిమంతుఁడు క్రూరసర్పమువలె లేవవలయును.

53. ఏటివడి ఎట్లు చెట్లను గడ్డిమొలకలను సమానముగానే పెల్లగింప సమర్థమగునో అట్లే ఉపాయవంతుఁడు అధికునిమీఁదను అల్పునిమీఁదను సమానముగానే సమర్థుఁ డగును; మనదూతనుం గూడ ఓదార్చి ఆఁపవలయును; ఎందాఁక ననఁగా, దుర్గము యుద్ధమునకు సిద్ధ మగునందాఁక. ఏల యన;—

54. ప్రాకారమున నున్న విలుకాఁడు ఒక్కఁడు నూఱుగురను పోరును, నూఱుగురు లక్షలమందిని పోరుదురు; కావున దుర్గము ముఖ్య మయినది. మఱియు;—

55. కోటయు దాఁగుటకు తావును లేనివానిని శత్రువెల్ల ఓడించు. కోటయు దాఁగుటకు తావును లేనిరాజు ఓడ పగిలిన మనుష్యునివంటివాఁడు.

56. కొండను నదిని ఎడారిని అడవిని అండగొని లోఁతయిన యగడ్తయు, ఎత్తైన ప్రాకారమును యంత్రములును నీరును కలదిగా కోటను కట్టవలయును.

57. వైశాల్యము, మిక్కిలి విషమత్వము, రసద్రవ్యములయు ధాన్యములయు వంటచెఱకుయొక్కయు సేకరంబును, చొచ్చెడు దారియు, వెలువడిదారియు, ఈయేడును దుర్గసంపదలు.

58. రాజు, మంత్రి, మిత్త్రుఁడు, బొక్కసము, రాష్ట్రము, కోట, సేన, ఇవి యొండొకటికి ఉపబలములై, రాజ్యము ఏడు అంగములు కలదిగా చెప్పఁబడును.

59. దుర్గాధ్యక్షుఁడు, సేనాధిపతి, ధనాధికారి, రాజు, రాయబారి, పురోహితుఁడు, జోస్యుఁడు, వైద్యుఁడు— వీరు మంత్రు లనఁబడుదురు.—

'కోటను సిద్ధముసేయుటకు ఎవనిని నియమింతము?' అని రాజడిగెను. జక్కవ—

60. 'ఏపనిలో ఎవఁడు నేర్పరియో ఆపనిలో వానిని పెట్టవలయును; ఆయాపనులయందు ప్రత్యక్షానుభవము లేనివాఁడు శాస్త్రము చదివినవాఁడయినను కన్ను తెలియక యుండును.

కావున సారసుని (బెగ్గురుపక్షిని) పిలిపింపవలయును.' అనెను. అట్లు సేయఁగానే వచ్చినట్టి సారసునిం గాంచి రాజు 'ఓయి సారసుఁడా, నీవు త్వరగా కోటను సిద్ధపఱుపుము.' అనెను. సారసుఁడు నమస్కరించి యిట్లనియె;—

'దేవ, ఇదే యీమహాసరస్సే మనకోట చిరకాలమునుండి చక్కఁగా చూచి

ఏర్పఱుచుకొన్నట్టిది, ఉండనే ఉన్నది. మఱి, దీని నడిమి దీవిలో ధాన్యముల సేకరము సేయవలయును. ఏల యన,—

61. రాజా, ఎల్లసేకరములకన్న ధాన్యముల సేకరము శ్రేష్ఠము; నోట పెట్టుకొన్న రత్నము ప్రాణమును నిలుపదు. మఱియు;—

62. రసద్రవ్యములలో నెల్ల ఉప్పు శ్రేష్ఠ మయిన రస మని ప్రసిద్ధము గదా; దానిని సేకరింపవలయును; అది లేని యెడల కూర వేఁడవలె నుండెను.' రాజు 'త్వరగా పోయి అ దంతయు చేయుము' అనెను.

మరల ద్వారపాలకుఁడు వచ్చి 'స్వామీ, సింహళ ద్వీపమునుండి మేఘవర్ణుఁడను కాకి పరివారసమేతముగా వచ్చి హజారమం దున్నది. ఏలినవారిని దర్శింప వేఁడుచున్నది.' అని విన్నపించెను. రాజనెను,—'కాకి ప్రజ్ఞగలదియు పెక్కింటిని చూచునదియు; కావున మనకు చేర్చుకోఁదగినది.'

చక్రవాకము ఇట్లనియె;—'కాకి నేలపక్షి, మనము నీటిపక్షులము, కాన, మన శత్రుపక్షములో చేరినట్టిది; దానిని మన మెట్లు చేర్చుకొనఁదగును? అట్లే చెప్పిరి;—

63. తనపక్షమువారిని వదలి వైరిపక్షమువారిని ఎవఁడు కూడునో వాఁడు నీలి వన్నె నక్కవలె వైరులచే చంపఁబడును.—

కథ. ౭.

ఒకానొక యడవిలో నక్క యొకటి యుండెను. అది యథేచ్ఛముగా ఊరి చెంత తిరుగుచు, ఒక నీలి తొట్టిలో పడిపోయి మఱి లేవ లేక తెల్లవాఱునప్పటికి చచ్చినట్లు టక్కుగా పడియుండెను. తర్వాత నీలితొట్టి యొడయఁడు వచ్చి అట్లు కాళ్లు పైకిపెట్టుకొని కన్నులు మూఁతపడి పండ్లు వెడలఁబెట్టుకొని యున్నయా నక్కను చచ్చినదనుకొని ఎత్తుకొని పోయి దూరమున వైచెను. నక్క పాఱిపోయి అడవి కేఁగి తన నీలి వన్నెను చూచుకొని ఇట్లు తలపోసికొనెను. 'నే నిపుడు నీలవర్ణము గలవాఁడను ఉత్తమవర్ణుఁడను. కావున నా హెచ్చును నే నేల సాధింపఁగూడదు?' ఇట్లాలోచించుకొని నక్కలను పిలిచి యిట్లు వక్కాణించెను.—'నన్ను భగవతి వనదేవత అడవిరాజ్యమునకు ఎల్ల యోషధుల రసముతోను అభిషేకించినది. నారంగును మీరు చూడుఁడు. కావున నేఁటినుండి ఈ యడవిలో నాయాజ్ఞప్రకారము వ్యవహరింపవలయును.' నక్కలు ఉత్తమవర్ణముగల యానక్కను చూచి సాష్టాంగనమస్కారము గావించి 'ఏలినవారి యాజ్ఞప్రకారము' అని పలికినవి. తర్వాత ఈవరుసను ఆనక్క తనబంధువులు తన్ను చుట్టుఁ గొలుచుచుండ, ఎల్ల మృగములమీఁదను తనదొరతనమును స్థాపించుకొన్నది. తర్వాత సింహము పులి లోనగు గొప్పగొప్ప పరిజనులు దొరకినంతట, నక్కలను చూచి యవమానపడి తనబంధువుల నన్నిటిని దూరము చేసికొన్నది. అందుకై ఖేదపడుచున్న నక్కలను చూచి ముది



నక్క ప్రతిజ్ఞ చేసెను. 'ఖేదపడకుఁడు, నీతి యెఱుఁగక ఇది ఇట్లు తనరహస్యము నెఱిఁగిన మనలను అవమానించినది. కావున ఇది ఎట్లు పాడయిపోవునో అట్లు నేను చేసెదను. ఎట్లన, పులి లోనగు నీజంతువులు దీని రంగునకు మోసపోయి నక్క యని ఎఱుఁగక దీనిని రాజునుగా కొలుచుచున్నవి. దీని తత్త్వమును తెలిసికొనునట్లు చేయుఁడు. అందులకై ఏమి సేయవలయు ననఁగా—సంజవేళ దీని చెంత బిగ్గరగా ఊళపెట్టుఁడు; ఆయూళను విని జాతిస్వభావముచేత ఇదియు ఊళ పెట్టును.' అవియు అట్లే చేసినవి, అదియు నట్లే చేసినది. ఏల యన,—

64. ఎవని కేది స్వభావమో దానిని వాఁడు దాఁటలేఁడు; కుక్కను రాజును చేసిన అదీ చెప్పు గొఱుకక యుండునా?

అట్లు జరుగఁగానే దానిని నక్కయని తెలిసికొని పులి చంపెను. చెప్పిరి;—

65. లోపము, ఆయువుపట్టు, బలము, ఈసమస్తమును ఎఱిఁగిన శత్రువు ఎవఁడో వాఁడు లోనఁ జొచ్చి నిప్పు ఎండుచెట్టును బోలె కాల్చివైచును.

కావున 'తనపక్షమువారిని వదలి' ఇత్యాదికముం జెప్పితిని.

---

అది సరియే, అయినను, దూరమునుండి వచ్చినవాఁడు కావున ఇతనిని రప్పించి మాతము, చేర్చుకొనుటను గుఱించి తర్వాత ఆలోచింతము.' జక్కవ యిట్లనియె;—'దేవా, చారుని పంపితిమి, దుర్గము కూడ సిద్ధ మయినది, కనుక చిలుకను కూడ రప్పించి పంపివేయవచ్చును. ఏలన,—

66. వాఁడి మగంటిమి గల రాయబారిని పంపి చాణక్యుఁడు నందుని చంపెను. కావున రాజు వీరులతోఁ గూడుకొన్నవాఁడై ఎదిరి రాయబారిని దూరమున ఉంచి చూడవలయును.'

అంతట రాజు సభ తీరి చిలుకను కాకిని రప్పించెను. చిలుక ఇంచుక తల యెత్తుకొని ఇచ్చిన యాసనంబునం గూర్చుండి ఇట్లు వాక్రుచ్చెను.—"ఓయి హిరణ్యగర్భుడా, మహారాజాధిరాజు శ్రీమంతుఁడు చిత్రవర్ణుఁడు నీ కాజ్ఞాపించుచున్నాడు; —'నీకు ప్రాణమువలనఁగాని సిరివలనఁగాని ప్రయోజన మున్నయెడల శీఘ్రముగా వచ్చి మాపాదములకు మ్రొక్కుము. అట్లు సేయవేని ఉనికికై వేఱుతావుం జూచుకొమ్ము?' అని."

రాజు కోపమున 'ఇసీ!, నామ్రోల వీనిని మెడ పట్టి గెంటువాఁడు ఎవ్వఁడును లేఁడా?' అనెను. అంతట మేఘవర్ణుఁడు లేచి 'స్వామీ, నా కాజ్ఞ యిందు, ఈ పాడుచిలుకను చంపెదను.' అనెను ఇంతలో జక్కవ రాజును కాకిని ఓదార్చుచు ఇట్లనియె;—ఇదిగ వినుండు.

67. ఎక్కడ పెద్దలు లేరో అది సభ గాదు, ఎవరు ధర్మము చెప్పరో వారు

పెద్దలు గారు, ఎందు సత్యము లేదో అది ధర్మము గాదు, దేనితో మోసము చేరి యున్నదో అది సత్యము గాదు. ఏల యన ధర్మ మిది.—

68. దూత మ్లేచ్ఛుఁ డయినను తానికి వధ్యుఁడు గాఁడు, ఇక బ్రాహ్మణునిమాట చెప్పవలయునా? తనపైకి కత్తులు దూసినను దూత వేఱువిధముగా పలుకఁడు. అట్లే,

69. దూత పలికెడిమాటలవలన తనకు లోపముగు నెదిరికి గౌరవమును ఎవఁడు భావించును? ఎప్పుడును తన్ను చంపఁగూడదు గావున దూత సర్వమును పలుకును'

అంతట రాజును కాకియు సమాధానపడిరి. చిలుకయు లేచి తరలినది. తర్వాత చక్రవాకుఁడు తెచ్చి బోధించి బంగారు నగలు లోనగునవి యిచ్చి పంపఁగా చిలుక స్వదేశమునకుం బోయి వింధ్యపర్వతమున కేఁగి తన దొరకు చిత్రవర్ణునికి మ్రొక్కెను. దానిం గని రాజు చిత్రవర్ణుఁడు 'చిలుకా, ఏమివార్త? ఆ దేశము ఎట్టిది?' అని యడిగెను. 'దేవరా, సంగ్రహముగా ఇదే వార్త. ఇప్పుడే పోరికి సన్నాహము సేయింపుఁడు. కర్పూరద్వీపనెడి యా దేశము స్వర్గఖండము; రాజు రెండవయింద్రుఁడు; అతని వర్ణింపఁదిరము గాదు.' అంతట పెద్దల నందఱను పిలిపించి చిత్రవర్ణుఁడు మంత్రమునకై కూర్చుండెను. రాజిట్లనియె;—'ఇప్పుడు చేయవలసియున్న పోరివిషయమై ఎట్లు సిద్ధపడవలయునో చెప్పుఁడు. తప్పకుండ యుద్ధము చేయవలసినది. ఇట్లు పెద్దలు చెప్పినారు;—

70. సంతుష్టిలేని బ్రాహ్మణులు చెడుదురు, సంతుష్టిం జెందిన రాజులు చెడుదురు. లజ్జ గల వేశ్య చెడును, లజ్జలేని కులస్త్రీ చెడును.'

దూరదర్శి యనెడి గ్రద్ద యిట్లనియె;— 'దేవా, పోరిమీఁదియాసక్తిచేత పోరు సేఁత శాస్త్రీయము గాదు.

71. మిత్త్రులును మంత్రులును చెలికాండ్రును తనవారు తనయందు దృఢభక్తి గలిగియు, వైరివారు అతనియందు విపరీతముగాను, ఎప్పు డుందురో అప్పుడు యుద్ధము సేయవలయును. మఱియు;—

72. దేశమును, మిత్త్రుఁడును, బంగారమును,— యుద్ధమునకు ఈమూఁడు ఫలములు; ఇవి యెప్పుడు నిశ్చయముగా లభించునో అప్పుడు యుద్ధము సేయవలయును.'

రాజు చెప్పెను.— 'మంత్రి నాబలమును చూచునుగాక, అప్పుడు, వీరి యుపయోగమును తెలిసికొనునుగాక. కావున జోస్యుని పిలిచి పయనమునకు మంచిలగ్నమును పెట్టుమనుఁడు.' మంత్రి చెప్పెను.— 'దేవా, అట్లయినను తటాలున పయన మగుట మంచిది గాదు. ఏల యన,—

73. ఎదిరిబలమును విచారించుకొనక ఏమూఢులు చొత్తురో వారు నిశ్చయముగా కత్తివాదరలకవుంగిలిం బడయుదురు.'

రాజనియె;— 'మంత్రీ, నాయుత్సాహమును ఎంత మాత్రము చెడఁగొట్టకుము. జయింపఁ గోరువాఁడు పరరాష్ట్రమును ఎట్లు స్వాధీన పఱుచుకొనునో ఆయుపాయమును చెప్పుము.'

గద్ద యిట్లనియె;—రాజా, దానిని చెప్పెదను. కాని, ఆప్రకారము చేసిననే ఫలము గలుగును. అట్లే చెప్పినారు;—

74. అనుష్ఠానములేని శాస్త్రముచేత ప్రయోజన మేమియు లేనట్లే రాజానకు మంత్రముప్రకారము చేయనియెడల దానివలన ప్రయోజన మేమియు నుండదు. ఔషధముల నెఱిఁగినమాత్రాన రోగ మెక్కడను కుదురదు.

రాజాజ్ఞను మీఱరాదు గావున నేను విన్నట్లు నివేదించుచున్నాను. దేవా వినుము.

75. ఏటి దుర్గములు, కొండ దుర్గములు, అడవి దుర్గములు అను వీనిలో ఎందెందు భయము కలదో ఆయా దానికి సేనాపతి దండులను మొగ్గరము సేసికొని పోవలయును.

76, 77. వీరపురుషులతో కూడుకొన్నవాఁడై దండులమీఁదియధికారి ముందుగా పోవలయును; నడుమ రాజును రాణియు, బొక్కసమును, పరిచారకాది వర్గమును; ఇరుప్రక్కలను గుఱ్ఱములును, గుఱ్ఱముల ప్రక్కను తేరులును, తేరుఁప్రక్కను ఏనుఁగులును, ఏనుఁగుల ప్రక్కను కాల్బంట్లును, పోవలయును.

78. వెనుక సేనాపతి బడలినవారిని ఓదార్చుచు మెల్లఁగా పోవలయును. ఈవిధముగా రాజు మంత్రులతోను మంచిబంట్లతోను కూడుకొన్నవాఁడై దండుం దోడ్కొని తేరల వలయును.

79. ఎగుడుదిగుడై నీరు కలదై కొండలు గలిగిన ప్రదేశమును ఏనుఁగులచేతను, చదునుప్రదేశమును గుఱ్ఱములచేతను, నీళ్లను ఓడలచేతను, సమస్తమును కాల్బంట్లచేతను ఆక్రమింపవలయును.

80. ఏనుఁగులపయనము వర్షర్తువునందును, గుఱ్ఱములది ఇతరకాలములందును, పదాతులది ఎల్లకాలములందును, ప్రశస్త మని చెప్పఁబడినది.

81, కొండలయందును, పోఁగూడని దారులయందును, రాజును కాచుచుండవలయును. తన జోదులే తన్ను కాచుచున్నను రాజు సగము మెలఁకువతోనే నిద్ర పోవలయునుగాని గాఢముగా నిద్రింపఁగూడదు.

82. దుర్గములను కూల్చుటచేతను పితూరీ లడంచుటచేతను శత్రువులను నాశమొందింపవలయును, బాధ పెట్టవలయును.

పరదేశము చొచ్చునప్పుడు అడవివాండ్రను ముం దుంచుకొనవలయును.

83. రా జెచట నుండునో బొక్కసము అచట నుండవలయును, బొక్కసము లేదేని రాజత్వము లేదు. అం దుండి తనసేవకులకు ఈవలయును, ఇచ్చువానికై ఎవఁడు పోరఁడు? ఏల యన,—

84. ఓ రాజా, మనుష్యుఁడు ధనమునకు దాసుఁడు గాని మనుష్యునికి దాసుఁడు గాఁడు; గౌరవలాఘవములు కలిమిలేములను బట్టి కలుగును.

85. భేదము లేకుండ పోరాడవలయును, ఒండొరులను కాచుకొనవలయును, చేవ లేని సైన్యమును మొగ్గరము నడుమ నుంపవలయును.

86. రాజు కాల్బలమును దండునకు ముందు నిలుపవలయును, శత్రువును అరికట్టి యుండవలయును, అతని దేశమును ఉపద్రవ పెట్టవలయును.

87. చదును నేలయందు తేరులతోను గుఱ్ఱములతోను, జలయుక్త స్థలమునందు ఓడలతోను ఏనుఁగులతోను, చెట్లు పొదలు కమ్ముకొనిన చోట విండ్లతోను, బయల, కత్తిడాలు కైదువులతోను, పోరాడవలయును.

88. సదా, శత్రువుయొక్క గడ్డిని ఆహారమును నీళ్లను వంటచెఱకును విషాదులచే చెఱుపవలయును. చెఱువులను ప్రాకారములను, కందకములను పగులఁగొట్టవలయును.

89. బలములలో ప్రధాన మయినది ఏనుఁగు, రాజునకు దానిసాటి మఱియొకటి లేదు. ఏనుఁగునకు దాని యవయవములే ఎనిమిది కైదువు లని చెప్పఁబడి యున్నది.

90. సైన్యములకు గుఱ్ఱము బలము, ఏల యన దుఱ్ఱపు దండు నడప్రహారి; అందు వలన గుఱ్ఱము లెక్కువగాఁగల రాజు చదును నేలయుద్ధములో గెలుపు నొందును.

91. గుఱ్ఱము నెక్కి పోరువారిని దేవతలు సయితము గెలువలేరు; వారికి దూర మందలి శత్రువులు సయితము చేత నున్నట్లే.

92. ముందుగా పోరు ఆరంభించుట, దండు నెల్ల కాచుట, దిక్కులను దారులను చక్కఁ బఱుచుటయు, కాల్బలముయొక్క పని.

93. స్వభావముచేతనే మగఁటిమి గలది, కైదువు లెఱిఁగినట్టిది, రాజునందు భక్తి గలది, శ్రమకు ఓర్చునది, ప్రఖ్యాతు లయిన క్షత్రియులు ఎక్కువగాఁ గలది, మిక్కిలి శ్రేష్ఠ మయిన దండు అని తలంతురు.

94. ఓ రాజా, మనుష్యులు రాజు సేయు గౌరవమువలన ఎట్లు పోరుదురో అట్లు పెక్కు ధనము లిచ్చినను పోరరు.

95. శ్రేష్ఠ మయిన కొంచెపాటి బలమే మేలు, విస్తార మయిన తలకాయలబారు మేలు గాదు. యుద్ధములో చేవ లేనిభాగము విఱుగఁబడెనేని చేవ గలది కూడ నిశ్చయముగా విఱుగఁబడును.

96. దండునకు రాజునందు అనురాగము తప్పుటకు కారణము లేవనఁగా,— అనుగ్రహింపమి, చక్కఁగా వశమందుంచుకొనమి, ఈవలసిన దానిని ఈకుండుట, కాలము జరుపుట, ప్రతిక్రియ సేయమియు.

97. గెలుపు కోరినవాఁడు శత్రువుయొక్క దండును బాధించుచు ఎండఁగొట్ట



వలయును. చిరకాలము బాధింపఁబడిన శత్రుసైన్యము సులువుగా లోఁబడును.

98. శత్రువులను చీల్చునట్టి మంత్రము దాయాదుని మించినట్టిది మఱి లేదు. కనుక ప్రయత్నపూర్వకముగా శత్రువుమీఁదికి వానిదాయాదుని లేపవలసినది.

99. దండెత్తి పోయినరాజు స్థిరనిశ్చయుఁడై వైరియొక్క యువరాజుతోఁగాని మంత్రితోఁగాని సంధి చేసికొని వైరిజనములో లోద్వేషములు కల్పింపవలయును.

100. ద్వేషపాత్ర మైన మిత్త్రుని ఇతరులచేత భంగింపించి చంపింప వలసినది; అట్లు కాదేని గోవులను పట్టుటకని ఆపనిలో నుండ తన యాశ్రితులచేత ఆకర్షింపించి ఖైదు చేయింపవలసినది.

101. పరదేశమును తాను చొచ్చి అక్కడివారిని తెచ్చి తన దేశమందు వసింపఁజేయవలెను. ఒండె, తన యీవి గారవముల చేత తనరాష్ట్రమే తనకు ధన మొసంగును.'

చిత్రవర్ణ రాజు ఇట్లనియె;— 'సీ! ఎందులకు పెల్లుగా చెప్పుట?

102. తన పెంపు వైరినాశము అను నీరెంటి మొత్తము నీతి; ఇట్లని అంగీకరించి ధన్యులు బృహస్పతివలె ప్రసంగింతురు.'

మంత్రి నవ్వి యిట్లనియె:— 'ఇదంతయు ఆయావిశేషములను చెప్పుట; కాని;

103 అడ్డులేని సామర్థ్యము వేఱు, శాస్త్రమునకు కట్టుపడునట్టి సామర్థ్యము వేఱు; వెలుతురును చీఁకటియు ఒక్కచోట నుండునవి గావు.'

అంతట రాజు సభ చాలించెను; తర్వాత జోస్యులు పెట్టిన లగ్నమున తరలెను.

అంతట మున్ను పంపిన వేగు హిరణ్యగర్భునికడకు వచ్చి ప్రణమిల్లి యిట్లనియె; 'దేవరా, ఇదిగో వచ్చినాఁడు రాజు చిత్రవర్ణుఁడు; ఇప్పుడు మలయాద్రినెత్తమున పాళెము దిగియున్నాఁడు. అనుక్షణము మన దుర్గమును సోదన చూచుకోవలయును; ఏల యన ఆ గద్ద గొప్ప మంత్రి. ఇది గాక, ఎవనితోనో ఆతఁడు నమ్మకముగా మాటలాడుటలో ఈసూచన తెలిసినది;—ఏమనఁగా, అతఁడు ఎవనినో మన కోటలో ముందుగానే ప్రవేశ పెట్టియున్నాఁడని.' అంత జక్కవ 'స్వామీ, వాఁడు కాకియే గావలయును.' అనెను. రాజనియె;— 'ఎంతమాత్రమును కాఁడు. అగునేని ఏల అప్పుడు ఆవిధముగా చిలుకను గొట్టుటకు లేచును? అది గాక, చిలుక వచ్చినందువలననే వానికి పోరాటమందు ఉత్సాహము; వాఁడు చిరకాలమునుండి యిచట నున్నాఁడు.' మంత్రి చెప్పుట;—'అయినను క్రొత్తగా వచ్చినవానిని నమ్మరాదు.' రాజనియె;—

104. ఒక్కొకచోట ఆగంతుకులు మేలు సేయుట కలదు; విను; పరుఁడయినను మేలు సేయువాఁడు బంధువే, బంధువయినను కీడు సేయువాఁడు పరుఁడే. ఒడలియందు పుట్టిన రోగము కీడు సేయును, అడవిలో పుట్టిన మందు మేలు సేయును; మఱియొకటి;—

105. శూద్రకుఁ డను రాజునకు వీరవరుఁ డని సేవకుఁడు ఉండెను. అతఁడు సేవకు వచ్చిన స్వల్పకాలములోనే రాజుకై తన కుమారుని బలి వేసెను.

అది యెట్లని చక్రవర్తి యడిగెను; రాజు చెప్పుచున్నాఁడు.—

కథ. ౮.

పూర్వము వే నొకప్పుడు శూద్రకరాజుయొక్క యాటకొలనియందు కర్పూరకేళి యను రాజహంసుని కూఁతురు కర్పూరమంజరియందు మరులు కొంటిని. అట వీరవరుఁ డను క్షత్త్రియ కుమారుఁడు ఏదేశమునుండియో వచ్చి రాని హజారమందు దౌవారికుని దగ్గఱ, 'నేను జీవికనిమిత్తము వచ్చితిని, క్షత్త్రియకుమారుఁడను, నాకు రాజదర్శనము సేయింపుము' అని యడిగెను. అంతట దౌవారికుఁడు రాజదర్శనము సేయింపఁగా, అతఁడు రాజుతో 'దేవా, నా కొలువువలన తమకు ఉపయోగ ముండునేని, నాకు జీతము ఏర్పఱుపుఁడు.' అని యడిగెను. శూద్రకుఁడు 'నీ కేమి జీతము కావలయును?' అని యడిగెను. 'ఆ యా దినమునకు నన్నూఱు వరహాలు వలయును.' అని వీరవరుఁడు చెప్పెను. 'నీసామగ్రి ఏమి?' అని రా జడిగెను. 'రెండు బాహువులు, మూఁడవది కత్తి' అని వీరవరుఁడు పలికెను. 'ఇది సాధ్యపడదు' అని రా జనెను. ఆమాట విని వీరవరుఁడు నమస్కరించి వెడలిపోయెను. 'దేవా, నాలుగు దినములు జీత మిచ్చి దీని తత్త్వమును ఎఱుంగుఁడు. ఈతఁడు ఈపాటి జీతమును పుచ్చుకొనుట వలన ఉపయోగము ఉండునో ఉండదో అని.' అని మంత్రులు పలికిరి.

రాజు మంత్రులమాట మీఁద రప్పించి వీరవరునికి తాంబూల మిచ్చి జీత మొసంగెను. ఏల యన;—

106. తాంబూలము కారమును చేఁదును కలసిన తీపు కలది, ఒగరుతోఁగూడిన యుప్పునగలది, వాతమును హరించును, కఫమును పోఁగొట్టును, పురుగులను కొట్టును, కంపుదోషమును తొలఁగించును, నోటికి అలంకారము, మలమును వెడలించును, కామాగ్నిని మంట సేయును; మిత్త్రుఁడా, తాంబూలముయొక్క గుణములు, పదుమూఁడు, ఇవి స్వర్గమందుఁగూడ దొరకవు.

ఆజీతము నాతఁడు వినియోగించు విధమును రాజు రహస్యముగా కనిపట్టెను. అందు సగము వీరవరుఁడు దేవతలకును బ్రాహ్మణులకును ఇచ్చెను. కడమ మూఁడవపాలు పేదల కిచ్చెను. మిగత భోజనమునకును విలాసమునకును వ్యయము చేసెను. ఇదంతయు నిత్యకృత్యము చేసి రాజద్వారమందు రేయుంబవలు కాపుండును. రాజు ఎప్పుడు పొమ్మని సెల వొసంగునో అప్పుడు తన బసకు పోవును.

తర్వాత కృష్ణచతుర్దశినాఁడు రాత్రి రాజునకు దుఃఖముతోడి రోదనధ్వని వినఁబడెను. 'ద్వారమందు ఎవ రున్నారు?' అని రాజు పిలిచెను. అంతట 'దేవా, నే



నున్నాను' అని వీరవరుఁడు పలికెను. 'ఆ యేడ్పువెంబడి పొమ్ము' అని రాజు చెప్పెను. 'చిత్తము' ఏలినవారియాజ్ఞ' అని పలికి వీరవరుఁడు పోయెను. రాజు తలపోసెను.— 'సూదిగ్రో పొడువఁదగిన యీ చీకటిలో ఇతనిని ఒంటిగానిని పంపినాఁడను, అది ఒప్పిదము గాదు. నేనును పోయి పరికించెద.' అంతట రాజు కూడ కత్తిం గైకొని వానివెంట నడచి ఊరిబయటికి పోయెను. అచ్చట వీరవరుఁడు రూప యౌవన సంపన్నురాలును సర్వాలంకార భూషితురాలును అయిన స్త్రీ నొకతెను చూచి 'నీ వెవతెవు? ఏల ఏడ్చెదవు?' అని యడిగెను. 'నేను ఈ శూద్రకరాజుయొక్క లక్ష్మిని, చిరకాలము ఇతని బుజమునీడను మిక్కిలి సుఖముంటిని. ఇప్పుడు ఇతనిం బాసి పోనున్నా నని దుఃఖపడుచున్నాను.' అని యామె చెప్పెను. 'అపాయ మున్నచోట ఉపాయమును ఉండును. కావున ఓ దేవీ, మరల నీవు ఇతని నవలంబించు నుపాయ మేమి?' అని వీరవరుఁడు అడిగెను. లక్ష్మి 'నీవు ముప్పదిరెండు లక్షణములుగలవానిని నీకుమారుని శక్తివరుని సర్వమంగళాదేవికి బలివేయుదువేని నేను వెండియు నిట చిరకాలము వసించెదను.' ఇట్లు చెప్పి దేవి అంతర్ధాన మొందెను.

తర్వాత వీరవరుఁడు తనయింటి కేఁగి నిద్రించుచున్న తన భార్యాపుత్త్రులను మేల్కొలిపెను. వారును మేల్కొని లేచి కూర్చుండిరి. వీరవరుఁడు లక్ష్మి పలికిన దంతయు వారికి చెప్పెను. దానిని విని శక్తివరుఁడు ఆనందపడి యిట్లనియె;—'స్వామి రాజ్యమును రక్షించుటకు ఉపయోగపడునట్టి యీ నేను కృతార్థుఁడను. మఱి తడ వేల? ఇట్టి కార్యమందు దేహమును వినియోగించుట శ్లాఘ్యము గదా. ఏల యన;—

107. ధనములను ప్రాణమును ఇతరులకొఱకు ప్రాజ్ఞుఁడు వదలవలయును, వినాశము నిశ్చయము గాన మంచినిమిత్తమున వదలుట మంచిది.'

శక్తివరుని తల్లి యిట్లనియె,—'మన కులమునకు తగిన దైన యీపనిని మనము చేయరాదేని, మఱి యే పనిచేత ఈ గొప్పజీతముయొక్క ఋణము తీఱును?' ఇట్లాలోచించుకొని అందఱును సర్వమంగళాదేవి దేవళమునకుం బోయిరి. అచట సర్వమంగళను పూజించి వీరవరుఁడు 'దేవీ, అనుగ్రహింపుము, శూద్రకమహారాజు వర్ధిల్లుఁగాక; ఇదె ఈ యుపహారమును స్వీకరింపుము.' అని వేఁడుకొని కుమారునితలను ఖండించెను. తర్వాత వీరవరుఁడు ఇట్లు తలపోసెను.— 'రాజువలన కయికొన్న జీతమునకు ఋణము తీర్చుకొంటిని. ఇఁకను పుత్త్రహీనుఁడను నేను బ్రదుకు నటించుట కూడదు.' ఇట్లాలోచించుకొని తన తలను నఱుకుకొనెను. అంతట పతియు సుతుఁడును పోయినదుఃఖముచేత నొగిలి అతనిభార్యయు తన మెడం గోసికొనెను.

ఇదంతయు కని విని రాజు ఇట్లు చింతించెను;—

108. 'నావంటి ముక్కడిప్రాణులు బ్రదుక నేమి చావ నేమి? వీనికి సమానుఁడు

ఈలోకములో ఇంతవమున్న లేఁడు, ఇఁక నుండఁడు. ఇతఁడు లేక రాజ్యము నాకేల?' అంతట తనతలం దఱుఁగుకొనుటకు శూద్రకరాజు కత్తి యెత్తెను. అంతట సర్వమంగళా భగవతి ప్రత్యక్షమై రాజుచేతిని పట్టి ఆఁపి 'పుత్త్రుఁడా. నీకు ప్రసన్నురాల నయితిని. సాహసము మానుము. ప్రాణాంతమందును నీకు రాజ్యభంగము ఉండదు.' అని చెప్పెను. రాజు సాష్టాంగము పడి మ్రొక్కి 'దేవీ, నాకు రాజ్యముతో పని లేదు. నాయందు కనికరముం దాల్తువేని నా మిగత యాయుస్సును ఇచ్చియేనియు ఈ రాజకుమారుని దారపుత్త్రసమేతముగా బ్రదికింపుము. అట్లు చేయవేని నాకు సంభవించు గతిని నేను పోయెదను.' అని వేఁడెను. దేవి పలికెను.— 'ఈ నీ సత్త్వమహిమను సేవకవాత్సల్యమును నేను మెచ్చుకొంటిని పో, విజయ మొందు. పరివార సమేతముగా ఈ రాజపుత్త్రుఁడును బ్రదుకునుగాక.' ఇట్లు వచించి దేవి అంతర్ధాన మొందెను. రాజు ఆమెకు మ్రొక్కి వారికి కనఁబడకుండ చని, వెంటనే మేడమీఁది కేఁగి నిద్రపోయెను. వీరవరుఁడు సతీసుత సమేతముగా బ్రదికి తనయింటి కేఁగెను. తర్వాత వెండియు పోయి రాజద్వారమందు ఉండెను. రాజు అడుగఁగా 'స్వామీ! ఆ యేడ్చుచున్న స్త్రీ నన్నుఁ గని అదృశ్యురా లాయెను. మఱేమియు వృత్తాంతము లేదు.' అనెను. ఆమాట విని రాజు తలంచెను: 'ఇతఁడు ఎంత పొగడఁదగినవాఁడు, ఎంతటి మహాసత్త్వుఁడు! ఏల యన;—

**109.** దీనత లేక ప్రియము పల్కవలయును, శూరుఁడై తన్నుఁ దా పొగడుకొనకుండవలయును, ఇచ్చువాఁడు సత్పాత్రమందు కురియవలయును, మంచి ప్రజ్ఞగలవాఁడు కఠినుఁడు గాకుండవలయును.

ఈ మహాపురుషలక్షణము సమస్తము ఇతనియం దున్నది.' పిమ్మట రాజు ప్రాతఃకాలమున పెద్దలను రావించి ఓలగంబు గావించి ఆ సకలవార్తయు ప్రస్తావించి కరుణపెంపున వీరవరునికి కర్ణాటరాజ్యము నొసంగెను.

---

కావున క్రొత్తగా వచ్చినవాఁడు జాతిమాత్రాననే దుష్టుఁడా? అందును ఉత్తములు అధములు మధ్యములుం గలరు.—

చక్రవాకుఁడు ఇట్లనియె.—

**110.** చేయఁగూడని పనిని చేయఁదగినదిగా ఎవఁడు రేనికి ఇచ్చకముకై చెప్పునో వాఁడు చెడుమంత్రి. ఆకార్య ముపదేశించి స్వామికి నాశము కలిగించుటకన్న అతని మనస్సునకు సదుపదేశముచేత ఆయాసము కలిగించుట మేలు.

**111.** వెజ్జు, గురువు, మంత్రియు ఏరాజునకు ఇచ్చకము చెప్పుదురో, ఆ రాజు దేహమును ధర్మమును శీఘ్రముగా కోలుపోవును. దేవా, వినుము;—

**112.** దైవవశమున ఒకనికి లభించినట్టిది తనకును లభించును, అని తలఁచి పెను



లోభముచే సన్న్యాసిని చంపి మంగలి మరణదండనం బడసెను.'

అది యెట్లని రాజడుగ మంత్రి వక్కాణించుచున్నాఁడు:—

కథ. ౯.

అయోధ్యలో చూడామణి యను క్షత్త్రియుఁ డుండెను. అతఁడు ధనము కోరి అత్యంత క్లేశము నోర్చి కొంత నెలసిగమానికపు సామిని ఉపాసించినాఁడు. ఆ దేవుని యాజ్ఞచేత కుబేరుఁడు ఆక్షత్త్రియునికి కలలో అగపడి ఇట్లానతిచ్చెను.— 'ఈ రాత్రి తెల్లవాఱఁగానే నీవు క్షౌరము చేయించుకొని దుడ్డుఁగఱ్ఱ చేతఁబూని నీయింట దాఁగియుండుము. అంతట ముంగిటిలో సన్న్యాసి రాఁ గాంచినవెంటనే వానిని కనికరము లేక దుడ్డుతోఁ గొట్టి చంపుము. అంతట సన్న్యాసి తత్క్షణమే వరాలతో నిండిన గిండి యగును. దానిని పెట్టుకొని నీవు స్వేచ్ఛగా యావజ్జీవము సుఖముండుము.' సర్వమును అట్లే జరిగెను. క్షౌరము చేయుటకై వచ్చినట్టి మంగలి దానినెల్లఁ గాంచి ఆలోచించెను:— 'అహో! నిధి దొరకుటకు ఇదె యుపాయము! నేను కూడ ఇట్లేల చేయరాదు?' అప్పటినుండి ఆ మంగలి అట్లే దుడ్డుఁగఱ్ఱను చేత నుంచుకొని ప్రతిదినము సన్న్యాసి ఎవఁడేని వచ్చునా యని ఎదురు చూచుచుండెను. ఒకనాఁడు ఒకభిక్షుకుఁడు రాఁగా వానిని దుడ్డుఁగఱ్ఱతో మోఁది చంపెను. ఆ నేరమికి మంగలిని రాజపురుషులు కొట్టి చంపిరి. కావున 'పుణ్యముచేత ఒకనికి లభించినట్టిది' ఇత్యాదికముం జెప్పితిని.

రాజు వచించెను.—

**113** 'మునుపు జరిగిన వృత్తాంతమును చెప్పుకొనుటచేత పరుఁడు నిష్కారణమిత్త్రుఁడో విశ్వాసఘాతకుఁడో తత్త్వము ఎట్లు తెలియును? పోనీ. ఇప్పుడు చేయవలసినదానిని ఆలోచింతము. చిత్రవర్ణుఁడు మలయముకడ నున్నచో, మనము ఏమి చేయవలయును?' మంత్రి చెప్పుచున్నాఁడు.— 'దేవా, వచ్చిన వేగువలన నేను వింటిని- చిత్రవర్ణుఁడు తన మహామంత్రి యగు గద్దమాటను సరకు సేయ లేదని; అందువలన ఈ మూఢుని జయింపవచ్చును. ఏల యన,—

**114.** లుబ్ధుఁడు, క్రూరుఁడు, వశముతప్పినవాఁడు, అసత్య మాడువాఁడు, పొరఁబాట్లు సేయువాఁడు, పిఱికివాఁడు, చపలుఁడు, మూఢుఁడు, జోదులను అవమానించువాఁడును, అగు పగతుని సుఖముగా భేదింపవచ్చు నని చెప్పుదురు.

కావున ఇతఁడు మన దుర్గమును ముట్టడింపక ముందే, ఏటిదారులలో కొండదారులలో అడవిదారులలోను ఇతని దండును కూల్చుటకు సారసాది సేనాపతులను పంపుము.

అట్లును చెప్పఁబడియున్నది;—

**115.** దూరము నడచి బడలినదియు, ఏళ్లలోను కొండలలోను అడవులలోను ఇఱుకుకొన్నదియు, మహానాశకర మయిన నిప్పువలని యుపాయముచేత జంకినదియు,

ఆఁకలి దప్పులచే బాధపడు చున్నదియు,

116. పరాకుగా నున్నట్టిదియు, భుజించు చున్నదియు, రోగములచేతను కఱవు చేతను బాధపడు చున్నదియు, వ్యూహము తప్పినదియు, విస్తారము గానిదియు, వాన చేతను గాలిచేతను పసి చెడినదియు,

117. బురదయు ధూళియు నీరును కమ్మినదియు, చెదరినదియు—ఇట్టి యవస్థ లోని శత్రుసైన్యమును రాజు నాశము చేయవలయును. మఱియు;—

118. ముట్టడిభయమువలన రాత్రి నిద్రమాని అలసి పగలు నిద్రించుచు నిద్రచేత కలఁగియున్న సిపాయీలు గలదైన వైరిదండును రాజు తప్పక కూల్ప వలయును.

కావున ఏమఱుపాటున నున్న యాశత్రుని బలమును మన సేనాపతులు పోయి సందు దొరకినప్పుడెల్ల రేయుం బవలు చంపవలయును.' అట్లే జరుగఁగా చిత్రవర్ణుని సిపాయీలును పడవాళ్లును పెక్కండ్రు కూలిరి. అంతట చిత్రవర్ణుఁడు దిగులుపడి తన మంత్రి దూరదర్శితో నిట్లనియె;——'బాబూ, ఏల నన్ను ఒప్పరికించుచున్నావు? నే నెందయిన చెడునడవడి నడుచుకొంటినా? అట్లును చెప్పిరి;—

119 రాజ్యము దొరకినది గదా యని అయోగ్యముగా నడుచుకొనఁ గూడదు. ఉత్తమసౌందర్యమును ముదిమివోలె, సిరిని చెడునడవడి నాశము చేయును. మఱియు;-

120. సమర్థుఁడు సిరిని పొందును, పథ్యముగా భుజించు వానికి రోగ ముండదు, రోగము లేని వాఁడు సుఖము చెందును, పూనిక గలవాఁడు విద్యలో తుదముట్టును, వినయముకలవాఁడు ధర్మమును ధనమును కీర్తినిం బడయును.'

గద్ద యిట్లనియె;—'దేవరా, వినుము.

121. తెలియనివాఁ డయిన రాజు జ్ఞానవృద్ధులను సేవించుటచేత నీటి దగ్గటి చెట్టువలె ఎక్కుడు సిరిని పొందును. మఱియు;—

122. త్రాగుడు, స్త్రీ, వేఁట, జూదము, ధనము పాడుచేయుట, వాక్పారుష్యము, దండపారుష్యము, ఇవి రాజులకు దోషములు. మఱియు;—

123. సాహసమందు మాత్రమే ప్రీతిని వహించుటచేతఁ గాని కేవలోపాయ ప్రయోగములచేతనే మనస్సు పాడు చేసికొనుటచేతఁగాని, గొప్ప సిరులు పొంద శక్యము గావు. సిరులు నీతి శౌర్యముల మేళనమందు వసించును.

నీవు నీదండుయొక్క యుత్సాహమును చూచి సాహసమందే ప్రీతి వహించి నేను చెప్పిన యాలోచనలను ఆకలింపు సేయమియుగాక పరుసములు కూడ పలికితివి. ఆదుర్వినయమునకు ఈఫలమును అనుభవించుచున్నావు.—అట్లు చెప్పియున్నారు;—

124. చెడుమంత్రులు కలవానికి ఎవనికి నీతిదోషములు సంభవింపవు? అపథ్యము భుజించువానిని ఎవనిని రోగములు పీడింపవు? ఎవనికి సిరి మద మెక్కింపదు? ఎవనిని



మృత్యువు కొట్టదు? స్త్రీలు సేయు మాయలు ఎవనిని దుఃఖపెట్టవు?

125. సంతోషమును దిగులు, శరత్తును మంచుకారు, చీఁకటిని సూర్యుఁడు, చెలికానిని చేసిన మేలు మఱచుట, దుఃఖమును నిర్మలబుద్ధి, ఇడుమను నీతి, నిండుసిరి నైనను చెడునడవడి, పోనడఁచును.

అంతట నేను అనుకొంటిని—ఈరాజు తెలివిలేనివాఁడు; కాఁడేని నా నీతిశాస్త్రోపన్యాస మనువెన్నెలను మాట లనెడి యాతీవ కొఱవులతో చీఁకటి సేయునా? ఏల యనఁగా,—

126. స్వయముగా ప్రజ్ఞ లేనివానికి శాస్త్ర మేమి సేయఁగలదు? రెండు కన్నులును లేనివానికి అద్దము ఏమి సేయఁ గలదు?

అందువలన నేనును ఊరకుంటిని.'

అంతట రాజు కేలుమోడ్చి 'బాబూ, అవును, నావలన తప్పిదమే. ఇప్పుడు మిగిలియున్న దండుతో నయినను వింధ్యాద్రికి పోవుటకు ఉపాయము చెప్పుము.' అని యడిగెను. గద్ద తన మనస్సులో ఇట్లు ఆలోచించెను.—ఇందులకు ప్రతిక్రియ సేయుట సరియైన పని. ఏల యన;—

127. దేవతలయందు, గురువునెడల, ఆవులయెడ, రాజునెడల, బ్రాహ్మణుల యెడ, అట్లే బాల వృద్ధ రోగుల యెడను, ఎప్పుడును కోపమును అడఁచుకొనవలయును.

మంత్రి నవ్వి వెల్లడిగా ఇట్లనియె.—'దేవా, భయపడకు, ఊఱడిల్లుము; వినుము.

128. బెడిసిన వారిని కూర్చు పనియందు మంత్రుల ప్రజ్ఞయు, సన్నిపాతమును మాన్చు పనియందు వైద్యుల ప్రజ్ఞయు, ప్రకట మగును; అంతయు సరిగా నున్నప్పుడు నేర్పరి కానివాఁ డెవఁడు? మఱియు;—

129. తెలియనివారు స్వల్పమే ఆరంభింతురు, అంతలోనే మిక్కిలి వ్యాకుల పడుదురు; సంస్కారవంత మయిన బుద్ధికలవారు గొప్పకార్యము లారంభించియు కలఁక లేక స్వస్థముగా నుందురు.

కావున ఇట నీప్రతాపముచేతనే దుర్గమును పడఁగొట్టి కీర్తిప్రతాపములతో కూడిన వానినిగా నిన్ను త్వరగా వింధ్యాద్రి చేర్చెదను.' 'ఇప్పుడు ఈకొంచెపాటి దండుతో అది ఎట్లు సమకూడును?' అని రాజడిగెను. గద్ద చెప్పుచున్నది.—'దేవా, సర్వము సమకూడును. ఏల యన విజయ మొందఁ గోరినవానికి విలంబముగా పని జరుపుట విజయ మొందుటకు తప్పని లక్షణము. కావున నిపుడు దుర్గద్వారమును ముట్టడింపుఁడు.'

పంపిన వేగుకొంగ వచ్చి హిరణ్యగర్భునికి అవృత్తాంతమును చెప్పినది.—'దేవా, దండు కొంచెమే కలిగియు ఈరాజు చిత్రవర్ణుఁడు గద్ద చెప్పిన యాలోచన నవలంబించి మన దుర్గమును ముట్టడించుటకు వచ్చుచున్నాఁడు.' అంతట రాజహంసుఁడు జక్కవను

'సర్వజ్ఞుఁడా, ఇప్పు డేమి సేయవలసినది?', అని యడిగెను. జక్కువ చెప్పుచున్నది.— 'మన దండులో చేరయుండు వాళ్లను విచారించి బంగారము వస్త్రములు లోనగునవి యిచ్చి వారివారికి తగిన సత్కారము సేయవలసినది. ఏల యనఁగా,—

130. ఎవఁడు తప్పుదారికి దొరలిన గవ్వనుకూడ వేయి వరహాలవలె ఎత్తి కైకొనునో, సమయము వచ్చినప్పుడు కోట్లయిన చేయి విడుచునో, ఆ రాజశ్రేష్ఠుని సిరి పోఁబోదు. మఱియు;—

131. యజ్ఞమునందు, పెండ్లిలో, వ్యసనమందు, వైరినాశమందు, కీర్తిఁ దెచ్చు పనిలో, మిత్త్రులను సంపాదించుటలో, ప్రియభార్యలయందు, దరిద్రులయిన బంధువులయందు,— ఈ యెనిమిదింటను ఓ రాజా, అతివ్యయ మనునది లేదు. ఏల యన,—

132. మూర్ఖుఁడు కొంచెము వ్యయమునకు వెఱచి సర్వనాశము చేసికొనెను. సుంక మీఁబట్టునను మహాభయముచేత బుద్ధిమంతుఁ డెవఁడు అమ్మకపు సరకును పాఱవైచును?'

రా జడిగెను.—'ఇప్పు డతివ్యయము సేయుట ఎట్లు తగును? ఆపన్నివారణకై ధనమును దాఁపవలసిన దని గదా పెద్దలు చెప్పినారు?' మంత్రి యనెను.—'శ్రీమంతులకు ఆపద లేల కలుగును?' రాజు.—'ఎప్పు డయిన సిరి చలిగానేని?' మంత్రి మరల ననియె.— 'కూడఁబెట్టిన ధనము పోవును. కావున, దేవా, లోభము మాని నీ జోదులను ఈవిచేతను గౌరవముచేతను ముందఱికి తెమ్ము. అట్లు చెప్పినారు.—

133. ఒండొరుల నెఱిఁగినవారు, సంతోషించినవారు, ప్రాణము వదలుటకు కంకణము కట్టువారు, గొప్పకులమువారు, సత్కరింపఁబడినవారై శత్రు బలమును చక్కఁగా జయింతురు. మఱియు;—

134. మంచి నడవడియు గట్టి నిశ్చయమును కలవారును శూరులును అగు మంచి బంట్లు ఒక్క మొనవారై ఏనూఱుగురే అయినను శత్రువుల దండును చక్కఁగా గెలుతురు. మఱియు;—

135. తారతమ్య మెఱుఁగనివానిని క్రూరుని కృతఘ్నుని కేవల స్వోదరపూరకుని పెద్దలు సయితము త్యజింతురు. ఇతరుల మాట చెప్పవలయునా? ఏల యనఁగా.

136. సత్యము, శౌర్యము, దయ, ఈవి, ఇవి రాజుయొక్క గొప్ప గుణములు ఇవి లేని రాజును నిందింతురు.

ఇట్టి సందర్భములో మంత్రులనే గౌరవింపవలయును.

137. రాజునకు వృద్ధియైన తనకు వృద్ధిగా, రాజునకు క్షయమైన తనకు క్షయముగా, ఏ మంత్రి రాజుతో తన్ను కట్టిపైచికొన్నాఁడో మిగుల నమ్మకమయిన యా మంత్రిని రాజు తన ప్రాణములకును ధనమునకును రక్షకునిఁగా నియమింప వలయును.



ఏల యన;—

138. వంచకుఁడు గాని స్త్రీ గాని పిల్లవాఁడు గాని ఏ రాజునకు మంత్రులుగా నుందురో ఆ రాజు తుపానుగాలిచేత సముద్రములో ఓడవలె దుర్నీతిచేత కార్యములో భంగ మొందును. విను దేవరా.—

139. సంతోష కోపములందు సమబుద్ధియు, శాస్త్రోక్తవిషయములందు నమ్మకమును, ఎప్పుడును సేవకులను ఒప్పరికింపమియు, ఎవనిగుణములో ఆరాజునకు భూమి ధన మిచ్చును.

140. ఎవరికి నిశ్చయముగా వృద్ధిక్షయములు తనతోడివే అగునో అట్టివారినితన మంత్రులు గదా యని రాజు ఎప్పుడును తిరస్కరింపఁ గూడదు. ఎందుల కనఁగా—

141. మదాంధుఁ డయిన రాజునకు సంకరజాతి యేనుఁగునకుంబోలె జాతి పడుచున్నప్పుడు మిత్త్రుఁడయిన మంత్రియొక్క చేతయే తొండమునకుం బోలె చేతికి ఊఁత.

అంతట మేఘవర్ణుఁడు వచ్చి నమస్కరించి యిట్లనియె.— 'దేవరా, నావైపు చూడ్కి ననుగ్రహింపుము. వీఁడుగో, శత్రువు యుద్ధము కోరినవాఁడై కోటహజారములో నున్నాఁడు. కావున ఏలినవారి యాజ్ఞచే వెలువడి నా పరాక్రమమును చూపెదను. అందువలన ఏలినవారి ఋణమును తీర్చుకొనియెదను.' చక్రవాకుఁడు ఇట్లనియె.—'అట్లు వలదు, వెలువడి యుద్ధము చేయఁదగునేని కోటను అండఁగొని యుండుట నిష్ప్రయోజనము. మఱియు;—

142. మొసలి బెట్టిద మయ్యును నీటినుండి వెలువడిన దిక్కుమాలి పోవును; అడవినుండి వెలువడిన సింహము నిశ్చయముగా నక్కతో సమాన మగును.'

కాకి చెప్పుచున్నది;—'రాజా, పోయి పోరిని నడిపింపుము. ఏల యనఁగా,—

143. రాజు దండును గౌరవించి స్వయముగా చూచుచు యుద్ధము చేయింపవలసినది. ఏలిక ఆసరాగా నున్న కుక్కయు నిశ్చయముగా సింహమువలె విక్రమింపదా?'

అంతట వారందఱును కోట దర్వాజాకడకుం బోయి ఘోరయుద్ధముం గావించిరి.

ఆమఱునాఁడు చిత్రవర్ణరాజు గద్దతో ననియె;—'బాబూ, నీ ప్రతిజ్ఞను ఇప్పుడు నెఱవేర్పుము.' గద్ద యనియె;— 'దేవా, విను.—

144. కాలము నోర్వనిది, మిక్కిలి చిన్నది, మూర్ఖుఁడును వ్యసనాసక్తుఁడు నగు దొర కలది, రక్షణ లేనిది, పిఱికిజోదులు గలది, అగుదుర్గము గలిగియుండుట దుర్గవ్యసన మని చెప్పఁబడును. అది యిప్పు డిట లేదు.

145. వైరిపాళెములో భేదములు పుట్టించుట, వేసిన ముట్టడిని చిరకాలము మాన కుండుట, హెచ్చరిక లేనప్పుడు కటాలున పైఁబడి కొట్టుట, వాఁడిమగంటిమి-ఈ నాలు

గును కోటను పట్టుటకు నుపాయములుగా చెప్పఁబడినవి.

ఇఁదు శక్తికొలఁది యత్నము చేసెదము. (చెవిలో చెప్పుచున్నాఁడు) ఇట్లు ఇట్లు.' తర్వాత ప్రొద్దు పొడుచుక మునుపే నాలుగు ద్వారములయందును పోరాటము మీఱుచుండఁగా, కోటలోపల ప్రతియింటికిని కాకి నిప్పు పెట్టినది. అంతట పట్టువడినది దుర్గము పట్టువడినది అని గొల్లు వినియు, ఇండ్లయందు నెక్కొంట నిప్పునంట లెగయుచుండుటం గాంచియు, రాజహంసుని బంట్లును ఇంకదుర్గమందు వసించియున్న యితరులును తటాలున మడుఁగులో చొచ్చినారు. ఏల యనఁగా;—

146. చక్కఁగా చేసికొన్న యాలోచనను, చక్కఁగా పరాక్రమించుటను, చక్కఁగా పోరుటను, చక్కఁగా పాఱిపోవుటను, సమయము వచ్చినప్పుడు నెఱవేర్పవలయును, మఱి విచారింపఁ గూడదు.

రాజహంసుఁడు సుఖముగా నుఁడినవాఁడు స్వభావముచేత మెల్లఁగా నడచువాఁడు సారసునితోఁ గూడ నుండఁగా వారిని ఇరువురను చిత్రవర్ణుని సేనాపతి కుక్కుటుఁడు (కోడి) వచ్చి చుట్టుకొన్నాఁడు.

హిరణ్యగర్భుఁడు ఇట్లనియె;— సేనాపతి, సారసుఁడా, ఏల నాకోసము నిన్ను చంపుకొనెదవు? ఇప్పటికిని నీకు పోవుటకు శక్తియున్నది. కావున పోయి నీటఁ జేరుము. నాకొమరుని చూడామణిని సర్వజ్ఞునిసమ్మతిమీఁద రాజును చేయుము.' సారసుఁ డనియె;— 'దేవా, ఇట్టి సహింపరానిమాటను చెప్పవలదు, ఎంతకాలము చంద్రసూర్యులు ఆకాసములో నుందురో అంతవఱకు ఏలినవారు సర్వోత్కర్షతో నుండవలయును. నేనే గదా దుర్గరక్షకుఁడను. నా రక్తమాంసములతో అలికిన దారిని శత్రువు కోటలో ప్రవేశించును గాక. మఱియు;—

147. మన్నించువాఁడు ఇచ్చువాఁడు గుణమును గ్రహించువాఁడును అగు దొర భాగ్యవశమున దొరకును.'

రా జనియె;— 'పవిత్రుఁడును సమర్థుఁడును అనురక్తుఁడును అగు సేవకుఁడు దొరకుట మిక్కిలి అరుదు.'

సారసుఁడు చెప్పుచున్నాఁడు;—

148. యుద్ధమునఁ దక్క మఱి చావుభయము లేదేని ఇటనుండి అవలి కేఁగుట తగును. మఱి చావు ప్రాణికి తప్పదేని వృథాగా (పలాయనముచేత) ఏలకీర్తిని మలినము చేసికొనుట? మఱియు;—

149. గాలికి ఎగయుచున్న యాలచలనములవలె క్షణమాత్రమున పగిలిపోవున దైవ యీ జన్మములో ఒరులకొఱకు ప్రాణమును వ్యయించుట పుణ్యవశమున సంభవించును.



ప్రభూ, నీవు ఏలికవు, ఎల్లవిధముల నిన్ను కావవలయును. ఏల యన;—

150. ప్రజ సంపన్న మైనను ఏలికను వదలి జీవింపదు. ధన్వంతరియే వైద్యము సేయవచ్చినను ప్రాణము పోయినవానికి ఏమి చేయఁగలఁడు? మఱియు;—

151. రాజు కన్నుమూసిన లోక మంతయు కన్నుమూయును; సూర్యుఁడు ఉదయించినప్పుడు కమలము ఎట్లో అట్లే రాజు మేలుకొన్నయెడల లోకమును మేలుకొనును.

152. రాజు, మంత్రి, రాష్ట్రము, కోట, బొక్కసము, దండు, మిత్త్రుఁడు, ప్రజలు, ఊరి శిల్పి సంఘములును, రాజ్యాంగములు.—అందును రాజు ప్రధానాంగము.'

అంతట, కోడి వచ్చి రాజహంసుని దేహమున కరవాడి గోళ్లతో గాయములు గావించినవి. వడిగా వచ్చి సారసుఁడు అడ్డపడి రాజును నీటఁ ద్రోచినాఁడు. తర్వాత కోడి గోళ్ల దెబ్బచేత ఒడలు శిథిల మయిన సారసుఁడు కుక్కుటసేనను మిక్కిలి రూపు మాపెను. కోడియు సారసుని ముక్కుదెబ్బకు చచ్చెను. పెక్కుపక్షులు గుంపై ఒక్క సారసుని పొడిచి చంపినవి. చిత్రవర్ణరాజు దుర్గముం జొచ్చి దుర్గమం దున్న ధనమెల్ల దోఁచించి వందుల జయశబ్దములచే ఆనంద మొంది వెలుపలి దండుపాళెమునకుం బోయెను.

రాజపుత్త్రులు చెప్పిరి;— 'ఆ రాజహంసుని దండులో సారసుఁ డొక్కఁడే పుణ్యవంతుఁడు, ఎట్లనఁగా అతఁడు తన దేహము నిచ్చి రాజును కాచినాఁడు. ఏల యన;

153. ఆవులన్నియు ఎద్దురూపుకోడెలను ఈన నే ఈనును, కాని కొమ్మశోకుమారస్వామిని గ్రోఁకునట్టి (శివుని) యాలఁబోతును ఈనునది ఏదో ఒక్కయావే.'

విష్ణుశర్మ చెప్పెను. 'ఈ మహాసత్త్వుఁడు స్వభావముచేతనే తనదేహ మిచ్చి విలిచికొన్నట్టి యుత్తమలోకములలో విద్యాధరాంగనల పరివారముతో శాశ్వతి భోగములను అనుభవించును గాక. అట్లే చెప్పఁబడినది;—

154. ఏశూరులు ఏలినవానియందు భక్తిగలవారును కృతజ్ఞులును ఐ యుద్ధములలో అతనికొఱకు ప్రాణము నిత్తురో, ఆనరులు స్వర్గముం జెందుదురు.

155. ఎక్కడెక్కడ శత్రువులు కమ్ముకొని ఏశూరుని చంపుదురో ఆశూరుఁడు పందతనముం బొందఁడేని తఱుఁగని లోకములను అనుభవించును.

మీరు విగ్రహమును వింటిరి.' రాజపుత్త్రులనిరి— 'మేము విని సుఖము పొందినారము.' విష్ణుశర్మ యిట్లనియె,— 'ఇట్లును అగుఁ గాక.

భూపాలురగుమీకు ఏనుఁగులతోను గుఱ్ఱములతోను కాల్బలముతోను పోరాటము ఎప్పుడును పొసఁగ కుండును గాక; నీతి మంత్రము లనెడు గాలిచేత తఱుమఁబడిన వారై మీవైరులు కొండగుహలయందు దాఁగుదురు గాక.'

విగ్రహము సమాప్తము.

---

# హితోపదేశము.



## సంధి.

వెండియు కథ ఆరంభించినసమయమున రాజపుత్త్రులు 'అయ్యా, మేము విగ్రహము విన్నారము, ఇప్పుడు మాకు సంధిని చెప్పుఁడు' అని యడిగిరి. విష్ణుశర్మ యిట్లనియె:—వినుఁడు, సంధినికూడ చెప్పెదను. అందులకు ఇది మొదటిశ్లోకము.—

1. 'ఆ జరిగిన గొప్ప యుద్ధములో రాజుల యిరువుర సేనలు నాశము కాఁగా, నిలిచియున్న గద్దజక్కవలు క్షణములో మాటచేత సంధి కావించినవి.'

అది యెట్లని రాజపుత్త్రు లడిగిరి. విష్ణుశర్మ చెప్పందొడంగెను;—

అంతట రాజహంసుఁడు—'మనదుర్గములో నిప్పు పెట్టిన వాఁ డెవఁడు? పగతుని వాఁడా, లేక, పగతుని ప్రేరణచేత మనదుర్గమందు నివసించుచున్న యెవఁ డైనను?' అని యడిగెను. జక్కవ యిట్లనియె;—'దేవరా, ఏలినవారికి నిష్కారణ బంధు వయిన యా మేఘవర్ణుఁడును అతని పరివారమును ఇప్పుడు కనఁబడకున్నారు. కావున ఇది అతని పని యని తలంచెదను.'

రాజు క్షణ మాలోచించి యిట్లనియె;—'అట్లే అయియుండును, ఇది నాదురదృష్టము. అట్లే చెప్పిరి;—

2. అత్యపరాధము దైవముది గాని మంత్రులది గాదు, యత్నపూర్వకముగా చక్కఁగా సమకూడిన కార్యము దైవయోగముచేత చెడి పోవును.'

మంత్రి పలికెను. ఇట్లు పెద్దలు చెప్పియున్నారు;—

3. మూర్ఖమనుష్యుఁడు కష్టదశలో పడి దైవమును నిందించును. గాని తానుచేసిన చేఁతయు తనతప్పులునే ఆదశను తెచ్చినవని యెఱుంగ నేరఁడు. మఱియు;—

4. తనమేలు కోరిన మిత్త్రుల మాటబడి ఎవఁడు నడచుకోఁడో ఆదుర్బుద్ధి కఱ్ఱ నుండి జాఱిపడిన తాఁబేటివలె నశించును. మఱియు;—

౫. మాటను ఎప్పుడును కాపాడుకొనవలసినది, మాటవలన వినాశము కలుగును. అంచలు కొనిపోవుచున్న తాఁబేలు నేలఁబడుటయే ఇందులకు ఉదాహరణము.'

అది యెట్లని రాజడుగఁగా మంత్రి చెప్పుచున్నాఁడు.—

### కథ. ౧.

మగధదేశమునందు ఫుల్లోత్పల మని సరస్సు కలదు. అందు చిరకాలము సంకట వికటము లను హంసలు వసించి యుండినవి. వానిమిత్త్రము కంబుగ్రీవ మను తాఁబేలు కూడ



అందు వసించియుండెను. ఇట్లుండ నొకప్పుడు జాలరులు అటకు వచ్చి 'మనము ఈదినము గడపి తెల్లవాఱఁగానే ఇటకు వచ్చి చేఁపలను తాఁబేళ్లను వేటాడుదము.' అని పలికి కొనిరి. ఆమాట విని తాఁబేలు హంసలతో 'మిత్త్రులారా, విన్నారా జాలరులమాటలను? ఇప్పుడు నే నేమి సేయవలయును?' అని యడిగెను. 'తెలిసినది, కాని తెల్లవాఱఁగానే అందులకు తగినట్లు చేసికోవచ్చును.' అని హంసలు పలికినవి. కూర్మము చెప్పుచున్నది.—'అట్లు గాదు, ఇట్టి సందర్భమును ఒక దానిని నే నిటనే చూచి యున్నాను;—ఇట్లు చెప్పినారు;—

6. అనాగతవిధాతయు, ప్రత్యుత్పన్నమతియు, ఈ యిరువురును సుఖముగా వర్ధిల్లిరి, యద్భవిష్యుఁడు నాశ మొందెను.'

అది యెట్లని ఆ రెండు నడిగినవి; తాఁబేలు చెప్పుచున్నది.—

### అవాంతరకథ. ౧.

పూర్వము ఈ చెఱువులోనే ఇట్టి జాలరులే వచ్చినప్పుడు, మూఁడుచేఁపలు ఇట్లు ఆలోచించుకొన్నవి. వానిలో అనాగతవిధాత (అనఁగా రాఁబోవుదానికి ముందే ఉపాయము చేసికొనునట్టిది) అనుపేరి చేఁప 'నేను వేఱు జలాధారమునకు పోయెదను' అని చెప్పి పోయి మఱియొక మడుఁగుం జొచ్చినది. రెండవది ప్రత్యుత్పన్నమతి (అనఁగా అప్పటికి తోఁచిన ప్రకారము సేయునది) అనుపేరి చేఁప చెప్పినది.—'భవిష్యత్తున ఇది జరుగును ఇది జరుగదు అని నమ్మకము లేనందున, నే నెచ్చటికిని వెళ్లను. కార్యము వచ్చినప్పుడు అందులకు తగినట్లు చేసెదను. అట్లు చెప్పినారు;—

7. వచ్చిన యాపదను సమాళించుకొనువాఁడు బుద్ధిమంతుఁడు; వర్తకునిభార్య ప్రత్యక్షమున జారుని కమ్ముదల చేయుట యిందులకు ఉదాహరణము.'

అది యెట్లని యద్భవిష్యుఁడు అడుగఁగా ప్రత్యుత్పన్నమతి చెప్పుచున్నాఁడు.—

### అవాంతరకథ ౨

విక్రమపురమందు సముద్రదత్తుఁ డని వర్తకుఁ డుండెను. వానిభార్య రత్నప్రభ యనునది ఎల్లప్పుడు ఒకానొకసేవకునితో క్రీడించుచుండును, ఏల యనఁ;—

8. స్త్రీలు రూపమును కోరరు, అవయవనిశ్చయమునేని కోరరు; సురూపుఁ డయినను కురూపుఁ డయినను మగవాఁ డగుచుం జాలును, పొందుదురు. మఱియు;—

9. చక్కఁగా గట్టిచేసికొన్నను శాస్త్రమును మరల చింతన సేయుచుండవలయును; రాజును కొలుచుచునే యుండియు అతనివలన మనస్సులో భయము గలిగి యుండవలయును; తొడలో కూర్చుండియున్నను జవరాలిని నమ్మరాదు; శాస్త్రమును రాజును, జవ్వనిని, వశముచేసికొనుట ఎక్కడిది?

ఒకప్పుడు ఆ రత్నప్రభ ఆ సేవకుని మొగమును ముద్దుగొనుచుండఁగా సముద్రదత్తుఁడు చూచెను. అంతట చెడిపె మగనికడ కేఁగి యిట్లనియె;—'ప్రాణేశ్వరా, వీఁడు కడుసుఖి, ఏలయన నీకై తెచ్చిన కర్పూరమును వీఁడు తినుచున్నాఁడు, వీనినోట కప్పురంపుఁ దావిని నేను గ్రోలితిని', ఆమాట విని సేవకుఁడు కోపగించి యిట్లనియె;—'ఏయజమానియింట ఇట్టియిల్లాలు కలదో, ప్రతిక్షణము సేవకుని నోటిని వాసన చూచునది, ఆయింట సేవకుఁడు ఎట్లుండును?' ఇట్లని వాఁడు లేచి నడచెను. అంతట వర్తకుఁడు వానిని ప్రయత్నపూర్వకముగా మంచిమాటలాడి ఎట్టకేలకు నిలుపుకొనెను. కావున 'వచ్చిన యాపదను' ఇత్యాదికమును నేను చెప్పితిని

---

అంతట యద్భవిష్యుఁడు(ఏదికానున్నదో అదియగుఁగాక అనువాఁడు) ఇట్లనియె;—

10. 'ఏది కానుండ లేదో అది కాదు, కాఁగలది కాకమానదు;—చింత యనువిషమును విఱుచున దైన యీ మందును ఏల త్రాగరాదు?'

తర్వాత తెల్లవాఱినంతట ప్రత్యుత్పన్నమతి వలలోపడి చచ్చినట్లు తన్ను అగపఱచుకొనెను; జాలరులు వలనుండి తివిచి పాఱవేయఁగా శక్తికొలఁది ఈఁది లోఁతునీళ్లం జొచ్చెను. యద్భవిష్యుఁడు జాలరులకు దొరకి వారిచేతఁ జచ్చెను.

---

కావున నేను 'అనాగతవిధాత' ఇత్యాదికమును జెప్పితిని. కావున ఎట్లు నేను వేఱొక మడుఁగుం జేరుదునో అట్లు చేయుఁడు.' హంసలు 'మఱి యొక జలాధారము చేరిన తర్వాత నీకు సేమమే గాని నేలను పోవుచుండఁగా నీగతి యెట్లు?' అని అడిగినవి. 'నన్ను మీరిరువురును ఆకాశమార్గమున కొనిపొండు' అని తాఁబేలు అడిగినది. అందులకు ఉపాయ మేమని హంసలు అడుగఁగా, 'మీరిరువురును నోట నొకకఱ్ఱను కొనలయందు కఱచుకొనుఁడు, నేను దానిని నడుము కఱచుకొనియెదను. అంతట మీ ఱెక్కబలమున నన్ను ఆకాశమున మోచికొనిపొండు.' అని తాఁబేలు చెప్పెను. హంసలు చెప్పినవి.— 'ఈయుపాయము చక్కఁగానే యున్నది. కాని,—

11. బుద్ధిమంతుఁడు ఉపాయ మాలోచించునపుడు అపాయమును కూడ ఆలోచించుకొనవలయును, ఎట్లనఁగా తెలివిమాలినకొంగ చూచుచుండఁగానే దాని పిల్లలను ముంగిస తినివైచినది.'

తాఁబేలు అడిగినది 'అది యెట్లు' అని హంసలు చెప్పుచున్నవి.—

## అవాంతరకథ. 3.

ఉత్తరాదిలో గృధ్రకూట మను పర్వతము కలదు. అచ్చటనే నర్మదానదియొడ్డున మఱ్ఱిచెట్టుమీఁద కొంగలు కాఁపుర ముండినవి. ఆచెట్టు క్రింద బొక్కలో పాముండినది.



అది వాని లేత పిల్లలను తినివైచుచుండినది. అంతట దుఃఖపీడితము లయిన కొంగల కలవరమును విని ఒక ముసలి కొంగ యిట్లనియె;—'మీరు ఇట్లు చేయుఁడు, చేఁపలను తెచ్చి ముంగిస బొక్కనుండి పాముబొక్కవఱకు వరుసగా ఒక్కొక్కటిగా వేసి రండు. అంతట ఆతిండికి ఆసించి ముంగిసలు వచ్చి పామును చూచెడిని; స్వభావవైరముచేత పాము కన్నముం జొచ్చి పామును చంపెడిని.' కొంగలు అట్లే చేసినవి. ముంగిసలును పాము కన్నముం జొచ్చి దానిని చంపినవి. అటుతర్వాత ముంగిసలు చెట్టుమీఁది పక్షిపిల్లల కూఁతలను విని చెట్టెక్కి కొంగల కన్నుల యెదుటనే ఆపిల్లలను భక్షించినవి.

---

కావున మే మిరువురమును 'బుద్ధిమంతుఁ డుపాయము' ఇత్యాదికమును చెప్పితిమి. మేము కొనిపోవుచుండఁగా నిన్నుఁ గని లోకులు ఆశ్చర్యపడి ఏమేమో పల్కుదురు; దానిని విని నీవు బదులు పలుకుదువేని, అంతట నీచావు నిక్కము. కావున ఇచ్చటనే యుండుట ఎల్లవిధముల మంచిది. తాఁబేలు ఇట్లనియె.—'ఏమి నే నంత మూర్ఖుఁడనా? నేను బదులు పలుకను. నే నేమియు మాటలాడను.' అట్లే జరుగఁగా ఆకాశములో హంసలు మోచికొని పోవుచున్న యాతాఁబేటిం గాంచి పసులకాపరులు అందఱు వెంటఁ బరుగిడుచు 'అహో ఏమి వింత! పక్షులు తాఁబేటిని మోచికొని పోవుచున్నవి.' అని పలికిరి. అందులో నొకఁడు 'ఈతాఁబేలు నేలఁబడెనేని నేను ఇక్కడనే వండుకొని తినెదను.' అనెను. మఱియొకఁడు 'ముక్కలుగా భాగించుకొని కొని పోవలయును.' అనెను. మఱియొకఁడు 'ఇంటికి కొనిపోయి కాల్చుకొని తినవలయును.' అనియెను. ఈప్రకారము ఓర్వరాని క్రూరవాక్యములను విని తాఁబేలు కోపము పెంపున తొంటి తెలివి తప్పి 'మీరు బుగ్గియే తిందురు.' అని పలుకుచు కఱ్ఱనుండి పడి పసుల కాపరులచేత చచ్చెను. కావున 'తన మేలు గోరిన మిత్త్రుల మాట' ఇత్యాదికమును నేను చెప్పితిని.

---

అంతట వేగు కొంగ అచటికి వచ్చి అతనితో నిట్లనియె.—'స్వామీ, ముందే నేను చెప్పలేదా, ప్రతిక్షణమును దుర్గమును సోదనచూచుకొనుచుండవలయు నని? ఆపని మీరు చేయనైతిరి; ఆయేమఱుపాటునకు ఈఫలమును అనుభవించితిరి. గద్ద పంపిన యీ కాకి మేఘవర్ణుఁడు మనదుర్గమునకు నిప్పు పెట్టినాఁడు.'

రాజు నిట్టూర్పు పుచ్చి యిట్లనియె;—

12 'యాచనచేతఁగాని ఉపకారముచేతఁగాని ఎవఁడు పగతురను నమ్మునో, వాఁడు చెట్టుకొనను నిద్రించినవానివలె పడి మేల్కొనును.'

వేగు వచించెను.—"అట్లు దుర్గమును తగులఁబెట్టి మేఘవర్ణుఁడు పోయి వర్ణింపఁ

గానే చిత్రవర్ణుఁడు సంతోషించి 'ఈ మేఘవర్ణుని ఈ కర్పూరద్వీపమునకు రాజుగా నభిషేకింపుఁడు' అని యానతిచ్చెను. అట్లు చెప్పియున్నారు;—

13. పెట్టినపనిని నెఱవేర్చిన సేవకుని చేఁతను వీటిఁబుచ్చఁగూడదు. అతనిం గని ప్రయోజనముచేతను మనస్సుచేతను మాటచేతను సంతోషపెట్టవలయును.''

జక్కవ 'స్వామీ, నేను చెప్పుచున్నమాటను చక్కఁగా వినవలయును.' అని హెచ్చరించెను. అంతట రాజు 'ఇంకను ఏమి విశేషము, ఇంకను ఏమి విశేషము?' అని యడిగెను. వేగ వక్కాణించెను.— అంతట ప్రధానమంత్రి గద్ద యిట్లనియె.— ఏలినవాఁడా, ఇది సరిగాదు. వేఱువిధముగా అనుగ్రహము చూపుము, ఏల యన,—

14. ఓరాజా, అరసికోశేఁని వానికి యుక్తి చెప్పుట ఊఁకను దంపుట; నీచులకు ఉపకారము చేయుట ఇసుకలో ముద్రవేయుట. మఱియు;—

15. గొప్పవారి పదవియందు నీచుని ఎప్పుడును ఉంపఁగూడదు. సిగమానిక ముండవలసినచోట పావుకోటిని ఎవరును ఉంపఁగోరరు. అట్లు చెప్పియున్నారు;—

16. నీచుఁడు ఉత్తమపదవిని పొంది ఏలికను చంపఁగడంగును; ఎలుక పులియై మునిని చంపఁబోవుటయే యిందులకు నిదర్శనము.'

అది యెట్లని చిత్రవర్ణుఁ డడిగెను. గద్ద చెప్పుచున్నది.

కథ. 2.

గౌతమమునియొక్క యాశ్రమములో మహాతపుఁడని యొక ముని యుండెను. ఆయనకు ఆశ్రమముచెంత కాకి నోటనుండి జాఱిపడిన యెలుకపిల్ల యొకటి కనఁబడెను. ఆయన దానిని జాలిగొని నివ్వరినూక పెట్టి పెంచెను.

ఆయెలుకను తినుటకు ప్రయత్నపూర్వకముగా వెదకుచు పిల్లి రాఁగాఁ గాంచి ముని భయపడియున్న యాయెలుకను తపోమహిమచేత బల్లిద మయిన పిల్లినిం జేసెను. పిల్లి కుక్కకు భయపడినది. అంతట దానిని ముని కుక్కం జేసెను. కుక్క పులికి వెఱచినది. అంతట నాతఁడు దానిని పులిం గావించెను. ఆపులిని సయితము ముని తొంటి యెలుకనుంబోలె ప్రోచుచుండెను. అంతట అచ్చటిజను లందఱు ఆమునిని పులిని చూచి 'ఈముని యెలుకను ఈపులిగా జేసినాఁడు' అని వచించుచుండిరి. దానిని విని పులి దుఃఖించి 'ఈముని బ్రతికియున్నంతకాలము నాకు అవమానకర మయినట్టిది నా వాస్తవ స్వరూపమును గూర్చిన యీవాదు పోదు.' అని తలంచుకొని మునిం జంప నుంకించెను. దానియిచ్ఛ యెఱింగి ముని 'మరల ఎలుక వగుము' అని పలికి ఎలుకనే గావించెను.

---

కావున నేను 'నీచుఁడు ఉత్తమపదవిం బొంది' ఇత్యాదికముం జెప్పితిని. మఱియు;—దేవా, ఇది అలఁతి యని తలంపఁగూడదు. వినుము.



17. పెద్దవి నడితరపువి చిన్నవి అగు పెక్కుచేఁపలను తిని కొంగ అబూతిచేత ఎండ్రిని సేకరించినందున చచ్చినది.'

అది యెట్లని చిత్రవర్ణుఁ డడుగఁగా మంత్రి చెప్పసాగెను.

కథ. 3.

మాళవదేశమందు పద్మగర్భ మను పేరి తటాకము కలదు. అందొక ముసలికొంగ శక్తి లేనిది వెంగఁబెట్టుకొన్నట్టుగా అగపడుచు నిలిచియుండెను. దాని నొక యెండ్రి చూచి 'అయ్యా, ఏల యిట్లు నీవు తిండి మానుకొని యున్నావు?' అని యడిగెను. కొంగ చెప్పుచున్నది.—'చేఁపలు నాకు ఆహారము, వానిని ఇట తప్పకుండ రేపు తెల్లవాఱఁగానే జాలరులు వచ్చి చంపుదు రని ఊరిచెంత వార్త వింటిని. అందువలన నాకు జీవనభంగముచే మరణము మూఁడిన దని తెలిసికొని తిండిమీఁద సయితము అక్కఱ పుట్టక యున్నాఁడను.' అంతట చేఁపలు ఆలోచించినవి.—ఈసమయములో ఇది మనకు ఉపకారిగానే కనఁబడుచున్నది. కావున దీనినే మన క్షేమయిన నుపాయము చెప్పుమని యడుగుదము. అట్లును చెప్పిరి;—

18. ఉపకరించుపగవానితో సంధి చేయఁ దగును గాని అపకరించు మిత్త్రునితో చేయఁదగదు. ఉపకారాపకారములే సుమా మిత్త్రులకును శత్రులకును చూడవలసిన లక్షణము.'

అంతట 'మాకేమి రక్షణోపాయము?' అని చేఁప లడిగినవి. 'వేఱు జలాధారమునకు పోవుటయే మీరు బ్రదుకుటకు ఉపాయము. అచటికి మిమ్ము ఒక్కొక్కరినిగా నేను కొంపోయెదను.' అని కొంగ చెప్పెను. చేఁపలు భయంబున అట్లే చేయుమని యడిగినవి. అంత నా టక్కరి కొక్కెర చేఁపలను ఒకటొకటిగా కొనిపోయి ఒకచోట పెట్టుకొని తిని మరల వచ్చి 'వానిని నేను వేఱు జలాధారముం జేర్చితిని' అని చెప్పెను. అంతట ఎండ్రి 'కొంగా కొంగా, నన్నుఁగూడ నచటికిం గొనిపొమ్ము' అని యడిగెను. అంతట కొక్కెర మున్నెన్నఁడు నెఱుఁగని యెండ్రి మాంసమును కోరినదై ప్రీతితో దానిని కొనిపోయి మెట్టనేలం బెట్టెను. ఎండ్రియు చేఁపముండ్లు వెదచల్లియున్న నేలను చూచి 'అయ్యో! చెడితిని గదా దురదృష్టుఁడను! కానీ యిప్పటికి తగినట్లు వ్యవహరించెదను.' అని ఆలోచించుకొని కొక్కెర మెడను కత్తిరించెను. కొక్కెర యీల్గెను. కావున నేను 'పెక్కుచేఁపలను తిని' ఇత్యాదిం జెప్పితిని.

---

అంతట చిత్రవర్ణుఁడు వెండియు నిట్లనియె;—'ఓ మహామంత్రీ, వినుము; ఈవిషయము నే నాలోచించియే యున్నాను. ఇచ్చట రాజుగా నిలిచి మేఘవర్ణుఁడు కర్పూరద్వీపములోని యుత్తమ వస్తువుల నెల్ల మనకు కట్నము పంపుచుండవలయును. వానితో

మనము కడు విలాసముతో వింధ్యాద్రియం దుండవచ్చును.'

దూరదర్శి నవ్వి యి ట్లనియె;—'దొరా,

19. భవిష్యత్తును తలఁపోసికొని ఎవఁడు సంతోషించునో, వాఁడు కుండలు పగులఁగొట్టిన బ్రాహ్మణునివలె తిరస్కారము పొందును.'

అది యె ట్లని రా జడుగ మంత్రి చెప్పుచున్నాఁడు.—

కథ. ౮.

దేవీకోట్ట మను పట్టణములో దేవశర్మయని బ్రాహ్మణుఁ డుండెను. అతఁడు మహావిషువత్సంక్రాంతి నాఁడు మూఁకుడు నిండ పేలపిండి దానము పట్టెను. దానిని తెచ్చికొని కుండలతో నిండిన కుమ్మరిసాలలో ఒకచోట పడుకలో దేహము వైచి పిండిని కాపాడుకొనుటకు చేత నొకకఱ్ఱను పెట్టుకొని రాత్రి ఆలోచించెను:— 'ఈ మూఁకుటిపిండిని పది గవ్వలకు అమ్మితినా, ఆగవ్వలతో ఇక్కడనే కుండలు మూఁకుడులు మొద లయిన వానిని కొని నానావిధముల పెంచిన ధనములతో పరల మరల వక్కలు వస్త్రములు లో నగు వానిని కొని అమ్మి లక్షధన మార్జించి నలువురుభార్యలను పెండ్లియాడెదను. ఆసవతులలో రూపవంతురా లెవతెయో దానిమీఁద ఎక్కువ మక్కువం బూనెదను. సవతులు ఎప్పుడు కొట్లాట ఆరంభింతురో అప్పుడు కోపాకులుఁడ నై నేను దుడ్డుఁగఱ్ఱతో వారిని కొట్టెదను.' ఇట్లు పలికి అతఁడు ఆదుడ్డుఁగఱ్ఱను విసరెను. పిండిమూఁకుడు పొడుమయినది; కుండ లెన్నియో నుగ్గయినవి. ఆశబ్దము విని కుమ్మరి వచ్చి ఆతీరున పగిలియున్న కుండలను చూచుకొని బ్రాహ్మణుని ధిక్కరించి సాలనుండి వెళ్లఁగొట్టెను.

కావున 'భవిష్యత్తును తలంచుకొని' ఇత్యాదికముం జెప్పితిని. అంతట రాజు ఏకాంతమున గద్దమంత్రిని అడిగెను - 'బాబూ, ఏమి చేయవలయునో మఱి చెప్పుము.' అని. గద్ద చెప్పుచున్నది.—

20. మదమెక్కి అంపగానిదై నీచజాతి యేనుఁగు తప్పుదారిం జొచ్చినప్పుడు మావటీనికి ఏప్రకారము చెడ్డపేరు వచ్చునో ఆప్రకారమే గర్వముచే మిడిసిపడుచు రాజు తప్పుదారిం బడినప్పుడు మంత్రులకు చెడ్డపేరు వచ్చును.

ప్రభూ, మన మేమి బలగర్వముచేత కోటం గూల్చితిమా? కాదు. మఱి నీప్రతాపము నడిపిన యుపాయముచేత?' రాజు 'మీయుపాయముచేత' అనెను. గద్ద యిట్లనియె.—'నామాటప్రకారము చేసెదవేని, ఇప్పుడు స్వదేశమునకు పోవలసినది. అటు చేయనిచో వర్షాకాలము వచ్చెనేని సమానబలునితో ఈరాజహంసునితో మరల మనకు పోరు పొసఁగుడు విదేశమున నిలిచికొని యుండు మనకు స్వదేశమునకు పోక కష్టమగును. సుఖము శోభించునట్లుగా ఒడంబడిక చేసికొనిపోవుదము. కోటం గూల్చితిమి, కీర్తి రానే వచ్చినది. ఇది నా కిష్ట మయిన పని. ఏల యనఁగా,—



21. ఎవఁడు ధర్మమును ప్రధానముగా నెంచుకొని, దొరకు ప్రియమా అప్రియమా అను చింత మాని, అప్రియము నయినను సత్యమును చెప్పునో వాఁడు దొరకు సహాయుఁడు. మఱియు;—

22. సమానునితోఁగూడ సంధి కోరవలయును, ఏల యన, యుద్ధములో గెలుపు సందిగ్ధము. సమబలులు సుందోపసుందులు ఒండొరులతో పోరి నశింపలేదా? మఱియు;-

23. మిత్త్రిని, దండును, రాష్ట్రమును, తన్ను, కీర్తిని, వీని నన్నిటిని మూర్ఖుఁడు కాక ఎవఁడు యుద్ధములో సందేహ మనెడి యుయ్యేలలో వైచును?'

అది యె ట్లని రా జడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు.—

కథ. ౯.

పూర్వము సుందోపసుంద లని మిక్కిలి గొప్పయసుర లిద్దఱు ముల్లోకముల దొరతన మపేక్షించి ఎక్కువగా దేహప్రయాసపడి పరమేశ్వరుని ఉపాసించిరి. అంతట వారిని మెచ్చి భగవంతుఁడు 'వర మడుగుఁడు' అనెను. వారియం దున్న సరస్వతీమూలముగా వారు ఒకటి అనఁబోయి మఱి యొకటి యనిరి.—'మాయందు భగవంతునికి సంతోషమేని, ఆపక్షమున పరమేశ్వరుఁడు మాకు తనప్రియను పార్వతిని ఇచ్చునుగాక.' అందులకు పరమేశ్వరుఁడు కోపించియు వర మీక తప్పనందున తనభార్యను పార్వతిని ఇచ్చెను. ఆమెయొక్క రూపలావణ్యములకుం జిక్కి లోకఘాతకులు మనంబున నువ్విళ్లూరుచు పాపాంధులై 'నాది యీ తరుణి, నాది యీతరుణి,' అని ఒండొరులతో జగడమాడుచు, తగవు తీర్చువాని నెవని నేని అడుగవలయు నని యుద్దేశింపఁగా, పార్వతీపతియే ముసలి బ్రాహ్మణుని రూపమున వచ్చి యట నిలిచెను. అంతట వా రాతనితో 'ఈసుందరిని మేము మాబలముచే సంపాదించితిమి. మాయిరువురలో ఎవనిది కాఁదగును?' అని యడిగిరి. బ్రాహ్మణుఁ డి ట్లనియె.—

24. 'వర్ణముచే నుత్తముఁడు బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు; బలవంతుఁడయిన క్షత్త్రియుఁడు పూజ్యుఁడు; ధనధాన్యములచే అధికుఁడేని వైశ్యుఁడు పూజ్యుఁడు; ద్విజసేవ సేయు నేని శూద్రుఁడు పూజ్యుఁడు.

కావున మీకు క్షత్త్రియధర్మోచిత మయిన యుద్ధముచేతనే తగవు తీఱవలయును.' అతఁ డిట్లు చెప్పఁగా వారు సరియే యని సమబలులు ఒక్కుమ్మడి ఒండొరులం గొట్టుకొని మడిసిరి.

కావున 'సమానునితోఁగూడ సంధి' ఇత్యాదికముం జెప్పితిని. రాజు అడిగెను. 'ముందే ఏల యీమాట నాకు మీరు చెప్పకుంటిరి?' మంత్రి యనియె,—'అప్పుడు నా మాట నంతమువఱకు మీరు విన్నారా? ఈయుద్ధమే నాసమ్మతిచేత జరిగినట్టిది గాదు. ఈ హిరణ్యగర్భుఁడు మంచిగుణములు గలవాఁడు; ఇతనితో పోరు పెట్టుకొనుట సరిగాదు.

అట్లు చెప్పియున్నారు;—

25. సత్యవంతుఁడు, మంచివాఁడు, ధార్మికుఁడు, అనార్యుఁడు, తోఁబుట్టువుల సమూహము కలవాఁడు, బలవంతుఁడు, పలుదరముల గెలిచినవాఁడు, ఈ యేడుగురును సంధికి తగిన వారుగా చెప్పఁబడినారు.

26. సత్యవంతుఁడు సత్యమును కాపాడుకొనుటకు, ఒడంబడికను మీఱఁడు. మంచివాఁడు తనకు ప్రాణాపాయమందును చెడుమార్గ మవలంబింపఁడు.

27. ధార్మికునిపై దండెత్తినచో ఎల్లవారును అతని పక్షమునం బోరుదురు. ప్రజానురాగమును ధర్మమును అతని పక్షమందుండుటచేత ధార్మికుని గెలుచుట సుకరము గాదు.

28. తనకు కలుగనున్న వినాశమును తప్పించుకొనుటకై అనార్యునితో సయితము సంధి చేసికొనవలయును; వాని నాశ్రయింపక ఆర్యుఁడు కాలయాపనము చేయఁగూడదు.

29. గుబురుగా దట్టముగా ముండ్లతో అంతటను క్రిక్కిఱిసిన వెదురు ఎట్లు తెగనఱుక నలవి గాదో తోఁబుట్టువుల సంఘము కలవాఁడును అట్లే.

30. బల్లిమనితో పోరఁజాలయు ననుటకు నిదర్శనము లేదు; మేఘము గాలికి ఎప్పుడును ఎదురు వోదు.

31. పరశురాముని ప్రతాపముచేతనుం బోలె పెక్కుయుద్ధములందు గెలిచినవానియొక్క ప్రతాపమును అండఁగొన్నవాఁడు ఎల్లతావులను ఎల్లకాలములందును ఎల్లవారి భాగ్యమును అనుభవించును.

32. ఎవఁడు అనేక యుద్ధవిజయితో సంధి చేసికొనునో వానికి ఆవిజయియొక్క ప్రతాపముచేతనే శత్రువులు వశపడుదురు.

కావున నిట ఈచెప్పిన గుణములలో అనేకములు గలయట్టి యీ రాజహంసునితో సంధి చేసికొనవలసినది.'—

చక్రవాకము పలికెను.—' సర్వమును బోధపడినది. ఓ కొంగా, త్వరగా పోయి, ఇంక నచటి విశేషమును మరలం గ్రహించుకొని రమ్ము.' అంతట హిరణ్యగర్భుఁడు జక్కవను 'మంత్రీ, సంధిసేయఁ దగనివారు ఎందఱు? వారిని వినఁగోరికగా నున్నది' అని యడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు.—" దేవరా, చెప్పెదను.

33. బాలుఁడు, ముసలి, దీర్ఘరోగి, అట్లే జ్ఞాతులచేత బహిష్కారము సేయఁబడినవాఁడు, పిఱికి, పిఱికిపరివారము కలవాఁడు, పిసినిడి, పిసినిడిపరివారము కలవాఁడు,

34. మంత్రుల యనురాగము లేనివాఁడు, విషయభోగములందు అత్యంతలంపటుఁడు, ఐకమత్యము లేని మంత్రము కలవాఁడు, దేవబ్రాహ్మణులను నిందించువాఁడు,

35 అదృష్టము ప్రతికూలముగా నున్నవాఁడు, అదృష్టమును నమ్మికొన్నవాఁడు, కఱవుచేత పీడింపఁబడినవాఁడు, దండు తిరుగఁబాటయినవాఁడు,



36. స్థానబలము లేనివాఁడు, పలువురు శత్రువులు గలవాఁడు, కాలబలము లేనివాఁడు, సత్యధర్మములు లేనివాఁడు;— వీరు ఇరువదుగురు.

37. వీరితో సంధి చేయఁగూడదు, కేవలము పోరే చేయవలయును, పోరఁ దొడంగినచో వీరు త్వరగా శత్రువునకు లోఁబడుదురు.

38. బాలునికి ప్రభుశక్తి చాలనందున లోకులు వానికై పోరరు; ఏల యనఁగా పోరినందులకు బహుమానమును, పోరనిచో దండనయు, చేయుటకు బాలుఁడు సమర్థుఁడు గాఁడు.

39. ఉత్సాహశక్తిహీను లగుటంబట్టి ముసలితోను దీర్ఘరోగితోను సంధి కూడదు, వారి స్వజనులే ఈయిరువురను తప్పకుండ తిరస్కరింతురు.

40. జ్ఞాతి బహిష్కృతుని వెళ్లఁగొట్టుట కరము సులువు. వానిజ్ఞాతులను జిగీషుఁడు తనపక్షము చేసికొన్నయెడల వారే వానిని కూల్తురు.

41. పిఱికి తానే యుద్ధము మాని తొలఁగి పోవును, అట్లే పిఱికిజనులు కలవానిని యుద్ధములో వారు విడిచి పోదురు.

42. పిసినిడి ఇచ్చువాఁడు కానందున వానికై అనుజీవులు పోరరు. పిసినిడిపరిజనులు వైరివలన ధనములు గొని తమదొరనే చంపివేయుదురు.

43. అనురాగము లేని మంత్రులు యుద్ధములో ప్రభువును త్యజింతురు. విషయభోగములందు అతిలంపటుఁడగువానిని సులువుగా జయింపవచ్చును.

44. మంత్రమందు ఐకమత్యము లేనివానిని మంత్రులు ద్వేషింతురు. మనస్సు నిలుకడ లేనివాఁడయినందున కార్యమందు ఆతనిని వారు ఉపేక్షింతురు.

45. ఎప్పుడును ధర్మమే బలీయము గాన దేవబ్రాహ్మణనిందకుఁడు స్వయము గానే నశించును, దురదృష్టవంతుఁడును అట్లే

46. 'సంపదకును ఆపదకును అదృష్టమే కారణము' అని ఎవఁడు దైవమునే నమ్మికొనునో, వాఁడు ఊరక ధ్యానించుచు స్వయముగా ప్రయత్నమే చేయఁడు.

47. కాటకముచే పీడితుఁడయిన వాఁడు స్వయము గానే నశించును; దండులో కలఁతలు గలవానికి పోర శక్తియుండదు.

48. స్థానబలము లేనివానిని క్షుద్రశత్రువు కూడ చంపును. చిన్నదయినను మొసలి నీటిలోన మదపు టేనుఁగును కూడ పట్టును.

49. పలువురతో వైరము పెట్టుకొన్నవాఁడు భీతుఁడై డేగలనడిమి పావురమువలె ఏదారిని పోవునో ఆదారినే మడియును.

50. కాలబలము లేనిదండుగల వానిని కాలబలము గలిగి పోరువాఁడు తెగటార్చును! గుడ్లగూబ రాత్రియందు కన్ను దెలియని దైన కాకిని సంహరించుట నిదర్శనము.

51. సత్యధర్మములు లేనివానితో నెప్పుడును సంధిచేయఁగూడదు, ఏల యన సంధి చేసికొన్నను వాఁడు దుర్జనుఁడు గావున మరల దౌష్ట్యమే ఆరంభించును.

ఇంకనుం జెప్పెద.— సంధి, విగ్రహము, ఆసనము, యానము, సంశ్రయము, ద్వైధీభావము అనునవి ఆఱు గుణములు; పనులయొక్క ఆరంభోపాయము, పురుషద్రవ్యసంపద, దేశకాలవిభాగము, వినిపాతప్రతీకారము, కార్యసిద్ధి అని మంత్రమునకు అయిదంగములు. సామ దాన భేద దాన దండములు నాలుగు ఉపాయములు; ఉత్సాహశక్తి ప్రభుశక్తి మంత్రశక్తి అని మూఁడు శక్తులు. ఇదంతయు నిత్యము ఆలోచించి గొప్పవారు జయించఁగడంగుదురు ఏల యన,—

52. ప్రాణమే వెలగా ఇచ్చినను ఏ సిరి దొరకదో ఆ సిరి చపలురా లయ్యును నీతి యెఱిఁగినవారియింట పరుగునం బోయి నిలుచును. అట్లును చెప్పినారు;—

53. ఎవఁడు తన ధనమును సమానముగా పంచిపెట్టునో, ఎవని వేగు ఒరులకు తెలియకుండునో, ఎవని మంత్రము రహస్యముగా నుండునో, ఎవఁడు ఒరులను అప్రియము పలుకఁడో, ఆతఁడు సముద్రపర్యంత మయిన భూమిని ఏలును.

మఱియు, మహామంత్రి సంధి నుపదేశించినాఁడు గాని, ఇపు డారాజు జయగర్వముచేత దానిని అంగీకరింపఁడు. కావున మన మిట్లు చేయుదము. మనమిత్త్రుఁడు సింహళరాజు మహాబలుఁడను బెగ్గురు నేరేటిదీవియందు కలహములు పుట్టించుఁగాక. ఏలన—

54. తన్ను చక్కఁగా కాచుకొని చక్కఁగా కూడుకొనియున్న దండుతో సంచరించుచు వీరుఁడు శత్రువును అన్నివైపులను క్రాఁపవలసినది. ఏల యనఁగా క్రాఁగినట్టిది క్రాఁగిన దానితో అదుకుకొనును."

అంతట రాజు 'అట్లే యగుఁగాక' అని విచిత్రుఁ డనెడి కొక్కెరచేత మిక్కిలి రహస్య మయిన జాబును ఇచ్చి సింహళద్వీపమునకు పంపెను.

తర్వాత వేగు మరల వచ్చి యిట్లు నివేదించెను.— దేవా, అచటి ప్రస్తావమును వినుము, అచట గద్ద యి ట్లనియె.—'ప్రభూ, మేఘవర్ణుఁడు అచట చిరకాల మున్నవాఁడు, ఆరాజు హిరణ్యగర్భుఁడు సంధి చేయఁదగిన గుణములు గలవాఁడో కాఁడో అతనికి తెలియును.' అంతట వానిని రప్పించి రా జడిగినాఁడు.— 'కాకీ, ఆరాజు హిరణ్యగర్భుఁ డెట్టివాఁడు? అతని మంత్రి చక్రవాకుఁడు నెట్టివాఁడు?' మేఘవర్ణుఁ డిట్లు వచించెను.— 'దేవరా, ఆ హిరణ్యగర్భరాజు ధర్మరాజునంత దొడ్డవాఁడు, సత్యసంధుఁడు. చక్రవాకునివంటి మంత్రి మఱి యెక్కడను గానరాఁడు.' 'అట్లయిన నీచేత నతఁ డెట్లు మోసపోయినాఁడు?' అని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

55. 'నమ్మియున్నవారిని వంచించుట యేమి నేర్పు? ఒడిలో పరుండి నిద్రించిన



వానిని చంపుటయందు ఏమి పౌరుషము?

వినుము రాజా, ఆమంత్రి నన్ను చూచినప్పుడే కనిపట్టినాఁడు; కాని ఆరాజు, దొడ్డవాఁడు; అందువలన నాకు మోసపోయినాఁడు.

56. దుర్జనుని తనవలెనే సత్యవాది యని అని ఎవఁడు నమ్మునో వాఁడు మేఁకను మోసగాండ్ర మాటవలన పోఁగొట్టుకొన్న బ్రాహ్మణునివలె మోసపోవును.'

అది యె ట్లని రా జడుగఁగా మేఘవర్ణుఁడు వక్కాణించెను.—

కథ. ౬.

గౌతములవారి తపోవనమందు ఒకబ్రాహ్మణుఁడు యజ్ఞము సేయఁబూనుకొని అందుకై గ్రామాంతరమున మేఁకను విలిచి బుజమునం బెట్టుకొని పోవుచుండఁగా దారిలో ముగ్గురు మోసగాండ్రు చూచి 'ఏయుపాయమున నైన ఈమేఁక మనకు దొరకెనా అందువలన మనకు తెలివి హెచ్చును.' అని యాలోచించుకొని దారిపొడుగువను క్రోసుక్రోసు దూరమున మూఁడుచెట్లక్రింద ఆబ్రాహ్మణుని రాకను ఎదురుసూచు చుండిరి. బ్రాహ్మణుఁడు సమీపింపఁగానే మొదటి వంచకుఁడు 'ఏ మయ్యా బాపనయ్యా, కుక్కను బుజాన మోచుచున్నావు?' అని యడిగెను. 'ఇది కుక్కగాదు, యజ్ఞానికి మేఁక.' అని బ్రాహ్మణుఁడు చెప్పెను. అటుతర్వాతి ధూర్తుఁడును బ్రాహ్మణుని అట్లే అడిగెను. ఆ మాట విని బ్రాహ్మణుఁడు మేఁకను దింపి నేలఁబెట్టి మాటిమాటికి పరికించి మరల బుజమునం గొని సందేహపడుచు నడిచెను. ఏల యన;—

57. విద్వాంసులకు సయితము దుర్జనుల మాటలచేత మనస్సు సంశయముపాలగును. వారిమాటలను నమ్మినవాఁడు చిత్రకర్ణునివలె చచ్చును.

'అది యెట్లు?' అని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

కథ. ౭.

ఒకానొక యడవి ప్రదేశములో మదోత్కటుఁ డని సింహ ముండెను. దానికి సేవకులు ముగ్గురు-కాకి పులి నక్కయు. అవి తిరుగుచు ఒక లొట్టిపిట్టం గాంచి 'నీ వెవరవోయి?' అని యడిగినవి. అది తన వృత్తాంతమును చెప్పినది. అంత నవి దానిం దోడ్కొని పోయి సింహమునకు అప్పగించినవి. సింహము దానికి అభయవాక్కొసంగి చిత్రకర్ణుఁ డని పేరిడి తనయొద్ద నుంచుకొనెను. ఇట్లు కాలము గడచుచుండెను.

అంత నొకప్పుడు సింహమునకు దేహము అస్వస్థముగా నున్నందునను మిక్కుటముగా వర్షము కురియుచున్నందునను మేఁత దొరకక అవి యన్నము లేక వ్యాకులపడు చుండినవి. అంతట కాక వ్యాఘ్ర జంబుకములు 'చిత్రకర్ణునే దొర చంపునట్లు ఉపాయము చేయుదము. ఏల యీ ముండ్ల మేఁతరి?' అని యాలోచించినవి. పులి

యిట్లనియె.—'స్వామి అభయవాక్కు నొసంగి వీనిని చేపట్టెను గదా. ఈ యాలోచన యెట్లు నెఱవేఱును?' కాకి యిట్లనియె.—'ఈసమయములో సామి కృశించి యున్నాఁడు, పాపమునకు వెనుదివియఁడు ఎట్లన,—

58. ఆఁకటిచే నకనకఁబడుచున్న తల్లి కొడుకునుగూడ వదలిపోవును, ఆఁకటికి ఓర్వలేక పాము తనగ్రుడ్డును భక్షించును. ఆఁకలిగొన్నవాఁడు ఏ పాపము సేయఁడు? ఎండినవారికి జాలి యుండదు. మఱియు;—

కైపెక్కినవాఁడు, పరాకుపడువాఁడు, వెఱ్ఱివాఁడు, అలసినవాఁడు, క్రోధముగలవాఁడు, ఆఁకలిగొన్నవాఁడు, లోభి, పిఱికి, వేగిరకాఁడు, కాముకుఁడును, ధర్మమెఱుఁగరు.'

ఇట్లు నిశ్చయము చేసికొని అన్నియు సింహముకడకు పోయినవి. 'మేఁత కేమయిన దొరకినదా?' అని సింహ మడిగినది. 'దేవరా, ఎంత కష్టపడి వెదకినను ఏమియు దొరకలేదు.' అని కాకి చెప్పెను. 'మఱి యిపు డేమి బ్రదుక నుపాయము?' అని సింహ మడిగెను. 'స్వాధీనముగా నున్న యాహారమును వదలుకొన్నందున ఈ సర్వనాశము సంభవించినది,' అని కాకి చెప్పెను. 'ఏ యాహారము ఇక్కడ స్వాధీనము?' అని సింహ మడిగెను. 'చిత్రకర్ణుఁడు' అని కాకి చెవిలో చెప్పినది. సింహము నేల తాఁకి చెవులు మూసికొని 'అభయవాక్కు నొసంగి నేను నిలుపు కొంటిని. ఈపని యెట్లు తగును?

59. సర్వదానములలోను అభయదానము మహాదాన మని చెప్పుదురు; దానికి గోదాన భూదానాన్నదాన జలదానము లేవియు సమానములు గావు. మఱియు;—

60. ఎల్లవారికోర్కులను సమృద్ధిగా తీర్చుచు చేసిన యశ్వమేధయాగమువలన ఏఫలమో ఆఫలము సంపూర్ణముగా శరణాగతరక్షణచేత కలుగును.'

కాకి యిట్లనియె.—'వీనిని మీరు స్వయముగా చంప నక్కఱలేదు; మఱి, ఇతఁడే తన్ను మీకు సమర్పించుకొనునట్లు మేము చేసెదము.' ఆమాటకు సింహము ఊరకుండెను. అంత కాకి సందు పొంది కపటోపాయము పన్ని కడమవానిని కూర్చుకొని సింహముకడకు వచ్చి యిట్లనియె;— 'స్వామీ, ఎంత ప్రయత్నించినను మేఁత దొరకలేదు. ఈప్రకారము ఏలినవారు పస్తుపడి యున్నారు. కాఁబట్టి యిపుడు నామాంసమును భక్షింపుఁడు. ఏల యన;—

61. ఈ సకలసంపదలకును స్వామియే గదా మూలము, చెట్టుఁ గూడె మూలము చక్కఁగా నున్నంతకాలమే మనుష్యులయత్నములకు ఫలములు కాచును.'

సింహము 'ఇట్టిపని చేయుటకన్న చచ్చుట మేలు' అనెను. నక్కయు కాకివలెనే చెప్పినది. కూడ దని సింహము చెప్పినది. 'నాదేహమువలన ప్రాణ మాఁపుకొనుము స్వామీ.' అని పులి వచించెను. 'ఎప్పటికిని ఆపని సరి గాదు.' అని సింహ మనియె.



అంతట నమ్మకము గలిగి చిత్రకర్ణుఁడును కడమవానివలెనే తనదేహము నర్పించుకొనియెను. దానినోట ఆమాట వచ్చియు రాకముందే పులి దానికడుపుం జీల్చి చంపినది; అన్నియు భక్షించినవి.

---

కావున 'విద్వాంసులకు సమ్మతము' ఇత్యాదికముం జెప్పితిని. తర్వాత మరల బ్రాహ్మణుఁడు పోవుచుండఁగా మూఁడవ వంచకుఁడు ఎందులకయ్యా, బ్రాహ్మణుఁడా, కుక్కను బుజాన మోసికొని పోవుచున్నావు?' అని యడిగెను. దానిని విని అది కుక్కయే యని నిశ్చయించుకొని మేఁకను వదలివేసి స్నానము చేసి తనయింటికి పోయెను. ఆధూర్తులు మేఁకను గొనిపోయి భుజించిరి. కావున నేను 'దుర్జనుని తనవలె' ఇత్యాదికమును వచించితిని.

'మేఘవర్ణుఁడా, ఎట్లు నీవు శత్రువులనడుమ చిరకాల ముంటివి? ఎట్లు వారిని మంచితనము చేసికొంటివి?' అని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు.—'దేవా, స్వామికార్యముకొఱకుఁ గాని తన ప్రయోజనముం బట్టి గాని జనుఁడు ఏమి చేయఁడు? చూడు;—

62. రాజా, లోకులు వంటచెఱకును కాల్చుటకై శిరమున మోవరా? ఏటియాల చెట్టువేరును కడుగుచుండియే కోసివైచును. అట్లును చెప్పుదురు;—

63. బుద్ధిమంతుఁడు శత్రువు నైనను వానితో పని యున్నప్పుడు బుజమున మోచును; ముసలిపాము అట్లేగదా కప్పలను నాశము చేసినది.

ఆకథ యెట్లని రా జడిగెను. మేఘవర్ణుఁడు చెప్పుచున్నాఁడు.—

కథ. ౮.

వల్లకాటిలో మందవిష మని పా మొకటి యుండెను. అది మిక్కిలి ముసలి యైనందున ఆహారము సంపాదించుకొనుటకుం గూడ శక్తిలేనిదై సరస్సుదరిని పడి యుండెను. దానిని దూరమునుండి ఒక కప్పచూచి 'ఏమి మేఁత వెదకుకొన కున్నావు? అని యడిగెను. 'పో పో, ఈ నిర్భాగ్యుని వృత్తాంతము నీ కేల?' అని పాము వచించెను. అంతట కౌతుకము హెచ్చి కప్ప 'చెప్పిననేగాని వల్లపడదు.' అనెను. పాము చెప్పినది.—

బ్రహ్మపురమున శ్రోత్రియుఁ డొకఁడు కౌండిన్యుఁ డనునాతఁడు వసించుచుండెను. అతని కుమారుని ఇంచుమించుగా ఇరువది సంవత్సరముల వయస్సువానిని సకల సద్గుణసంపన్నుని దుర్దైవవశమున నాక్రూర స్వభావముచేత కఱచితిని. సుశీలుఁ డనుపేరి యాకుమారుని చావఁగాఁజూచి కౌండిన్యుఁడు దుఃఖము పెంపున నేలఁబడి దొర్లసాగెను. అంత బ్రహ్మపురవాసు లయిన యతనిబంధువు లందఱును వచ్చి యట కూర్చుండిరి. అందు కపిలుఁ డనెడి స్నాతకుఁ డిట్లనియె.—'ఓరి, కౌండిన్యుఁడా నీవు మూఢుఁడవు, కావున ఇట్లు

ఏడ్చుచున్నావు. విను;—

64. పుట్టిన శిశువును అనిత్యత ముందుగా ఎత్తి తొమ్మనఁ బెట్టుకొనును; దాది యనునట్లు తల్లి తర్వాత ఎత్తుకొనును. ఇట్లుండ శోకించుట కేమి న్యాయ మున్నది?

65. సైనికులు దండ్లు గుఱ్ఱములు గలవారైన భూనాయకులు ఏ మయి పోయినారు? వారి పోకకు సాక్షిణి యైన యీభూమిమాత్రము ఇప్పటికిని స్థిరముగా నున్నది.

66. దేహమునకు అపాయము సమీపముననే యున్నది; సంపదలు ఆపదలకు నెలవులు; కూటములు, ఎడఁబాపులు గలవే; పుట్టున దెల్ల చచ్చునదే.

67. ప్రతినిముసమునను ఈదేహము తెలియకుండనే క్షయించుచున్నది; నీటిలోని పచ్చికుండవలె విఱిసిపోవుచున్న దని ప్రత్యక్షమే.

68. కొఱుత వేయుటకు నడిపింపఁబడుచున్న వధార్హునికి అడుగడుగునకును ఎట్లో అట్లే ప్రాణి కెల్ల దినదినమునకును మృత్యువు దగ్గఱకు వచ్చుచున్నది.

69. జవ్వనము, సౌందర్యము, బ్రదుకు, కూర్చినధనము దొరతనము, మిత్త్రులతోడి సాంగత్యము,—ఇవన్నియు అనిత్యములు; పండితుఁడు వానియందు తగులు వహింపఁగూడదు.

70. మహాసముద్రములో ఎట్లు కొయ్యయు కొయ్యయు కలసికొనునో కలసికొని ఎడఁబాయునో అట్లే ప్రాణుల సాంగత్యమును.

71. బాటసారి ఎవఁడేని నీడలో రవంతసేపు కూర్చుండి అలపు తీర్చుకొని లేచి పోవునో అట్లే ప్రాణులసాంగత్యము. మఱియు;—

72, పంచభూతములతో సృజించిన యీ దేహము చచ్చి ఏ భూతాంశము ఆ భూతములతో కలపి పోయినప్పుడు అందులకు దుఃఖపడుట యనఁగా నెట్టిది?

73. ప్రాణి మనః ప్రియము లయిన సంబంధములను ఎన్నిటిని కల్పించుకొనునో వానియెదలో అన్ని సెగులు మేఁకులు నాటఁబడియుండును.

74. ఎవనికిని ఏయుపాయమునను ఎందును తనశరీరముతో సయితము శాశ్వతమయిన కూడిక లేదు; ఇఁకను వేఱయిన గుణములతో శాశ్వత మగు కూడిక యుండ దని వేఱ చెప్పవలయునా? మఱియు;—

75. కూటమియే ఎడఁబాపు కలుగునని సూచించును, పుట్టుకమే చావు తప్పదని సూచించును.

76. అపథ్యాన్నములవంటి బోలె పైకి రమణీయము లయిన ప్రియసంయోగములు పరిపాకములో మిక్కిలి దుఃఖకరము లగును. మఱియు;—

77. ఏఱ్ల ప్రవాహములు ముందటికి పోవునే గాని వెనుకకు మరలవు; అట్లే మర్త్యులయొక్క యాయుస్సులను కైకొని రేలును బగళ్లును పోవుచుండును.



78. సంసారములో సుఖానుభవము నొసంగునదై సజ్జనసాంగత్యముకూడ కడకు వియోగమునే కలిగించునది గాన అదియు దుఃఖములలో మొదటిదిగా చెప్పఁ దగినది.

79. ఇందుచేతనే సాధువులు సత్సమాగమమును కోరరు; ఎందుచేత నన, సజ్జనుల యెడఁబాటు అనియెడు కత్తిచే కోయఁబడిన మనస్సునకు మఱి మందు లేదు.

80. సగరాది రాజులు మంచిపనులే చేసినారు గదా, మఱి ఆపనులే గావు వారు కూడ గతించి పోయినారు గదా.

81. ఘోరముగా దండించునట్టి యామృత్యువును తలఁచుకొనఁగా తలఁచుకొనఁగా, వివేకి యగు నరునికి వాననీళ్లకు తడసిన తోలుకట్లవలె ఎల్లప్రయత్నములును వీడిపోవును.

82. నరవీరుల సమూహము ఏరాత్రి తొట్టతొలుత తల్లిగర్భములో నివాసమొందునో అప్పటినుండి తడఁబడనిపయనముగా మృత్యుసమీపమునకు నడచుచుండును.

మఱి సంసారస్వరూపమును విచారించుకొనివారికి ఈ దుఃఖము అజ్ఞానవిజృంభణము. చూడు;—

83. అజ్ఞానము కారణము గాదేని వియోగమే కారణమేని దినములు గడచఁగా గడవఁగా శోకము పెరుఁగవలయును గదా, అట్లు పెరుఁగక తఱుఁగు నేల? కావున ఈవిషయములో ఆత్మస్వరూపమును అనుసంధింపుము శోకమును తరువకుము. ఏల యన,—

84. ఆకస్మికముగా సంభవించినవై అవయవములయొక్క యాయువుపట్లను చీల్చునవైన గాటంపుదుఃఖము లనెడి దెబ్బలకు వానిని తలంపమియే గొప్పమందు.'

అంతట ఆమాట విని మేలుకొన్నవాఁడువోలె కౌండిన్యుఁడు 'లేచి మఱి ఇఁక ఇంటినరకమున నుండను. అడవి కేఁగెదను.' అని పలికెను. కపిలుఁడు వెండియు ననియె.—

85. 'రాగవంతులకు అడవిలో సయితము దోషములు కలుగును, ఇంట నున్నను పంచేంద్రియములను కట్టివైచుటయే తపస్సు. రాగము లేక మంచిపని చేయుచు ఉండువానికి ఇల్లే తపోవనము. ఏల యన;—

86. దుఃఖితుఁడు కూడ ఏదో ఒక బ్రహ్మచర్యాద్యాశ్రమములో ఉండి ఎల్ల జంతువులందును సమబుద్ధి కలవాఁడై ధర్మ మాచరించును; ధర్మమునకు ఆశ్రమము కారణము గాదు.—చెప్పిరి గదా;—

87. ఎవరికి ప్రాణము నిలుపుకొనుటకుమాత్రమే భోజనమో, సంతతిం బొందుటకే భార్యం గూడుటయో, సత్యమాడుటకే వాక్కో, వారు ఎట్టికష్టముల నైనను దాఁటుదురు.—అట్లే గదా;—

88. పాండురాజుకుమారుఁడ వయిన యో ధర్మరాజా, ఆత్మయే ఏఱు, పుణ్యమే

అందులకు రేవు, సత్యమే నీరు, ఆచారమే గట్టు దయయే అల ; ఇందు స్నానము చేయుము ; నీళ్లచేత జీవుఁడు శుద్ధి పొందఁడు. ముఖ్యముగా ;—

89. పుట్టుక చావు ముదిమి రోగములు నొప్పి-వీనిలో మునిఁగిన యీసంసారము మిక్కిలి నిస్సారము ; దీనిని విడుచువారికి సుఖము.

90. దుఃఖమే కలదు గాని సుఖ మనునది వాస్తవముగా లేదు ; సుఖ మనుట ఉపలక్షణమాత్రము; దుఃఖాపన్ననికి చేయు ప్రతీకారమును సుఖ మని పేర్కొందురు.'

కౌండిన్యుఁడు సరియే యని ఒప్పుకొనెను. తర్వాత నన్ను ఆబ్రాహ్మణుఁడు శోకార్తుఁడై 'ఇది మొదలుకొని కప్పలకు వాహన మవగుదువు' అని శపించెను. అంతట నొక బ్రాహ్మణుఁ డిట్లనియె.— 'కపిలుని యుపదేశమువలన నీహృదయము స్వస్థపడినది. అట్లే సుమా, విను.

91. సంగము బొత్తిగా విడువవలసినది, విడుచుటకు శక్యము కాదేని పెద్దలతో మాత్రమే చేయవలసినది. ఏలయన పెద్దలసాంగత్యము మందు. మఱియు ;—

92. కామమును బొత్తిగా వదలవలయును; దానిని వదలుట శక్తి లేదేని, తన భార్యయందుమాత్రమే ఉంచుకొనవలయును; ఏలయన ఆమెయే అందులకు మందు.'

దీనిని విని కౌండిన్యుఁడు కపిలోపదేశముచేత శోకాగ్ని చల్లాఱఁగా యథావిధిగా సన్న్యాసము నాశ్రయించెను.

కావున బ్రాహ్మణశాపమువలన కప్పలను మోచుటకు ఇట కనుపెట్టుకొని యున్నాను. తర్వాత ఆకప్ప పోయి జాలపాదుఁ డనుపేరి కప్పలదొరతో ఆవృత్తాంతమును నివేదించెను. అంతట కప్పలదొర వచ్చి ఆపాము వీఁపుమీఁద ఎక్కి కూర్చుండెను. పాము దానిని వీఁపున మోచుచు చిత్రవిచిత్రముగా సంచరించుచుండెను. మఱునాఁడు కదలుటకు శక్తి లేని యా పామును చూచి కప్పలరాయఁడు 'ఏ[illegible] నేఁడు మెల్లగా పోదువు?' అని యడిగెను. 'దొరా, తిండి లేనందున సత్తువ లేదు' అని పాము చెప్పెను. 'ఇదె నేను సెల విచ్చితిని, కప్పలను తినుము.' అని కప్పలరాయఁడు పలికెను. 'మీ ప్రసాదమును ఇదే గ్రహించితిని' అని వచించి పాము కప్పలను సొరిదిగా మెసవసాగెను. క్రమముగా చెఱువులో కప్పయే లేక పోఁగా కప్పలరాయని సయితము పాము తినివేసినది.

---

కావున 'బుద్ధిమంతుఁడు శత్రువు నైనను' ఇత్యాదికముం జెప్పితిని. దేవరా, చాలును లెండి యీ పూర్వవృత్తాంతములు చెప్పుకొనుట. ఎల్లవిధములను సంధి చేయఁదగినవాఁ డయినయీ హిరణ్యగర్భునితో సంధిచేయవలసిన దని నా యభిప్రాయము.—

రాజు ఇట్లనియె— 'ఏల నీ కీవిచారము? మాకు ఇతఁడు ఓడినాఁడు గదా. మాకొలువులో బ్రదికిన బ్రదుకనీ, కానిచో పోరనీ.' ఇంతలో జంబూద్వీపమునుండి



చిలుక వచ్చి యిట్లు నివేదించెను.— 'దేవరా, సింహళరాజు సారసుఁడు ఇప్పుడు వచ్చి మన జంబూద్వీపమును పట్టుకొన్నాఁడు.' అంతట రాజు తత్తఱపడి చిలుకను 'ఏమి ? ఏమి?' అని మరల నడిగెను. చిలుక మొదట చెప్పినదానినే మరల చెప్పినది.—గద్ద యిట్లనియె.— 'బళీ, జక్కవమంత్రీ ! బళీ సర్వజ్ఞుఁడా !' రాజనియె — 'వీనిమాట ఉండనీ, పోయి వానిని వేరుతో పెకలించివైచెదను.' దూరదర్శి నవ్వి యిట్లనియె;—

93. శరత్కాలమేఘమువలె వృథాగా ఎక్కువ గర్జింపఁగూడదు. గొప్పవాఁడు మేలును గాని కీడును గాని పరునికి తెలియనీఁడు. మఱియు ;

94. రాజు పలువురు పగతురతో ఒక్కమాఱే పోరు పెట్టుకొనఁగూడదు. పాము బలవంత మయ్యును పెక్కుపురుగులచేతఁ బడి చచ్చుట నిదర్శనము.

దేవా, ఇక్కడ సంధి చేసికొనకపోవుట శక్యమా? అంతట ఇక్కడిరాజు మనకు వెనుకటివైపున మనమీఁదికి శత్రువులను రేఁపును.

95. ఎవఁడు వస్తుతత్త్వము నెఱుఁగక కోపమునకే వశ మగునో ఆ మూఢుఁడు ముంగిసను చంపిన బ్రాహ్మణునివలె పశ్చాత్తాపము పాలగును.

అది యెట్లని రాజడిగెను. దూరదర్శి చెప్పుచున్నాఁడు —

కథ. ౯.

ఉజ్జయినియందు మాధవుఁ డని బ్రాహ్మణుఁ డుండెను. అతనిభార్య బాలెంతరాలు శిశువును చూచుకొనుచుండు మని ఆతనిని ఉంచి స్నానమునకు పోయినది. ఆసమయమున రాజుకడనుండి పార్వణశ్రాద్ధ మిచ్చుటకు ఈబ్రాహ్మణునికి పిలుపు వచ్చినది. అంతట పుట్టుదరిద్రుఁడు బ్రాహ్మణుఁడు ఇట్లు చింతించెను.—'త్వరగా పోనేని మఱియెవఁ డైనను విని పోయి శ్రాద్ధమును తెచ్చుకొనును.

96. ఇచ్చుకోలు, పుచ్చుకోలు, చేయవలసినచేఁత - వీనిని త్వరగా చేయనియెడల వానిరసమును కాలము త్రాగును.

మఱి, బుడుతనికి ఇట కాపు ఎవరును లేరు. ఏమి చేయుదును? కానీ, చిరకాలము పెంచిన యీ ముంగిసను పిల్లవానికి కాపు ఉంచి పోయెదను.' అట్లే చేసి వెడలెను. తర్వాత శిశువుకడకు నల్లత్రాఁచు రాఁగా కాంచి ముంగిస దానిని చంపి తుండెతుండెములుగా కఱచి వైచెను. అంతలో వచ్చుచుండిన బ్రాహ్మణునిచూచి ముంగిస నెత్తుటఁ దొప్పఁదోఁగి యున్న ముఖపాదములతో వడిగా పోయి ఆతనిపాదములం ద్రెళ్లినది.

అంతట ఆతీరున నున్న ముంగిసం బరికించి బ్రాహ్మణుఁడు 'నాసుతుని ఇది భక్షించినది' అని తలఁచి చంపెను. తర్వాత వచ్చి చూచుకొనఁగా శిశువు సుఖముగా నుండెను, పాము చంపఁబడి యుండెను. అంతట ఉపకారి గదా ముంగిస యని తెలిసికొని బ్రాహ్మణుఁడు కడుంగడు దుఃఖము ననుభవించెను.

---

కావున 'వస్తుతత్త్వ మెఱుంగక' ఇత్యాదికమును నేను వచించితిని. మఱియు;—

97. కామము, క్రోధము, లోభము, అజ్ఞానము, మానము, మదము,—ఈ యా ఱింటిని మొత్తముగా వదలవలయును. వీనిని వదలినవాఁడు హాయిగా నుండును.

'మంత్రీ, ఇదేనా నీనిశ్చయము?' అని రాజడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు.— 'ఇదే. ఏల యన,—

98. మంచి ప్రయోజనములయందు జ్ఞప్తియు, ఊహయు, జ్ఞాన నిశ్చయంబును, గట్టితనము, మంత్రము దాఁచుటయు, మంత్రియొక్క యుత్కృష్టగుణములు. అట్లే,—

99. ఆలోచింపక పని చేయరాదు, గుణదోషములను విచారించుకొనమి ఆపదలకు తావలము; విమర్శించి పని సేయువానిని వానిసుగుణములందు ఆసగొన్నవియుంబోలె సిరులు వరించును.

కావున, దొరా, ఇపుడు నామాట సేయుదువేని, సంధిచేసికొని పొమ్ము. ఏల యన,—

100. కార్యసాధనమునకు నాలుగు ఉపాయములు చెప్పఁబడి యున్నవి గాని, కడమవానికి లెక్కమాత్రమే ప్రయోజనము, కార్యసిద్ధి సామోపాయమం దున్నది.—

'ఇది యెట్లు నెఱవేఱును?' అని రాజడిగెను. మంత్రి చెప్పుచున్నాఁడు:— 'రాజా, త్వరలో నెఱవేఱును. ఏల యన,—

101. మట్టికుండ నెట్లో అట్లే దుర్జనుని విడఁదీయుట సులువు, అదుకుట అసాధ్యము; సుజను నన్నటో బంగారుకుండ నెట్లో అట్లే విడఁదీయుట కష్టము, అదుకుట సులభము.

102. తెలియనివానికి సులువుగా తెలుపవచ్చును, తెలిసినవానికి అంతకన్న సులువుగా తెలుప వచ్చును; తెలిసియు తెలియని మూర్ఖుని బ్రహ్మయు తెలుపలేఁడు.

ముఖ్యముగా ఈరాజు ధర్మమెఱిఁగినవాఁడు, మంత్రియు సర్వజ్ఞుఁడు. ఈవిషయము పూర్వము నేను మేఘవర్ణునివలన తెలిసికొంటిని. ఆరాజు చేసిన చేఁతచేతను అదిరెం స్పష్టపడినది. ఎట్లనఁగా,—

103. ఎదుట లేనివారి గుణవృత్తులను ఎల్లయెడలను వారిపనులవలన ఊహింపవలయును; ఎదుటలేని వారిపనులను వానిఫలములవలన ఊహింపవలయును.'

'ఏల మాటమీఁద మాట, మీయిష్టముప్రకారము చేయుఁడు' అని రాజు వచించెను. అంతట గద్ద మహామంత్రి 'వారివిషయమై అట్లు ఉచితముగా చేయవలయును' అని చెప్పి కోటలోనికి తరలెను.

ఇంతలో వేగుకొక్కెర వచ్చి హిరణ్యగర్భరాజునకు విన్నవించెను.— 'దేవా, సంధి చేయుటకు గద్దమహామంత్రి మనకడకు ఇదె వచ్చినాఁడు.' రాజహంస అనియె.— 'మంత్రీ, మరల వీరిపక్షమువాఁ డెవఁడేని మనయింటం జొచ్చును గావలయును.' సర్వజ్ఞుఁడు నవ్వి యిట్లనియె.—'దేవరా, ఇప్పుడు ఇందు భయకారణము లేదు. ఏల యన,



ఈ గద్ద దూరదర్శి చాల దొడ్డమనస్సు గలది. అయినను మందమతుల స్వభావము అట్టిది, ఒకప్పుడు శంకయే వహింపరు, ఒకప్పుడు అన్నిటను శంకయే. అట్లే గదా;—

104. తెలివిమాలిన యొకహంస రాత్రి కొలనిలో తెల్లగలువ గుబురును వెదకుచుండఁగా మెండుగా నక్షత్రప్రతిబింబములు అగపడునవి; వానిని తెల్లగలువలని తినఁబోయి మోసపోయినది. అనంతరము పగలు తెల్లగలువలను నక్షత్రప్రతిబింబము లనుకొని తినక మానినది. మోసగాండ్ర మోసములకు వెఱచినజనులు వాస్తవము తెలియుచున్నప్పుడు గూడ అపాయ మేమో లోలోపల నుండు నని తలంతురు.

105. దుర్జనులచే మనస్సు చెడెడువానికి మంచివారియందుఁ గూడ నమ్మకము యుండదు. పాలచేత నోరుగాలిన బాలుఁడు పెరుఁగునుకూడ ఊఁది అర్పుకొని త్రాగును.

కావున, దేవా, మనశక్తికి తగినట్టు ఆతనిని సత్కరించుటకు, రతనంపుఁగానుకలు లోనగు సామగ్రి సిద్ధము సేయింపుము.' అట్లే జరుగఁగా, జక్కవమంత్రి యెదురువోయి గద్ద మంత్రిని కోటదర్వాజానుండి గౌరవించి తెచ్చి రాజదర్శనము సేయించెను. గద్ద మంత్రియు తన కొసఁగిన యాసనమందు కూర్చుండెను. జక్కవ మంత్రి 'సమస్తము మీ స్వాధీనము; మీయిచ్చ చొప్పున ఈరాజ్యమును మీ రనుభవింపుఁడు.' అని వచించెను. 'ఇదే సరి' యని రాజహంస పలికెను. దూరదర్శి యిట్లనియె;—'ఇది యిట్లే. అయినను ఇప్పుడు ఎక్కువగా విస్తరించుటవలన ప్రయోజనము లేదు. ఎందుల కనఁగా,—

106. లోభిని ధనముచేతను, కోపగించినవానిని చేమోడ్పుచేతను, మూర్ఖుని వాని యిచ్చప్రకారము చేయుటచేతను, పండితుని వాస్తవము చెప్పుటచేతను, లోఁబఱుచుకొనవలయును. మఱియు;—

107. మిత్త్రుని విశ్వాసముచేతను, బంధువులను ఆదరముచేతను, స్త్రీలను సేవ ... ఈవిచేతను దొడ్డతనముచేతను, ఇతరజనులను దాక్షిణ్యముచేతను, వశపఱుచుకొనవలెను.

కావున మహాప్రతాపుఁ డయిన చిత్రవర్ణరాజును ఇప్రుడు సంధిచేసికొని పంపుఁడు.' 'సంధి యెట్లు చేయవలయునో దానిని కూడ చెప్పుఁడు.' అని జక్కవ యడిగెను. గద్ద చెప్పుచున్నది.—'వినుండు చెప్పెదను.

108. బలవంతుఁడు పైనెత్తినప్పుడు వేఱేమియు బదులు సేయలేని రాజు ఆపద ... కొనుటకై జరుపుడు సేయుచు సంధి కోరవలయును.

109_111. కపాలము, ఉపహారము, సంతానము, సంగతము, ఉపన్యాసము, ..., సంయోగము, పురుషాంతరము, అదృష్టనరము, ఆదిష్టము, ఆత్మాదిష్టము, పరిక్రయము, ఉచ్ఛిన్నము, పరభూషణము, స్కంధోపనేయము, అని ... అని సంధి లక్షణ మెఱిఁగినవారు చెప్పుదురు.

112. ఇరువురకును సమ మయిన యొడంబడిక కపాలసంధి యని యెఱుంగునది ; ఈవిచేత నగునది ఉపహార సంధి యనంబడును.

113. పుత్త్రికాదానయుతో కూడినది సంతానసంధి ; మైత్త్రిచేత కూడుసంధిని సంగత సంధి యని పెద్దలు చెప్పుదురు.

114. 115. ప్రతిక్రియయున్నంతకాలము జరుగునదియు, సమాన మయిన ధనాదిప్ర జనములు కలదియు, సంపత్తునందుఁగాని ఆపత్తునందుఁగాని ఏకారణమునను చెడనిదియు, అగు నీ సంగత సంధి బంగారమువలె శ్రేష్ఠ మగుటవలన ఇతరులు సంధి నేర్పరులు దీనిని కాంచన సంధియని చెప్పుదురు.

116. ద్రవ్యలాభముకై చేయఁబడు సంధిని ఉపన్యాస నిపుణులు ఉపన్యాస సంధి యని చెప్పుదురు.

117. నేను పూర్వము ఇతనికి ఉపకారము చేసితిని, నాకు ఇతఁడు ఉపకారము సేయఁగలఁడు, అని చేయఁబడుసంధి ప్రతీకారసంధి యనఁబడును.

118. ఇతనికి నేను ఉపకారము చేసెదను, ఇతఁడు నాకు ఉపకారము చేయును, అని చేయఁబడునదియు రామసుగ్రీవుల సంధివంటిది ప్రతీకారసంధి యనఁబడును.

119. ఒక ప్రయోజనమునకే ఇరువురుం గోరి కలిసి ఏఁగుచో ఆకలయిక యున్నంతకాలము జరుగునట్టి యాసంధి సంయోగ సంధి యనఁబడును.

120. మన యిరువుర సెనాయోధులును కలసి నాకార్యమును సాధింపవలయును అని ఎందు జీత మేర్పరింతురో ఆసంధి పురుషాంతర మనఁబడును.

121. నీ వొక్కఁడవే నాకార్యమును దీనిని సాధింపవలసినది, అని శత్రువు జీత మేర్పరించుట అదృష్టపురుష మనఁబడును.

122. రాష్ట్రములో నొకభాగమును జీతముగా పెట్టి బలవంతుఁడైన ఒడంబడిక సేయుట ఆదిష్ట మనఁబడును.

123. తన దండుతోనే ఒడంబడిక సేసికొనుట ఆత్మాదిష్ట మనఁబడును ; ప్రాణ రక్షార్థమై సర్వమును ఇచ్చుసంధి చేసికొనుట ఉపగ్రహ మనఁబడును.

124. బొక్కసములో సాలవ పాలుగాని సగముగాని సర్వముగాని ఇచ్చి క కాపాడుకొనుట పరిక్రయ మనఁబడును.

125. సారవంతము లయిన భూములను ఇచ్చుటచే కలుగు సంధి ఉచ్ఛిన్న బడును ; భూమిలో పుట్టిన సమస్తమైన పంటను ఇచ్చి చేయునది పరిభూషణ

126. పరిమిత మయిన పంటను ఒకొక్కొక్క సైనికుఁడును బుజము కొని పోఁగల యంత ఇచ్చి చేసికొను సంధిని సంధిజ్ఞు లగువారు స్కంధో



127. వాస్తవ మయిన పరస్పరోపకారము, స్నేహము, వియ్యము, ఉపహారము, ను నాలుగే సంధులు.

128. ఉపకార మొక్కటియే వాస్తవ మయిన సంధి యని నాయభిప్రాయము, మైత్త్రిసంధి తప్ప కడమ సంధు లన్నియు ఉపహార భేదములే.

129. ఎత్తివచ్చినవాఁడు బలవంతుఁడు గావున లాభము లేక మరలఁడు, కావున పహారముకంటె వేఱు సంధిలేదు.'

రా జడిగెను.— ' మీరు మహాపండితులరు. కావున ఇప్పుడు మే మేమి సేయఁ గనో ఉపదేశింపుఁడు. ' దూరదర్శి యి ట్లనియె,— సీ, ఏమి యి ట్లనెదరు !

130. మనోవ్యథ, రోగము, సంతాపము, అను కారణములచేత నేఁడో రేపో చున దైన యీ దేహముకై ఎవఁడు అధర్మము సేయును?

131. ప్రాణములు బదుకు నీటిలోని చంద్రప్రతిబింబమువలె చంచలముగదా ; అట్టి యెఱింగి సదా శుభ మాచరించు చుండవలయును.

132. సంసారము ఎండమావులవలె వట్టి మాయ యనియు క్షణభంగుర మనియు సి పెద్దలతో సాంగత్యము సేసి ధర్మమును సుఖమును బడయవలయును.

కావున నాకు సమ్మతముగా నిట్లు చేయుఁడు. — ఏల యన,—

133. గుఱ్ఱపు జన్నములను వేయింటిని ఒక్క సత్యమును తులలో పెట్టి తూఁచి ను ఆవేయి జన్నములకంటె సత్యమే బరు వగును.

కావున ఈరాజు లిరువురును సత్యమును పేరి దివ్యప్రమాణముం గావించి కాంచన జేయుదురు గాక.' 'అట్లేఅగుఁగాక'అని సర్వజ్ఞుఁ డనియె. అంతటవస్త్రాదికములు మిచ్చి దూరదర్శిమంత్రిని పూజించిరి. ఆతఁడు సంతసించి జక్కవను తోడ్కొని ని రాజు కడకు పోయెను. అచ్చట గద్దమాట ప్రకారము చిత్రవర్ణ రాజు బహుమానము సర్వజ్ఞుని సత్కరించి సంభాషించి ఆసంధికి అంగీకరించి రాజహంసకడకు పంపెను. ర్శి యనియె.— ' దేవా, మనకోరిక నెఱవేఱినది, ఇఁకను మన తావలమునకు విం దికి తరలుదము.' అంతట అందఱును తమతావుచేరి మనస్సునందు కోరుకొన్న నిని అనుభవించిరి.—

అని చెప్పి విష్ణుశర్మ ' ఇంక నేమి చెప్పుదును ? చెప్పుఁడు ' అని యడిగెను. త్త్రులు పలికిరి.— ' అయ్యా, నీయనుగ్రహంబునం జేసి సమస్త రాజ్యవ్యవహార పము నెఱింగితిమి. అందువలన మేము సుఖము గలవారమై యున్నాము.' విష్ణు యి ట్లనియె.— అట్లయినను ఇదియు నగుఁగాక.—

134 జయశీలు రగు నెల్లరాజులకును సంధివలన ఎల్లప్పుడును సంతోషము కలు గాక, సజ్జనులకు ఇడుమలు లేకుండుఁగాక, పుణ్యవంతులకు కీర్తి చిరకాలము పెరుఁ

నుచుండునుగాక, నీతి వారకాంతవలె ఎప్పుడును ఎవరియందు నెలకొని వదనమున ముద్దుగొనునుగాక, మంత్రులకు దినదినంబును మహోత్సవము అగుఁగాక.

మఱియు నిదియు నగుఁగాక.—

హిమగిరిసుతయొక్క ప్రేమకు ఇల్లుగా జాబిల్లిసిగపూవేలుపు ఎంత కాలము ఉండునో, ఎంతకాలము లక్ష్మీ మేఘమందు మెఱపువలె విష్ణుమూర్తియొక్క హృదయమందు భాసిల్లుచుండునో, ఎంతకాలము సూర్యుఁడ నెడి మిడుంగురుగలదై దావాగ్ని తుల్యమయిన యీ మేరుపర్వతము భాసిల్లుచుండునో, నారాయణపండితుఁడు రచించి యీ కథాసంగ్రహము అంతకాలము ప్రచార మొందును గాక. మఱియు;—

ఈ కథాసంగ్రహమును ప్రయత్న పూర్వకముగా వ్రాయించి ప్రచారణ నేయించినట్టి శ్రీమంతుఁడు మండలాధిపతి ధవళచంద్రుఁడు శత్రువులను జయించునుగాక!

సంధి సమాప్తము.

హితోపదేశము సమాప్తము.



